

# చతుర

అక్టోబర్ 1981

సంపుటి: 4
సంచిక: 1

## ఈ నెల సమగ్ర నవల

"స్త్రీ అంటే నాకు పరమ అసహ్యం! ప్రతి ఆడది ఒక బిచ్! ఎవరో కవి అన్నట్టుగా ఆడవాళ్ళంతా చెడ్డవాళ్ళే! అందుకే... అందుకే నేను వాళ్ళను ద్వేషిస్తాను. ఆడవాళ్ళంటే ఏహ్యం - వాళ్ళందర్నీ ప్రతిశపథ చేసి మరీ చంపాలన్నది నా ధ్యేయం" అంటూ ఉద్వేగంగా, ఉద్రేకంగా అరుస్తోన్న ఇరవైయేళ్ళన్నా నిండని ఆ క్రూరుడి మనస్తత్వం ఏమిటి? పసితనం నుండీ అతనిలో రాజుకొంటూన్న ఆ...

# కసి

ఒక మహానగరాన్నెలా గజగజలాడించ గలిగింది? అంత రాక్షసంగా అతని ఆలోచనల్ని తీర్చిదిద్దిన ఆ పరిస్థితులేటువంటివి? భయంకరమైన ఆ మానసిక విశ్లేషణను సరికొత్త పంథాలో మలచి ఆంధ్రేతర భాషల్లో సుప్రసిద్ధుడైన తెలుగు రచయిత

రాండార్ గై

మానసిక విశ్లేషణాత్మక + అపరాధ పరిశోధక నవల 'పేనిక్ ఇన్ మద్రాస్'కు

దేవరాజు రవి

స్వేచ్ఛానువాదం 'కసి' ఈ నెల చతుర సమగ్ర నవల. వైవిధ్యంకోరే పాఠకులకు ప్రత్యేక ఎన్నిక!

ముఖపత్రం : కాశ్మీర సుందరి

రెండవ కవరు : రష్యాలోని నోవోగ్రాడ్ లోగల ఒక స్మారక చిహ్నం

మూడవ కవరు : నూరేళ్ళనాటి ఒక రష్యన్ కళాఖండానికి నకలు రూపొందిస్తున్న చిత్రకళా విద్యార్థి. (ఫొటోలు : టాస్)

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.


**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



## కోల్గేట్
### డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవటం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందిం చేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

# విదేశీ పుత్రులు

అమెరికా వెళ్ళాలన్న తలంపు వస్తే చాలు. సగం తెలుగు, వెళ్ళి ఓ ఆరు రోజులక్కడ వుండివచ్చేసరికి అసలు తెలుగు మర్చిపోయే ప్రబుద్ధులెందరో వున్నారు. ఇంక అక్కడ కొన్ని సంవ






త్సరాలు పాటువుండి ఇండియా తిరిగి రాగానే ఈదేశాన్ని, ఇక్కడి మనుషుల్ని మొదటిసారి చూస్తున్నట్లు, యుగయుగాల నుండి అమెరికాలోనే పుట్టి పెరిగినట్లు కబుర్లాడే కోతలరాయుళ్ళకి కొదవలేదు మన దగ్గర. కానీ పరదేశీయులు కూడా ఇదే బాటలో నడుస్తున్నారంటే తక్కువ ఆశ్చర్యం కలుగదు.

బల్గేరియాలో వుంటున్న ఓ వ్యాపార వేత్త వ్యాపార నిమిత్తం థాయ్‌లండ్ వెళ్ళివచ్చిందగ్గర్నించీ, అతని విపరీత ధోరణి చూసి భార్యామణికి దిక్కుతోచ కుండా పోయింది. అతగాడికి థాయ్‌లండ్ లోని జీవన విధానం బాగా నచ్చింది. గౌన్లు వేసుకోవడం అలవాటున్న భార్యని చీర కట్టుకోమని సతాయించడం ప్రారంభించాడు. పోన్లే భర్త ముచ్చటెందుకు కాదనాలని వచ్చీరానట్లు చీర చుట్టబెట్టుకుంది. అంతటితో అయిపోలేదు. కూరలు వగైరాలన్నీ థాయ్ పద్ధతిలోనే వండాలని పేచీ పెట్టాడు. ఎవరెంత కష్టపడినా తిండికే గదాని వంట పుస్తకాలు తెప్పించి ఎలాగో కిందా మీద పడి వంటకాలు నేర్చుకుంది. భర్తగారు తనకోరికలకి అంతటితో ఫుల్ స్టాప్ పెడితే బావుండేది. కానీ ఆ సదరు భర్త ఓ రోజు వున్నట్టుండి ఓ పాముని బుట్టలో వేసి పట్టుకొచ్చి గంటలతరబడి దాని ఎదురుగా కూర్చొని ముగలి వాయిస్తూ దాన్ని సంతోషపెట్టడానికి ప్రయత్నించడం మొదలెట్టాడు. నిత్య కర్మకాండలా సాగే ఈ తంతుని చూసి ఓపిక పూర్తిగా నశించిన ఆ మహా ఇల్లాలు కోర్టులో విడాకులకోసం అర్జీ పెట్టుకుంది. విడాకులు మంజూరయ్యే వరకూ ఇంట్లోనే వుంటే ఇంకేం సమస్యలు తెచ్చిపెడతాడోనని ఇల్లు వదిలేసి ప్లీడరు చుట్టూ పదిసార్లు తిరిగి చివరకు చాలా త్వరగానే విజయం సాధించింది.





# చేతివ్రాత ప్రపంచం

అమెరికా చేతివ్రాత నిపుణురాలు ఫ్రాన్సిస్ రాక్‌వెల్, ప్రేమించి పెళ్ళి చేసుకొనేవారు ఎదటి వ్యక్తి చేతివ్రాతను గమనించి మరీ ముందడుగు వేయమని హెచ్చరిస్తోంది. ఎందుకంటే చేతివ్రాత తీరునుబట్టి మనిషి ఎలాంటివాడో చెప్పేయవచ్చు.

అస్పష్టంగా లేదా పెద్ద పెద్ద కొమ్ములు, తోకలు, గీతలు వుండేటట్లు సంతకం పెట్టేవారి విషయంలో జాగ్రత్తగా వుండాలి. వీరు శాడిస్ట్ స్వభావం కలిగి వుంటారు. చేతివ్రాత వ్యక్తుల ఆలోచనారీతి, స్వభావ స్వరూపాలను తెలియజేస్తుంది. అందుకని సరైన జోడీని ఎంచుకునేటప్పుడు తమ చేతిరాతకు మరీ భిన్నంగా లేని చేతివ్రాత గల వ్యక్తిని జీవిత భాగస్వామిగా ఎంచుకోవాలి. ఎంత ఒత్తిడితో రాస్తున్నారు. అక్షరాలెంత లావుగా వున్నాయి అనే విషయం కూడా గమనించాలి. "నిన్ను ప్రేమిస్తున్నా" అని నోటితో అనగానే సంతృప్తి పడకండి. ఆ మాటను రాసివ్వమనండి.



అక్షరాలు రాసేటప్పుడు ఏ వైపుకి వాలివున్నాయనేది గమనించడం చాలా అవసరం. అక్షరాలు కుడి వైపుకి వాలి వుంటే ఆ వ్యక్తి భావోద్రేకాల కనుగుణంగా ప్రవర్తిస్తాడు. ఎడమ వైపుకి వాలితే ఆలోచనల కనుగుణంగా నడుచుకుంటాడు. ఒకవేళ నిట్టనిలువుగా వుంటే సమపాళ్ళలో ఆలోచించి ప్రవర్తిస్తాడు.

అక్షరాలు వాలిన విధానాన్ని బట్టి ఆ వ్యక్తి కామ ప్రవృత్తి చెప్పవచ్చు. అక్షరాలు కుడివైపుకి వాలితే చొరవ తీసుకునే వారై వుంటారు. ఎడమ వైపుకి వాలినా, తిన్నగావున్నా శృంగార విషయాల్లో కొద్దిగా సిగ్గుపడే మనిషై వుంటాడు. కాబట్టి పెళ్ళి చేసుకోవల్సిన వ్యక్తి చేతివ్రాతను జాగ్రత్తగా పరిశీలించి మరీ అడుగు ముందుకేయండి.

# ఉ(అ)పాయం

విలువైన వస్తువులను దాచుకోవడానికి, నల్లధనాన్ని భద్రపర్చడానికి బీరువాలు, సేఫ్టీ లాకర్లు వాడేరోజులు పోయాయి. దొంగలకు అంతు దొరక్కుండా పడుకునే పక్కలకిందో, నేలలోనో, చిత్తు కాగితాల బుట్టల్లోనో, గోడకి తగిలించిన చిత్రపటం వెనకో రహస్యంగా దాచిపెట్టడం ప్రారంభించారు. ఇప్పుడు ఆ ప్రదేశాలు కూడా దొంగలకి కరతలామలకమై పోయాయి.





కొందరు నిపుణులు 'కొద్దిగా బుర్ర ఉపయోగించాలేగాని దొంగలు కలలోనయినా ఊహించని రహస్య స్థలాల్లో నగలూ, నిధులూ దాచుకోవచ్చు' అంటున్నారు. న్యూయార్క్‌కి చెందిన డేవిడ్ అనే వడ్రంగి డబ్బుదస్కం దాచుకోడానికి ఇళ్ళల్లో ఎన్నో రహస్య ప్రదేశాలు వెతికి పెడుతున్నాడు తన కస్టమర్లకి. చిన్న చిన్న వస్తువులను గోడ కమర్చే ఫేక్ ఎలక్ట్రిక్ పాకెట్‌లో భద్రంగా దాచవచ్చు పైకి ప్లగ్ పెట్టేదానిలా కన్పించినా లోపల 'గోడలో' కాళీ స్థలముంటుంది ఏవైనా దాచుకోడానికి. కుర్చీలు, టేబిళ్ళ కోడులను బోలుగా చేసి దానిలో దాచవచ్చు. పెద్ద పెద్ద వస్తువులను దాచాలనుకొంటే పుస్తకాల షెల్ఫ్ అడుగు భాగాన దాచవచ్చు పైకి మాత్రం పుస్తకాల షెల్ఫ్‌లా కన్పిస్తుంది.

ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా తెలివిగల దొంగలు కనిపెట్టేస్తుంటారు ఒకోసారి. లండన్‌లో ఈమధ్య కృత్రిమ కప్‌బోర్డు అడుగున ఉన్న 3 వేల పౌన్లు కాజేశారు. పాత వైర్‌లెస్ సెట్‌లోంచి 18 వేల పౌన్లు, బోలుగా వున్న పియానో కాలులోంచి 14 వేల పౌన్లు దొంగిలించుకుపోయారు. అందుకని నూతన రహస్య ప్రదేశాల కోసం అన్వేషిస్తున్నారనేకులు.

# దొంగల్లో దొర

వియన్నాలోని ఒక సూపర్ మార్కెట్టుకి రోజూ క్రమం తప్పకుండా ఓ ముసలాయన వస్తుండేవాడు. కర్రకాలుతో ఆయన పట్టుమని గబగబా పది అడుగులు నడవలేడు., పరిగెత్తలేడు. అందుకని ఇంట్లోవీమీ తోచకపోతే హాయిగా ఏ పార్కుకో, రెస్టారెంటుకో పోయి కూర్చోక సూపర్‌మార్కెట్టుని పట్టించాడేమిటని అక్కడి రక్షణ సిబ్బందికి అనుమానం వచ్చి ఆ పెద్దాయన


మారాం చేసేవారిని కూడా
మైమరిపించే ప్రియ
priya
'ప్రియ' ఆకర్షణలో పడనివారు లేరు.
మూత తీసి తియ్యటంతోనే ఎన్నెన్నో
రుచులూరిస్తుంది 'ప్రియ'. ఆకలి లేదని
మారాంచేసే పిల్లలు కూడా 'ప్రియ'
పచ్చళ్ళు ఉంటే ఆప్యాయంగా తింటారు.
వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300,
650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.
• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో
• అల్లం • గోంగూర • ఉసిరికాయ
• చింతకాయ • పండు మిరపకాయ • వంకాయ
ఊరగాయలు : • మామిడికాయ • అల్లం.
ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

priya

మీద ఓ కన్నువేసి వుంచారు. తర్వాత షాపులోని చిన్నచిన్న విలువైన వస్తువులా ఆహార పదార్థాల డబ్బాలు చిత్రంగా మాయమవుతున్నాయని తెలింది. ముసలాయనే తీశాడనడానికి సాక్ష్యం లేదు. పైగా తీసిన వస్తువులు దాచుకోడానికి, అతనికి పెద్ద సంచీ గాని, పెట్టెగాని లేవు. చేతులు ఊపుకుంటూ



రావడం, పోవడం మాత్రమేగదా మరి అతను చేసే పని.

సూపర్‌మార్కెట్టు స్టోర్స్‌కి చెందిన ఒక డిటెక్టివ్‌కి ఈ అరవైఏళ్ళ ముసలాయనే దొంగ అయివుంటాడు అని గట్టి నమ్మకం కలిగి అది బలపడింది. మార్కెట్ ప్రొప్రయిటర్‌తో మాట్లాడి పోలీసుల్ని పిలిపించాడు. వాళ్ళతని దుస్తులు పరీక్షించి చూస్తే ప్యాంటు, లాగు, కోటుకున్న ప్రతి జేబుకీ పెద్ద చిల్లులున్నాయి. అంతటితో వదలక అతని నించోబెట్టి వస్త్రాపహరణం చేసి చూస్తే ఏముంది. అసలు రహస్యం బట్ట బయలయింది. జేబుకున్న చిల్లుల్లోంచి దొంగిలించిన వస్తువుల్ని లోపల డొల్లగా వున్న తన కర్ర కాలులోకి జారవిడిచి బైటికి తరలించుకు వెళ్ళేవాడని తెలింది.

# మాయకుర్చీ

ఇంతవరకూ ఇళ్ళు దయ్యాలకు స్థావరాలవడం విన్నాం. కాని ఒక వస్తువుకి దయ్యం పట్టడం అరుదు. యార్క్‌షైర్‌లో థ్రిస్క్ అనే చిన్న హోటల్‌లో ఒకతను ప్రతిరోజూ తనకిష్టమైన కుర్చీలోనే కూర్చునేవాడు. ఇతను మామగార్ని హత్య చేశాడన్న కారణాన ఉరితీయబడ్డాడు. అప్పటి నుంచి అతను రోజూ కూర్చునే కుర్చీ గురించి వింత వార్తలు విన్పించడం మొదలయింది. ఆ కుర్చీలో కూర్చున్నవారు చనిపోతారని ప్రచారం జరిగింది. కాని ఓసారి ఇద్దరు వ్యక్తులు బాగా తాగి కుర్చీకి దయ్యంపట్టిందన్న వార్త అబద్ధమని రుజువు చేస్తామని చెప్పి దానిమీద కూర్చున్నారు. ఆ రాత్రే వారు ప్రయాణిస్తున్న విమానం చెట్టుకు కొట్టుకొని ఇద్దరూ మరణించారు. తర్వాత భవన నిర్మాణపు పనివాడు పందెంవేసి కుర్చీమీద కూర్చున్నాడు. తర్వాత కొద్ది గంటలకే ఓ ఇంటి కప్పుమీద నుంచి పడి మరణించాడు.

దాంతో ఆ యువకుడి తండ్రి కోరిక మీద హోటల్ యజమాని ఆ కుర్చీని

# ఉష్ . . .రహస్యం చెప్తున్నాం . . .

# వినండి . . .



కొందరు స్త్రీలు పెరిగే ధరలకంటె ముందడుగు వేసి జీవితంలో చిన్న చిన్న సుఖాలను అనుభవిస్తున్నారంటే, మీకాశ్చర్యంగా లేదా? అది ఎలా సాధ్యమో **కెనరా బ్యాంకు** మీకు చెప్తుంది.

సద్దు లేకుండా, పొదుపు చేసి కొన్నాళ్ల తర్వాత ఆ డబ్బుతో మీ కుటుంబానికి ఆశ్చర్యానందాలు కలిగించాలని ఉబలాట పడే మీలాంటి గృహిణులకే మా **బాల క్షేమ డిపాజిట్** పథకాన్ని ఆరంభించాం. మీ నిత్యకృత్యాలలో ఎదురయ్యే కొన్ని ఆర్థిక ఇబ్బందులు మీరు దాచిన ఈ డబ్బుతో సమసి పోతా యి.

ఇప్పుడు మీరుకూడా అలాంటి "గృహిణిగా" మారాలి.

"చిల్లర డబ్బులు" అని ఉపేక్షచేయకండి. గప్‌చిప్‌గా ఆకర్షణీయమైన మా **కాలక్షేమ** టి. వి. డబ్బా లో ఆ చిల్లరను వెయ్యండి. ఈ రహస్యం మీకు తెలీకుండానే ఒక పెన్నిధిగా మీకు ఆందనిచ్చి ఆనందాని కల్గిస్తుంది. ఇప్పుడు చూస్కోండి . . . మీకొొక అందమైన చీర – మీ అబ్బాయికి సైకిలు – లేదా మీ యింటికొక ప్రత్యేకతనిచ్చే వస్తువేదైనా కొనగలరు కదా!

మీ చిన్నరహస్యాన్ని పెద్ద పెన్నిధిగా మార్చండి.

మా యితర పథకాలు

**కామధేను**

**నిరంతర**

**విద్యానిధి**

# కెనరా బ్యాంక్




**(జాతీయ బ్యాంక్)**
**దేశము మొత్తమున 1,300 కు పైగా శాఖలు కలవు.**

తీసి పాతసామాన్ల గదిలో పారేశాడు. చాలా సంవత్సరాల తర్వాత ఆ హోటల్ కొన్న కొత్త యజమాని దయ్యం కుర్చీని తీయించి యార్క్‌షైర్ వస్తు ప్రదర్శన శాలకు బహూకరించాడు. ఆ కుర్చీ నేల మీద వుంటే కూర్చోవాలన్న కోరిక కలగ వచ్చు గనక దాన్ని కప్పుకి వేలాడ దీయాల్సిందని కోరాడు అధికారులను. ఇప్పటికీ ఆ కుర్చీ మ్యూజియంలో దర్శన మిస్తుంది.

## నిరసన ప్రదర్శన

లండన్‌లోని ట్రఫాల్గర్ స్క్వేర్ వద్ద ఎప్పుడూ ఏదో ఒక నిరసన ప్రదర్శన జరుగుతూనే వుంటుంది. అక్కడి వారికది కొత్తేమీకాదు. అసలు ట్రఫాల్గర్ స్క్వేర్ నిర్మాణం దగ్గిరనుంచీ అక్కడ నిరసన ప్రదర్శనలు జరుగుతూనే వున్నాయి. దాన్ని అధికారికంగా ప్రారంభోత్సవం చేసేటప్పుడు కూడా నిరసన ప్రదర్శన జరిగింది. 'నెల్సన్' స్తంభం దగ్గర రెండు సింహాలను ప్రతిష్ఠించేప్పుడు వాటి డిజైన్ బావుండలేదని ప్రజలు సింహాల బొమ్మలమీద రాళ్ళు విసిరారు. ఇక ఆ బొమ్మలను రూపొందించిన 'ఎడ్విన్ లాండ్‌సర్' అన్నా కూడా ప్రజలకి పడలేదు. కారణం అతను పక్కా తాగుబోతు. ఎప్పుడూ అతిగా తాగి చిరాకు కలిగేలా ప్రవర్తించేవాడు.

ఇక ట్రఫాల్గర్ స్క్వేర్ నిర్మాణ సమయంలో వున్న పనివారు సోమరిపోతులు కావడాన, పని ఎగ్గొట్టడాన దాదాపు దాని నిర్మాణం 30 ఏళ్ళు పట్టింది. ప్రజలు దీనిక్కూడా నిరసన తెలిజేశారు. ఇక 18 టన్నుల బరువుగల 'నెల్సన్' విగ్రహాన్ని ఎలా గైతేనేం స్తంభంమీద నిలబెట్టారు. తీరా చూస్తే ఆ స్థంభం అనుకున్నదానికన్నా 14 అగుగులు ఎక్కువ ఎత్తు వచ్చిందని తేలింది. ఇది పనివారి నిర్లక్ష్యంవలన జరిగినపొరపాటు.

అప్పటినుంచి ఇప్పటి వరకూ ఏదో ఒక కారణానికి ట్రఫాల్గర్ స్క్వేర్ వద్ద నిరసన ప్రదర్శనలు మాత్రం జరుగుతూనే వున్నాయి.

"అదిగో మళ్లా..!చేప్తే వినవ్ కదా..!" సహనా కోపం నటిస్తూ మూతి బుంగలా పెట్టింది మంగళ.

కృష్ణ ఆమె కళ్లల్లోకి చూడడానికి వృథాప్రయత్నం చేశాడు.

అంతటి అమావాస్య చీకటిలోనూ కృష్ణ కళ్లకు మంగళ స్పష్టంగా కనిపిస్తోందికాబోలు.

ఆమెను మరోసారి దగ్గరగా హత్తుకుని తమకంగా ముద్దుపెట్టుకున్నాడు.

వారించడానికి ఎలాటి ప్రయత్నమూ చెయ్యలేదు మంగళ.

ఎదురుగా సువిశాలంగా పరుచుకుని నిర్విరామంగా తన కర్తవ్యాన్ని తాను చేసుకుపోతోంది ఇలియట్స్ బీచ్ లో సముద్రం.

దట్టంగా అల్లుకున్న చీకటి చిక్క-తెరల మధ్య, పెరిగి విరిగే అలలు సృష్టించే తెల్లటి నురుగు లీలగా కనిపిస్తోంది. గాలి తన ఇష్టం వచ్చినట్లు పరుగులు తీస్తోంది.

అల్లరి గాలి రేపే ముంగురులను సర్దుకుంటూ, కృష్ణ బాహుబంధాలనుంచి సున్నితంగా తప్పించుకుంటూ "ఇక వెళ్దాం పద...బాగా ఆలశ్యం అయిపోయింది" అంది మంగళ.

కారు వెనుక సీటు, వారి అల్లరికి తెగవిసుక్కుంటూ మరీ విధేయత ప్రకటిస్తోంది.

"అబ్బ...అప్పుడేనా...' అన్నాడు మంగళ చెక్కిళ్లు నిమురుతూ కృష్ణ.

దూరంగా మిణుకు మిణుకు మంటూ జాలర్ల గుడిసెలలోంచి ఆముదపు దీపాలు దోబూచు లాడుతున్నాయి.

ఇరవై తొమ్మిదేళ్ళ మంగళ బొద్దుగా గుండ్రని ముఖంతో, ఆకర్షణీయమైన కళ్లతో ఇట్టే ఆకట్టుకుంటుంది ఎంతటి మగాణ్నయినా.

తృప్తి తీరా సరదాలన్నింటినీ హాయిగా తీర్చుకోవడం, అల్లరి పెట్టే జిహ్వను ఏనాడూ వారించక పోవడం కారణంగా ఆమె కాస్త లావుగా,ఎప్పుడూ ఉల్లాసంగా వుంటుంది.

డాక్టర్లు పాపం చెప్పి చెప్పి విసిగిపోయారు కానీ ఆమె డైటింగు విషయం కేవలం ఎవరికో చెప్తున్నట్టు వింటుంది.

భర్త సదాశివన్ తరుచూ క్యాంపులకు వెళ్తూండడం మంగళకు చాలా సరదాగా వుంటుంది.

అందుకే కృష్ణతో ఆమెస్నేహం అలా అలా పెరిగి అది రహస్య ప్రణయంగా మారిపోయింది. భర్తతో పోలిస్తే కృష్ణ బాగా ఉంది, బాగా ఖర్చుపెట్టి అన్ని సుఖాలూ అందుబాటులోకి తేగల నవ యువకుడు. అందుకే తప్పు చేస్తున్నానను కుంటూనే అందుకు అలవాటు పడిపోయింది.

కృష్ణతో శృంగార లీలల మయమైన మలయాళ సినిమాలకు వెళ్లడం, చివర సీట్లలోకూర్చుని నానాఅల్లరీ చేసుకోవడం, మద్రాసుకు బాగా దూరంగా వుండే సైదాపేట, రాయపేట ప్రాంతాల హోటళ్ళలో ఎంచక్కా కోరిన తిండి తినడం, కృష్ణ కారు వెనుక సీట్లో చీకటి రాత్రుల మధ్య సముద్ర తీరంలో కామ కలాపాలు సాగించడం ఆమెకు ఎడతెగని తృప్తినీ, సుఖాన్నీ కలిగిస్తుంది.

తనంటే పడిచచ్చే కృష్ణను చూస్తే చాలు కరిగిపోతుంది మంగళ. అదే ఆడవాళ్ల లోని పెద్ద బలహీనతేమో.

న్యాయశాస్త్రం చదువుతున్న కృష్ణ బాగా డబ్బున్న కుటుంబానికి చెందినవాడు. మైలాపూర్‌లో నివాసం.

పాకశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించడానికి, అక్కడికి దగ్గర్లోనే వుండే మంగళ తరచూ కృష్ణ ఇంటికి వస్తూండేది. కృష్ణ వదినగారు మంచి వంటగత్తె. ఆమె వద్ద రక రకాల వంటకాలతో పాటు కృష్ణ చూపుల పరిభాషలో ఆంతర్యాలను కూడా తెలుసుకొంది మంగళ.

అరకంగా పరిచయమైన మంగళ కృష్ణకు శృంగార నాయిక అయిపోయింది.

కృష్ణ అసలే జీవితాన్ని రుచిచూసే వయసులో పైకి వస్తున్నవాడు. అందం అనే మాటకు అతని అర్థాలు అతనివి. సునాయాసంగా లభ్యమవుతున్న కొత్త కొత్త అనుభూతుల్ని సినిమాల్లో తాను సగం చూసి మిగతా సగం సెన్సార్ పుణ్యాన చూడలేక పోయిన ఘట్టాల్తో పోల్చుకుని ఆనందించే వయసు అది.

"అబ్బబ్బ...చెప్తే వినవ్ కదా... తొందరగా పోదాం పద.

పది గంటల ప్రాంతంలో ఆయన పూర్నుంచి వచ్చేస్తారు. వచ్చేసరికి ఆయన కిష్టమైన సాంబారు, బంగాళా దుంపల వేపుడు, గోంగూర పచ్చడి రడీచేసి వుంచాలి. ఇక వెళ్దాం పద" ఆమె గొంతులో తొందర స్పష్టంగా వినిపిస్తోంది.

"ఇంకా చాలా టైముందిగా..."

"ఏం టైముంది... ఇప్పుడెంతైందో చూశావా?" అంటూ అతని చేతిని ఆ చీకటిలో అతని కళ్లముందుకు జరిపింది.

రేడియం డయల్ వాచి చెప్పిన టైం చూసుకుని అయిష్టంగా మంగళను వదిలాడు.

చేతిసంచినుంచి రుమాలు తీసి, ముఖం తుడుచుకుని కారులో లైటు ఆన్‌చేసి, అద్దంలో ఓ సారి ముఖం చూసుకుంది మంగళ.

"అందంగానే వున్నావులేవోయ్... లైటార్పు ... ఎవరేనా చూడగలరు" అన్నాడు కృష్ణ,అక్కడ చీకటి సృష్టిస్తూ.

దూర దూరంగా మనుషులు కదలుతున్నారు. స్కూటర్లు, కార్లు బయలుదేరే శబ్దాలు వినిపిస్తున్నాయి.

"ఒక్కక్షణం" అంటూ కారు దిగింది మంగళ.

"ఎక్కడికి చీకట్లో...?" అడిగాడు కృష్ణ.

"వన్‌మినిట్" అంటూ ముందుకు నాలుగడుగులేసింది మంగళ.

లైట్ హౌస్ మెరిపించిన మెరుపులో మంగళ కాస్త పక్కగా వున్న చెట్ల గుబురుల్లోకి వెళ్లడం గమనించి చిన్నగా నవ్వుకున్నాడు కృష్ణ.

తనకిష్టమైన ఖరీదైన విదేశీ సిగిరెట్ వెలిగించి, తృప్తిగా పొగ పీల్చాడు కృష్ణ.

అతని యౌవన జీవితంలో మంగళ రెండవ స్త్రీ. అయితే స్త్రీ అంటే ఏమిటో, ఆమె అందించే సుఖ సౌఖ్యాలు ఎంత మధురంగా వుంటాయో చవిచూసింది మంగళలోనే.

అంతకు ముందెప్పుడో పద్దెనిమిదో ఏట కాబోలు, ఇంట్లో పనిచేసే ఓ ఇరవై ఏళ్ల అందమైన పనిపిల్లతో కాస్త గంధం నడపక పోలేదు. ఆ సందర్భంలో తండ్రికి దొరికిపోవడం, అతను నానా చివాట్లూ పెట్టడం–అదొక చేదు అనుభవం. అయితే ఆమె రుచి చూపిన తీపి అతనిని నిలవనియ్యలేదు. బహుశ ఆ తర్వాతే అందమైన ఆడవాళ్లను చూడాలనీ, వాళ్లతో...అనీ బలమైన కోర్కె తీవ్ర

# అద్దె భార్య...

"నేను అందగాణ్నని నాకు గర్వం...ఏ ఆడదైనా నేను పిలిస్తే వస్తుందని నా అహంకారం. కాని అది నిజం కాదని తేలిపోయింది... నా గర్వం వర్షించిన మేఘంలా విడిపోయింది... నిన్న నువ్ ఇంట్లో లేనప్పుడు...నీలాంటి కురూపిని చేసుకుందన్న ఆలోచనతో నీ భార్యతో చెడ్డగా ప్రవర్తించబోయాను. కాని ఆమె దేవతరా... నాకు బాగా బుద్ధి చెప్పింది 'నా భర్త నాకు దేవుడు. నన్ను దేవతలా చూసుకుంటాడు. మా సంసారాన్ని, మా కుటుంబాన్ని నాశనం చెయ్యకు. అందం ఒక్కటే కాదు...మంచి మనసు కూడా ఉండాలి. అప్పుడే నువు మనిషివి అవుతావు' అంది. నన్ను క్షమించరా! అలాంటి భార్య ఉన్న నీవు అదృష్టవంతుడివిరా!" అని వాపోయాడా చుట్టపు చూపుగా వచ్చి వారం రోజులుండి వెళ్తున్న మిత్రుడు...ఆశ్చర్యపోయాడతను. కారణం ఆమె నిజంగా తన భార్య కాదు. వారం రోజులపాటు భార్యగా నటించేందుకు అద్దెకు తీసుకురాబడిన వేశ్య. ఒక వేశ్య అలా ప్రవర్తించటం సంభవమా...! ప్రఖ్యాత తమిళ రచయిత్రి అనూరాధారామన్ కథ "అద్దె భార్య" అక్టోబర్ నెల 'విపుల'లో చదివిచూడండి.

## విపుల

132 పేజీలు
రెండు రూపాయలే!



'విపుల' పాఠకులకు అందజేసే వివిధ భాషల కథానికా సుమ సౌరభంలోని వైవిధ్యం అనంతం! ప్రపంచంలోని అనేక భాషల నుండి సేకరించిన విశిష్ట కథానికలకు నెలవు 'విపుల' కథా ప్రియులకు షడ్రసోపేత విందు 'విపుల'

'విపుల'లోని అనేక భాషల విశిష్ట కథలు మిమ్మల్ని ఆసక్తితో చదివింప జేస్తాయి.

తెలుగులో మరే పత్రిక అందించని వైవిధ్యం గల విభిన్న భాషల విశిష్ట కథలకు ఏకైక వేదిక 'విపుల'

వేసుకుంది.

కాలిన సిగరెట్టు చెయ్యి చురుక్కుమని పించింది. కాచు కిటికీలోంచి బయటకు విసిరేసి- 'ఇదేమిటి...మంగళ ఇంకా రాదేమిటి?' అనుకున్నాడు.

విసుగ్గా కారు తలుపు తీసి "మంగళా" అని కేకేసి,మరో సిగరెట్ వెలిగించాడు.

మంగళ ఇంకా రాలేదు.

కారులోకి వంగి, రేడియో ఆన్‌చేశాడు. ఏటోనానాచెత్తాపోగేసి రాసిన సినిమా పాట వస్తోంది. చికాకేసి దాని నోరు నొక్కేశాడు. తనకిష్టమైన పాశ్చాత్య సంగీతం బంధించబడిన కేసెట్స్ తీసుకు రానందుకు విసుక్కున్నాడు.

మంగళ ఇంకా రాదేమిటి? ఈ చీకటిలో ఈ వంటరితనంలో నన్ను ఆట పట్టించడానికి తమాషా చెయ్యడం లేదుకదా? ఓసారిలాగే తను చేసిన చిలిపి పనికి కుహనా కోపంతో, సినిమా మధ్యలో హాలు బయటకు వచ్చేసింది. టాయ్‌లెట్‌కు వెళ్ళి వుంటుందనుకున్న తనకి ఆశాభంగమే మిగిలింది. పదినిమిషాలైనా రాకపోయేసరికి తానూ బయటకు వచ్చి గేట్ మెన్‌ను అడిగితే పాస్ తీసుకోకుండా ఆమె బయటకు వెళ్ళిపోయినట్టు చెప్పాడు.

'ఒకొక్కసారి ఈ ఆడవాళ్లు చాలా విచిత్రంగా ప్రవర్తిస్తూంటారు. దానికి సరైన కారణం బోధపడదు. ఎందుకలా చేస్తారో...' గొణుక్కున్నాడు అనాడు కృష్ణ.

'ఇప్పుడు నన్ను కంగారు పెట్టడానికి గాని అలా రోడ్డుకేసి నడిచి వెళ్ళిపోలేదు కదా ఈ చీకట్లో' అనుకున్నాడు.

అలా అనుకోగానే అతనికి చాలా భయం వేసింది. వడి వడిగా ఆమె వెళ్ళిన దిక్కుకేసి నడిచాడు.

"మంగళా .... మంగళా" అని పిలిచాడు.

సముద్రపుహోరు, రివ్వున వీచేగాలి- వీటిలో 'మంగళ' పేరు మిళితమై అస్పష్టమైంది.

ఆ చెట్ల గుబుర్ల మధ్యనుండి ఇటూ అటూ పిచ్చిగా తిరిగి, కంగారుగా మంగళను కేకేశాడు కృష్ణ.

ఆమె అక్కడ లేదు.

చెట్ల గుబుర్లు దాటి, దూరంగా కని పిస్తున్న రోడ్డుకేసి నడిచాడు. అతను నడుస్తున్నప్పుడు రేగిన సముద్రపు ఇసుక అతని భయాన్ని, కంగారుని తెలియజేస్తోంది.

చీకట్లో తడబడుతూ, మంగళను పిలుస్తూ అతను రోడ్డు చేరాడు.

కళ్లు మరీ పెద్దవి చేసుకుని రోడ్డు పక్కన వుండే తురాయి చెట్ల మొదళ్ళ కేసి చూశాడు.

ఓ తురాయిచెట్టు వెనుకగా ఆచీకట్లో మంగళ శవం పడివుంది.

ఆమె బ్రా ఆమె మెడను బలంగా చుట్టుకుని వుంది. కళ్ళు భయంకరంగా చూస్తున్నాయి నిర్జీవంగా.

ఆమె ఎడమ చెవి స్థానంలో రక్తం స్రవిస్తోంది. భయంకరంగా అది కోసెయ్యబడింది.

అప్రతిభుడై స్థాణువులా నిల్చుండి పోయాడు కృష్ణ. అతని నోట మాట పెగలలేదు.

శరీరమంతా చెమటతో నిండిపోయింది.

పిచ్చివాడిలా కారు కేసి పరుగు లంఘించుకున్నాడు.

* * *

మద్రాసు మహాపట్నంలో తెల్లవారే

సరికి ఈ హత్యోదంతం ఒకముఖ్య ప్రస్తావనగా మారిపోయింది.

'ఇలియట్స్ బీచ్‌లో అందమైన స్త్రీ హత్య' అనే ప్రముఖమైన శీర్షికతో స్థానిక పత్రికలు వార్త ప్రచురించాయి.

దారిన పోతున్న ఓ జాలరి మంగళ శవాన్ని చూసి దగ్గరగా వున్న పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు చేశాడు.

హుటాహుటి పోలీసు బలగం రంగంలోకి దిగింది. ఆ మర్నాటి సాయంత్రానికిగాని శవం వివరాలు తెలియలేదు.

రాత్రి పది గంటలకు ఇంటికి వచ్చిన సదాశివన్ భార్య మంగళ సినిమాకు వెళ్ళివుంటుందని, ఘడియకో, గంటకో వచ్చేస్తుందని తెల్లవార్లూ ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

ఇంట్లో పనిమనిషి మంగళ సినిమాకి వెళ్ళి వుంటుందని అనడంతో సదాశివన్ రెండో ఆట వదిలే వరకూ ఆమె కోసం వేచివున్నాడు.

గంటలు గడుస్తున్నకొద్దీ అతనిలో ఆతృత, కంగారు ఎక్కువై దగ్గరలో వున్న మైలాపూర్ పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు చేశాడు.

బీచ్‌లో దొరికిన శవాన్ని గుర్తించవలసినదిగా సదాశివన్‌ను కోరారు పోలీసులు.

మంగళ శవాన్ని చూసిన సదాశివన్ చిన్న పిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు.

అంత క్రూరంగా తన భార్యను హత్య చేసిన వాళ్లను నానా తిట్లు తిట్టాడు.

అసలీ హత్య ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో, మంగళ బీచ్‌కు ఎందుకు వెళ్ళిందో – అంతా అయోమయంగా తోచింది సదాశివన్‌కు.

అతనికి తన భార్యమీద ఎనలేని విశ్వాసం. పతివ్రతల కోవలో వుండవలసిన స్త్రీ అని అతని నమ్మకం.

ఆమెకూ, కృష్ణకూ మధ్య అక్రమ సంబంధం వుందన్న సంగతి అతనికి తెలీదు.

ఎవరో కుట్రపన్ని, మాయోపాయం చేసి తన భార్యను బలాత్కారంగా ఎత్తుకుపోయి వుంటారని అతను వాపోయాడు. ఆమె నగలను దోచుకునేందుకు జరిగిన హత్య అయివుంటుందని భావించాడు.

"అయితే దొంగతనమే ప్రధాన కారణం అయితే, ఆమె ఎడమచెవి రింగు మాత్రమే ఎందుకు దోచుకున్నట్టు? మిగతా నగలన్నీ చెక్కుచెదరలేదెందు చేత?" అన్నారు పోలీసులు.

పోలీసులు అడిగిన ప్రశ్న సమంజసంగానే తోచింది సదాశివన్‌కు. అతనికంతా అయోమయంగా వుంది.

ఇంతలో డాక్టర్స్ రిపోర్టు వచ్చింది.

హత్య కావించబడ్డానికి కొద్దిసమయం ముందు ఆమె కామక్రీడలో పాల్గొన్నదనీ, అది బలవంతంగా జరిగింది కాక ఆమె అంగీకారంతోనే జరిగి వుండవచ్చనీ రిపోర్టులో వుంది. అది 'బలత్కారం' అయితే ఆమె పెనుగులాడిన చిహ్నాలు వుండాలి. అలాంటివేం లేవు.

దొంగతనం, రేప్–ఇవేవీ కానప్పుడు మంగళ ఎందుకు హత్య చెయ్యబడింది?

హంతకుడి ఆంతర్యం ఏమైవుంటుంది? అర్థరహితమైన ఈ హత్య ఎందుకు చేసినట్టు?

ఇన్‌స్పెక్టర్ సోము రంగంలోకిదిగి నేరపరిశోధన ప్రారంభించాడు.

మంగళ తరచూ కృష్ణ ఇంటికి వచ్చి

 

పోతూండేదనే వార్త తెలుసుకొని ఇన్‌స్పెక్టర్ సోము కృష్ణ ఇంటికి వచ్చాడు.

పోలీసులను చూడగ్గానే భయపడి పోయాడు కృష్ణ. అయితే ఆ కంగారేమీ కనిపించకుండా వుండేందుకు శతథా ప్రయత్నించాడు.

అతని వదినగారు భావన ఈ దృశ్యం చూసి కళ్ళ నీళ్ళ పెట్టుకొని—

"ఏదో వంటావార్పూ నేర్చుకునేందుకు మా ఇంటికి వచ్చి వెడుతుండేది. అంతకు మించి ఆమె గురించి మాకేం వివరాలు తెలుస్తాయి? మా మరిది కృష్ణ అప్పు డప్పుడు ఆమెను వాళ్ళ ఇంటిదగ్గర డ్రాప్ చేస్తూండేవాడు. అంతే" అంది.

* * *

పోలీసు కమీషనర్ జాన్ సెల్వమ్ అలసటగా ఇల్లు చేరి, డ్రెస్ మార్చుకు న్నాడు.

రంగురంగుల బాతిక్ లుంగీ, లాల్చీ వేసుకుని బాత్‌రూంకి వెళ్ళి కాళ్లూ చేతులూ, ముఖం కడుక్కొని వచ్చాడు.

"మంచి నీళ్లు కావాలా ?" నవ్వుతూ అడిగింది అతని భార్య.

"వద్దు... వడ్డించెయ్" యధాలా పంగా అన్నాడు జాన్.

"అన్నట్టు మర్చిపోయాను. మీపేరస ఏదో పార్శెలు వచ్చింది. వుండండి తెస్తాను" అంటూ చిటికెలో ఆమె ఓ చిన్న పార్శెలు అతని ముందు వుంచింది.

సాలోచనగా ఆపార్శెలు వేపు చూశాడు జాన్.

అది రివరెండ్ ఫాదర్ లూగీపెజోని నుంచి వచ్చింది. "ఇదేమిటి చెప్మా ఈయన నుంచి వచ్చింది?" అనుకుంటూ పార్శెలు విప్పసాగేడు జాన్.

ఫాదర్ సాధుస్వభావంగల సహృద యుడు. నగరంలోని పేదలపాలిటి పెన్నిధి. చాలా ఇళ్లల్లో దీపం పెట్టగానే ఆయనను తలుచుకుంటారు. అంతమంచి వ్యక్తి ఫాదర్.

విప్పిన పార్శెల్‌లోకి చూసి సంభ్ర మాశ్చర్యాలలో మునిగిపోయాడు జాన్.

అది ఒక చెవి. దానికి వజ్రపురింగు వుంది. మంగళనుండి వేరుచేయబడ్డ చెవి అయివుంటుందా?

అతని ఆలోచనలు పాదరసంలా పరిగెత్తాయి.




బొంబాయి, ఢిల్లీ, బెంగుళూరు వంటి మహాపట్టణాలతో పోల్చి చూస్తే పొడుగు వెడల్పుల సంగతికేం గానీ, క్షణక్షణ ప్రవర్థమానమైన నాగరికత, ఫేషన్లు, విశృంఖల విహారం, బాధ్యతా రహిత ప్రవర్తన, పెచ్చుపెరిగిన స్వార్థ పరత ఇవన్నీ ఇంకా మద్రాసు పట్టణాన్ని కబళించలేదనిపిస్తుంది.

మెచ్చుకోదగ్గ సత్సాంప్రదాయం, మనిషికీ మనిషికీ మధ్య అపూర్వమైన ఆత్మీయత, ఆప్యాయత, ఒకరికొకరు సహాయ సహకారాలు అందించుకుందా మనే మంచి మనసు, దైవభక్తి వంటివి ఇంకా మద్రాసు పట్టణంలో పుష్కలంగా

కనిపిస్తాయి.

కానీ, మంగళ హత్యాకాండతో అట్టుడిగి పోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో, ప్రతీ వ్యక్తీ భయభ్రాంతుడై పరపీడన పరాయణత్వమనే పిశాచి మన పట్టణాన్ని కబళించి వేస్తున్నదనే అనుమానంతో పిడికిట ప్రాణాలు పెట్టుకుని తిరుగుతున్నాడు.

ముఖ్యంగా స్త్రీలెవరూ ఒంటరిగా ఎక్కడికీ కదలడం లేదు. దీపాలు పెట్టాక అస్సలు స్త్రీ అనే శాల్తీ ఎక్కడా కనిపించడం మానేసింది.

ఏ నిమిషంలో ఏ ఘోరం జరుగుతుందో, ఏ భయంకర వార్త వినాల్సి వస్తుందో అని ప్రతివ్యక్తి అంతర్మధనం అనుభవిస్తున్నాడు.

కమిషనర్ జాన్ తన కార్యాలయంలో కూర్చొని మంగళ హత్యకు సంబంధించిన కాగితాలు తిరగేస్తున్నాడు.

తనకు వచ్చిన చెవి పేథలాజికల్ లేబొరేటరీకి పరీక్షకోసం పంపించాడు.

దాని రిపోర్టు ఘడియకో, క్షణానికో రావాలి.

అతని దృష్టి హంతకుడి వేపు మళ్ళింది.

అటు నగలకోసమూకాక, ఇటు మాన భంగంమూకాక మంగళను ఎందుకు హత్యచేసినట్టు? చేసిన హత్యానంతరం చెవి మాత్రమే వేరుచేసి, తన పేరనే ఎందుకు పంపినట్టు? అదిన్నీ అత్యంత సాధుస్వభావుడూ, మనీషి అయిన ఒక క్రిష్టియన్ ఫాదర్ పేరుతో? ఏమిటీ హంత కుడి ఆంతర్యం?

ఇది ఎవరో పిచ్చివాడి చేష్టకాదుకదా?

పిచ్చివాడే అయితే ఇంత పకడ్బందీగా ఏ ఆచూకీ వదలకుండా ఇంత ఘోర హత్య చెయ్యగలడా?

నిశ్చయంగా ఇది ఎవరో కావాలని ఒక పథకం ప్రకారం చేసిన హత్య!

మంగళ ఒక్కర్తీ నగరానికి బాగా దూరంగా వుండే ఇలియట్స్ బీచ్‌కి ఎందుకు వెళ్ళినట్టు? మైలాపూర్‌లో వుండే వాళ్లు శాంథోమ్ బీచ్‌కి వెళ్తారు. అంత కన్నా ప్రపంచ ప్రసిద్ధి పొందిన మెరీనా బీచ్‌కి వెళ్తారు గానీ, ఇంత దూరానవున్న ఇలియట్స్ బీచ్‌కి వెళతారా?

ఆమె ఒక్కర్తీ వెళ్ళివుండడం అసం భవం. నిశ్చయంగా మరో వ్యక్తి ఎవరో వుండి వుండాలి. ఆ వ్యక్తి మగవాడే అయివుండాలి. అతనే ఈ హత్య చేసి వుండకూడదా?

మెడికల్ రిపోర్టు ప్రకారం హత్యకు కొద్ది సమయం ముందుగా ఆమె సంభో గంలో పాల్గొంది. అంటే కచ్చితంగా ఆమెకో ప్రియుడు వుండితీరాలి. అతనే ఈ హత్య చేశాడా?"





"సర్..."

"యస్..."

"మెడికల్ రిపోర్టు, ఇతర ఇన్వెష్టి గేషన్ రిజల్ట్సూ వచ్చాయి" అంటూ ఇన్‌స్పెక్టర్ ఫైలు అందించాడు.

జాన్ ఫైలు అందుకుని నిశితంగా చూశాడు.

తనకు వచ్చిన చెవి మంగళ నుండి వేరు చేయబడ్డ చెవిగానే రిపోర్టు వచ్చింది.

హత్య జరిగిన చోట రక్తపు డాగులు గాని, ఇతర ఆధారాలు గాని ఏమీ దొరక లేదు.

హత్యాస్థలానికి కొద్ది దూరంలోవున్న కొన్ని చెట్లగుబురుల దగ్గర ఒక మనిషిని ఈడ్చుకుంటూ రోడ్డుకేసి వెళ్ళిన గుర్తులు ఇసుకలో కన్పించాయి. అలా మంగళ శవాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళిన వ్యక్తి టెన్నిసు బూట్లు వేసుకున్నట్లు అనుమానింపబడింది.

ఇంతకు మించి మరే ఇతర ఆధారాలూ దొరకలేదు. ఆ రిపోర్టుచూస్తూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు కమీష నర్ జాన్.

* * *

రజనీ ఉమాపతి వంటరిగా అన్నానగర్ బస్తాపులో నిల్చుని వుంది. ఆమె 'వజీర్ ఆలీ' నడపించే ఓ ప్రైవేటు సంస్థలో స్టెనోగా వుంటోంది.

పెద్ద అందగత్తెకాని రజని సౌందర్య పోషకాలు, రంగురంగుల బట్టలు, నిత్య నూతన అలంకారాలు — వీటితో చాలా అందంగా కనిపించాలనే తపనతో సతమతమౌతూంటుంది.

ఆమె మార్కెటింగ్‌లోనూ, మాస్ కమ్యూనికేషన్‌లోనూ, జర్నలిజంలోనూ డిప్లొమాలు సంపాదించింది బొంబాయిలో వుండే రోజుల్లో.

ఆమె మంచిరచయిత్రిగా స్థిరపడాలనే ప్రయత్నాలు చాలా చేసింది. తనకు వచ్చే ఆలోచనలన్నీ చేతికొచ్చిన కలంతో, చిత్తం వచ్చిన రీతిలో కాగితాల్నిండా నింపేసి, ఎడ్రసు దొరికే ప్రతి పత్రికకూ పంపేసి, ఎంతో దీక్షగా పోస్టుమేన్ కోసం ఎదురుచూసేది.

పాపం పోస్టుమేన్ వచ్చేవాడు కానీ తెచ్చేది మాత్రం ఆమె రచననే! పత్రికాధిపతులు 'మీ రచన ప్రచురించే అవకాశం లేకపోయినందుకు బోల్డు చింతిస్తున్నాం' అంటూ మర్యాదగా రాసిన ఉత్తరంతోపాటు తన రచన చూసుకుని, కొన్నాళ్ళకి విసిగి కలం సన్యాసం చేసింది.

ఈలోగా మద్రాసులో వున్న దూరపు బంధువు ఉమాపతితో ఆమె వివాహం జరిగిపోయింది.

పెళ్ళవడం, పెద్ద ఎడం లేకుండా వరసగా ఇద్దరు మగ పిల్లలు కలగడం, వాళ్లు శ్రద్ధగా స్కూళ్ళకు వెళ్ళే వయసుకు ఎదిగిపోవడం అంతా చకచకా జరిగిపోయాయి.

ఉమాపతి అనేక బ్రాంచీలు వున్న ఓ ప్రైవేటు షిప్పింగ్ కంపెనీలో ఆడిటరు. సాధారణంగా తిరుగుడు ఉద్యోగం.

అతను కేంపులకు, పిల్లలు స్కూళ్లకు వెళ్ళిపోగానే రజనికి అసలు తోచేదికాదు. ఏదేనా ఉద్యోగంలో చేరితే కాస్త వ్యావృత్తిగా వుంటుందని అనుకుంటున్న తరుణంలో, ఉమాపతి బాస్ ఏర్పాటు చేసిన ఓ పార్టీలో వజీర్ ఆలీతో పరిచయం అయింది.

అతనికి ఒక అడ్వర్టైజ్ మెంట్ కంపెనీ వుంది. రకరకాల వ్యాపారాలకు చెందిన ఎందరో వచ్చి వెళ్తూంటారు.

ఎగ్మూర్‌లో వున్న వజీర్‌ఆలీ ఆఫీసులో ఆమె స్టెనోగా చేరిన తర్వాత ఆమె చాకచక్యంవల్ల ఆలీ బిజినెస్ బాగా పుంజుకుంది. అందుచేత ఆమెకు అతను కాస్త ఫ్రీ హేండిచ్చి, మెచ్చుకోలుగా చిన్న చిన్న బహుమతులు ఇస్తూండేవాడు.

రంగు రంగుల బట్టలు వేసుకోవడమన్నా, సువాసనలు వెదజల్లే పరిమళ ద్రవ్యాలు వాడడమన్నా రజనికి అత్యంత ఇష్టం. సరిగ్గా ఇదే అభిరుచి వున్న వజీర్ ఆలీ రజనికి ఎక్కువగా విదేశీ పరిమళ ద్రవ్యాలు బహుకరించేవాడు.

రజనికి ఇది ఇష్టంలేదు. అయినా పెద్దగా అభ్యంతరం పెట్టిందీలేదు. ఆలీ ఏమంత చెప్పుకోదగ్గవాడేంకాదు. కానీ, పరస్పరం సద్భావంతో కలసి పనిచేసుకుపోతూ రావటంతో ఇద్దరిమధ్యా అనుబంధం పెరిగి అది సాన్నిహిత్యంగా మారటానికి ఎంతో కాలం పట్టలేదు. అది అలా పెరిగి హద్దులు దాటినా రజని అడ్డుపడలేదు. అలాగని తనంతట తానుగా ప్రోత్సహించనూ లేదు.

తాను స్వతహాగా పెద్ద అందగత్తె కాదని ఆమెకు తెలుసు. అందునా ఇద్దరు బిడ్డలతల్లి. ఇక తనలో ఏం పెద్ద అందం వుందని అనుకుంటుంది.

అయితే తనలోనూ ఏదో అపూర్వ సౌందర్యాన్ని చూసి దాన్ని ఆరాధించే ఇతర పురుషుడు వున్నాడనే భావన ఏ స్త్రీనైనా నిలవనియ్యదు.

రజని కూడా అదే కోవకు చెందింది. ఆలీ చొరవను ఆమె ఏనాడూ వారించలేదు.

ఆరోజు ఆఫీసు టైమైపోయినా, చేతిలో పని పూర్తయ్యాకే వెళ్దామని పడివడిగా ఆమె పని చేసుకుంటోంది.

 చతుర ... 25

పనిపట్ల ఆమె శ్రద్ధకు అలీ ఎంతో ఆనందించేడు. ఆ రోజు తాను ప్రత్యేకంగా తీసుకొచ్చిన రెండు ఇంపోర్టెడ్ సెంట్ బాటిల్స్‌లో ఒకటి ఆమెకు ఇద్దామని ఆమె టేబిల్ దగ్గరగా వచ్చాడు

చేతిలో ఫైలు మూస్తూ అలీ వేపు చూస్తూ "టైమైందని గుర్తు చెయ్యడానికి వచ్చారా?" అంది.

రోజంతా పనిచెయ్యడం వల్ల ఆమె కాస్త నీరసంగా వుంది. శ్రమైక సౌందర్యం ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. అస్తవ్యస్తంగా కొద్దిపాటి ముంగురులు నుదిటిమీద చిరు చెమటకు అంటుకుని కొత్త అందాల్ని ఎత్తి చూపుతున్నాయి.

నిజానికామె పెద్ద అందగత్తె ఏమీ కాదు. కాని ఉన్న అందాన్ని. ఆకర్షణీయంగా తీర్చిదిద్దుకోవటంలో అనుభవజ్ఞురాలు.

"యు ఆర్ ఎనెసెట్ టుది కంపెనీ" అన్నాడు మెచ్చుకోలుగా అలీ.





"థేంక్యూ సర్" అంది ముందుకు అడుగు వేస్తూ రజని.

"ఇగో మీ కోసం ఈ ఇంపోర్టెడ్ పర్‌ఫ్యూమ్ తెచ్చాను" అంటూ ఒక బాటిల్ అందించాడు ఆలీ.

అసలా సీసాలే చాలా చక్కగా అపూర్వంగా వున్నాయి. ఓపెన్ చేసే ప్రయత్నంలో వున్న రజనిని వారిస్తూ-"అవి తరువాత తెరవవచ్చు ఇప్పటికిది ఉందిగా" అంటూ మరో సెంటు సీసాని చూపుతూ ఆమె ఊహించని విధంగా దాని బటన్ నొక్కి అమె శరీరం మీద స్ప్రే జల్లును వదిలాడు.

ఆ చల్లటి సుగంధపు జల్లుకు జల దరించిపోయింది రజని. పగలంతా పడిన శ్రమ క్షణంలో ఎగిరిపోయినట్లు ఫీలయి హాయిగా ఊపిరి పీల్చుకుంది. గుండెలు నిండుగా సుగంధంతో శుభ్రపడిపోయి నట్లు అనుభూతి చెందింది.

ఆ ఊపులోనే మరోసారి స్ప్రే జల్లు వదిలి నెమ్మదిగా ఆమెను తనరూంకేసి నడిపించాడు ఆలీ. ఆ గదీ, అందులోని సువి శాలమైన సోఫా రజనికి సుపరిచితాలే.

ఈ సుఖాలకు, సెంట్లకు ఇలా బానిసనై పోయినందుకు తనమీద తనకే జాలి వేసింది రజనికి.ఒంటరిగా అలా పడి గాపులు పడవలసి రావటం అసహ్యంగా అనిపించింది.బస్ స్టాపింగులో!

ఇంతలో పక్కనుంచి భయంకరమైన వేగంతో ఓ కారు దూసుకుపోయింది.

ఇంకా నయం! మీద పడలేదు.

విసుగ్గా టైంచూసుకుంది. ఎప్పటికీ రాని బస్‌మీద ఆమెకు చెప్పలేనంత కోపం వచ్చింది.

తొందరగా ఇంటికి వెళ్లాలి. ఉమాపతి పిల్లల్ని తీసుకుని ఏదో సిన్మాకి వెళ్లాడు.

వాళ్ళు వచ్చేలోగా తాను ఇల్లుచేరి కాస్త ఫ్రెష్ కావాలి.

వంటలక్క తన రాకకోసం ఎదురు చూస్తూంటుంది. తను వెళ్తే, ఇల్లు తనకి అప్పజెప్పి ఆమె వెళ్ళిపోతుంది.

ఇంటికి త్వరగా వెళ్ళాలి. వేణ్నీళ్ళతో స్నానం చేస్తే చాలా హాయిగా వుంటుంది. తర్వాత భర్తతోనూ, పిల్లలతోనూ కూర్చుని అందరూ ఒకేసారిగా వేడి వేడి అన్నం వడ్డించుకు తినటం, కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవటం అదో అనుభూతి. పిల్లలు స్కూలులో ఆరోజు జరిగిన తమాషాలు, విశేషాలు అన్నీ వదల కుండా వర్ణించి చెప్పి నవ్విస్తారు. చూసిన సినిమాల్లో వాళ్ళకు అర్థంగాని ఘట్టాల్ని గురించి సవాలక్ష ప్రశ్నలు వేసి విసిగిస్తారు.

భర్త ఉమాపతి స్వభావం అందుకు పూర్తిగా విరుద్ధం. అతను కాస్త మంద కొడి మనిషి. సరదాలన్నీ ఎప్పుడో అతిగా అనుభవించేసిన వాడిలా కాస్త నిర్లిప్తంగా ఉంటాడు ఇంట్లోనూ, పడక గదిలోనూ కూడా. అందుకనే రజని ఆఫీసులో అలీ చొరవను అడ్డుకోవటానికి గట్టి ప్రయత్నం చేయ లేకపోయింది. ఎంతైనా 'పొరుగింటి పుల్లకూర' సామెత కొట్టి పారవేయ దగ్గది కాదేమో !

ఉమాపతికి తనని చూసే దృష్టే వుండదు. ఎప్పుడూ ఆఫీసు ఎకౌంట్లు బేలన్స్ షీట్లు, లెడ్జర్లు ... ఇవి వినా తనకో భార్యవుంది, ఆమెతో సరదాగా వుండాలి...ఈ ఆలోచనలేరావు అతనిలో!

ఏమిటో అందరూ మగాళ్ళే అయినా, మగాళ్ళంతా నిజంగా మగాళ్ళేనా అనిపించింది రజనికి!

కిక్కిరిసిన బస్సురావడం, లిఫ్త




పాటులో అది వెళ్ళిపోవడం జరిగింది.

ఇక రజనిలో సహనం చచ్చిపోయింది. ఆటో పిల్చి ఎక్కికూర్చుంది.

అన్నానగర్ అంటే చాలు,రూపాయో, అర్ధో ఎక్కువ అడుగుతారు డ్రైవర్లు. నగరానికి బాగా దూరంగా వుండడంలో కొన్ని లాభాలుండడం మాటెలావున్నా, ఖర్చులు మాత్రం ఎక్కువే అవుతాయి.

తప్పదుమరి. భరించాలి.

అందంగా, ఆకర్షణీయంగా కట్టించు కున్న తమ స్వంత బంగళా ముందు దిగింది రజని.

ఆ ఇల్లంటే ఆమెకు ప్రాణం. తనకు కావల్సిన తీరులో అన్ని హంగులూ పొదిగి కట్టించుకున్న ఇల్లది.

బెల్ నొక్కిన కొన్ని క్షణాలకు వంటలక్క వచ్చి తలుపు తీసింది.

అలసటగా గబగబా తన గదిలోకి వెళ్ళి చీర, పరికిణీ, బ్లౌజు, బ్రా అన్నీ బరబరా వూడలాగేసి, కాటన్ మేక్సీ వేసుకుని ఫ్రీగా వున్నట్టు హాయిగా నిశ్వసించింది.

అబ్బ ! ఇల్లు వదిలి బయటకు అడుగు పెట్టాలంటే ఎంత తతంగం! ఎన్నిరకాల మేకప్‌లు! ఫ్రీగా, హాయిగా నడవటానికి కూడ ఫ్యాషన్‌లు అడ్డంకే గదా ! అను కుంటూ నిట్టూర్చింది రజని.

వంటలక్క పొగలు కక్కుతున్న టీ తీసుకువచ్చి అందించింది.

"ఇక నేను వెళ్ళిరానా అమ్మా" అంది.

"ఇవాళేవిటి చేశారు వంట...."

"మీకిష్టమని మెంతిపెట్టి వంకాయ, బాబుగారికీ పిల్లలికీ ఇష్టమని కందిపచ్చడీ, నూలగుండా చేశాను" అంటూ రజని ఖాళీ చేసిన కప్పూసాసరూ అందుకుని వెళ్ళిపోయింది.

"తలుపులు దగ్గరగా వేసుకుని వెళ్ళండి..." అంది వెళ్తున్న వంట లక్కతో రజని.

బీరువాలోంచి కొత్త సబ్బు, టవలు తీసుకుని, మేక్సీలో తన సడలిన సౌంద ర్యాన్ని ఓ సారి నిలువుటద్దంలో చూసుకుని, పెరట్లో వున్న బాత్‌రూం కేసి అడుగులు వేసింది రజని.

ఆఫీసులో ఆలీ ఆలింగనం వల్ల శరీరంలో ఏదో కొత్త భావం చోటు చేసుకున్నట్టనిపించింది. ఏదో విద్యుత్తు తన శరీరాన్ని వేడెక్కిస్తున్నట్టు,వెర్రెక్కి స్తున్నట్టు భావన కలిగింది ఆమెలో.

ఇవాళ ఎక్కువ సేపు తీరిగ్గా బాత్ రూంలో గడిపి, వీలైనన్ని నీళ్ళు నీళ్ళలా ఖర్చుపెడదామని నిశ్చయించుకొని పెరటి కేసి నడుస్తోంది రజని.

రెండడుగులు వేసిందో లేదో, కాల్ బెల్ మోగింది.

చిరాగ్గా అటు చూసింది.

'తీరిగ్గా స్నానం చేద్దామన్నా కుదిరి చావదు ఒక్కోసారి. ఎవరై వుంటారు? అయినా, పిల్లలు రావడానికి ఇంకా కాస్త టైముంది. పక్కింటివాళ్లా? ఆ యన ఫ్రెండా...ఎవరు? ఎవరైవుంటారు...'

* * *

ఉమాపతి పిల్లలిద్దర్నీ తీసుకుని ఇంటికి వచ్చాడు. కాల్‌బెల్ కొట్టనవసరం లేకుండానే లోపలికి వచ్చాడు అతను.

తలుపులు తీసుకుని రజని ఏం చేస్తు న్నట్టు? అన్నానగర్‌లో అసలే దొంగ తనాలు ఎక్కువ. ఇక ఇలా తలుపులు తీసుకుని ఏ వంటింట్లోనో, బెడ్‌రూమ్

లోనో వుంటే చెప్పేదేముంది? సోఫాలు, బీరువాలు ఎంచక్కా రిపేరుచేసే వాళ్ళ లాగ దర్జాగా మోసేస్తారు.

"రజ్నీ...ఓ రజ్నీ..." పిలిచాడు బిగ్గరగా ఉమాపతి.

"అమ్మ బాత్‌రూంలో వుందేమో డేడీ..." పెద్దవాడి మాట నిజమేనేమో అనిపించింది అతనికి.

చేతిలో పాప్‌కారన్ పేకెట్లు విప్పేసి పిల్లలిద్దరూ తినేద్దామనే తొందర్లో వున్నారు.

ఉమాపతి బెడ్‌రూంలో అడుగు పెట్టాడు. అక్కడి దృశ్యం అతణ్ని పిచ్చివాణ్ని చేసింది.

మంచం మీద అడ్డంగా పడివుంది రజని. ఆమె మెడ మంచం కిందికి వేలాడుతోంది. గుడ్లు ఉబ్బి వున్నాయి. మెడచుట్టూ నైలాన్ తాడు బిగించబడి వుంది. మేక్సీ సగం తొలగించబడి వుంది. అంతకన్న ముఖ్యంగా ప్రస్ఫ



టంగా కనిపించేది, త్రిభుజాకారంగా గొరగబడ్డ ఆమె తల. అక్కడెక్కడా ఒక్క వెంట్రుక కనబడలేదు. తెల్లని తలగడ గలీబు, దుప్పటి రక్తసిక్తమై ఎర్రగా భయంకరంగా వున్నాయి.

"రజ్నీ..." ఒక్క కేక వేశాడు ఉమాపతి.

ఆ కేకకు పిల్లలిద్దరూ బెడ్‌రూంలోకి వచ్చారు. అక్కడి దృశ్యంచూసి వాళ్ళిద్దరూ పెద్ద కేకవేసి పడిపోయారు.

ఉమాపతి పిచ్చివాడిలా ఏంచెయ్యాలో తోచక అచేతనంగా అలా వుండిపోయాడు.

బయట అమావాస్య చీకటి రాజ్యమేలుతోంది.



అభిరామ పురం నుంచి అరుంబాక్కమ్ వరకూ, కళామండపం నుంచి కలైనగర్ కరుణానిధినగర్ వరకూ రజని హత్య వార్త గాలిలా వ్యాపించింది.

మంగళ హత్య గురించి ఇంకా ఏమీ తేలనేలేదు, ఆ భయంనుంచి పట్టణప్రజలు ఇంకా తేరుకునే లేదు ఇంతలో మరో హత్య!

అన్నా నగర్‌లో ఉమాపతి ఇంటికి హుటాహుటి తన బలగాన్ని తీసుకుని బయలుదేరాడు జాన్ సెల్వమ్.

కేసు దర్యాప్తు విషయం ఇన్స్‌పెక్టర్ సోముకు అప్పగించినా తాను పూర్తిగా కలగజేసుకుంటేగాని ఇది ఒక కొలిక్కి రాదని భావించి, తానే స్వయంగా వచ్చాడు జాన్ సెల్వమ్.

హత్య జరిగి ఇరవై నాలుగు గంటలైనా జరగలేదు. పిల్లలిద్దరూ కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని బిక్కు బిక్కుమంటూ పోల్చుకోనంతగా మారిపోయారు.

ఉమాపతి సరేసరి! అతడేం అంటున్నాడో, ఏం చేస్తున్నాడో అతనికే తెలీదు. మౌనంగా, నిర్లిప్తంగా ఎటో చూస్తున్నాడు.

ఈ ఘోర దుర్వార్త విని మద్రాసుకు చేరువగా ఓ గ్రామంలో వుండే అతని చెల్లెలు వచ్చి ఇంట్లో వుంది.

జాన్ సాధారణ దర్యాప్తు పూర్తి చేశాడు. అతను ఇంగ్లండ్‌లో వున్న ప్రసిద్ధి చెందిన స్కాట్‌లెండ్ యార్డ్‌లో ప్రత్యేక శిక్షణ పొందేడు అక్కడ ఎన్నో నేరపరిశోధక కేసులు చూశాడు. అయితే ఇంత హృదయ విదారకరమైన సంఘటన ఎన్నడూ ఎదుర్కొనలేదు.

జాన్ ఆలోచించుకుపోతున్నాడు.

ఇలియట్స్ బీచ్‌లో జరిగిన హత్యకూ, దీనికీ ఏమైనా సంబంధం వుందా? హంతకుడు ఒక్కడేనా?

ఇద్దరూ స్త్రీలే, వివాహితలే, సమవయస్కులే. అయితే హత్య మాత్రం ఒక స్త్రీని ఆమె బ్రాతోనూ, ఈమెను నైలాన్ తాడుతోనూ చేశాడు. పట్టణానికి ఓ చివర ఓ ఇల్లుంటే, ఈ చివర ఈ ఇల్లుంది!

పోస్టుమార్టం రిపోర్టు ప్రకారం రజని రేప్ చెయ్యబడలేదు. హత్యకు ముందు గాని, తర్వాతగాని ఆమె అనుభవింప

బడలేదు. ఆమెను చంపడానికి ఏ ఆయుధమూ ఉపయోగించలేదు. తాడుతో పీక నులిమివేయబడింది. కత్తి ఒకటి ఉపయోగించబడినా అది కేవలం రజని కేశాల్ని తియ్యడానికి మాత్రమే ఉపయోగింపబడింది. పీక నులమడం వల్ల రక్త స్రావం అయింది. అంతే!

సుఖసంతోషాలతో హాయిగా కాపురాలు చేసుకునే స్త్రీలను హత్య చెయ్యడంలో హంతకుడి అంతర్యం ఏమై వుంటుంది? ఇందువల్ల అతనికి ఒనగూరే ప్రయోజనం ఏవిటి? ఎందుకీ హత్యలు చేస్తున్నట్టు?

ఆలోచనలతో జాన్ తల వేడెక్కిపోయింది. ఆర్డర్లీని పిలిచి కూల్‌డ్రింక్ ఒకటి తెమ్మన్నాడు.

ఆర్డర్లీ కూల్‌డ్రింక్‌తో పాటు, అప్పుడే వచ్చిన ఆనాటి ఉత్తరాలు కూడా తీసుకువచ్చాడు.

ఎడం చేత్తో కూల్‌డ్రింక్‌నీ, కుడి చేతో ఆఫీసు ఉత్తరాల్ని అందుకున్నాడు జాన్.

ఆ ఉత్తరాల్లో ఓ పెద్ద కవరు అతణ్ని బాగా ఆకర్షించింది.

అది అతని పేరు మీద వచ్చిన కవరు. ఫ్రమ్ చిరునామా చూడగానే అతని భృకుటి ముడిపడింది.

అది ఈ మధ్యనే హత్యగావించబడిన మంగళ నుంచి వచ్చింది.

చేతిలో డ్రింక్ టేబిల్ మీద పెట్టి ఆ కవరు ఆత్రుతగా విప్పాడు జాన్.

విప్పుతున్నప్పుడే అతనికి తెలిసిపోయింది అందులో ఏముందో!

ఊహించినట్టుగానే, అందులో రజని తల మీంచి తీసివేయబడిన నీలాలు వున్నాయి!

'రాస్కెల్! వీడికెంత గుండెధైర్యం? పోలీసు అధికారులతోనా వీడి ఆటలు. హత్యలు చెయ్యడం, హతుల శరీర భాగాలు పోస్టులో పంపడం చిన్నపిల్లల ఆటనుకుంటున్నాడేమో! ఇక వీడిని స్పేర్ చెయ్యకూడదు' అని అనుకుంటున్నప్పుడు జాన్‌కి ఒక అనుమానం వచ్చింది.

ఈ హత్యలు కేవలం అమవాస్య రాత్రులలో చెయ్యడం వల్లా, ఇప్పుడు రజని కేశాలు తీసివెయ్యడం వల్లా, హంతకుడేమన్నా దేవీ ఉపాసనా, గ్రటా చేస్తున్నాడేమో? దేవీ ఉపాసనా, క్షుద్ర దేవతారాధనా చేసేవాళ్ళు కూడా అమవాస్య రాత్రులనే ఎన్నుకుంటారు. దాదాపు ఒకే వయసుగల వాళ్ళనే ముఖ్యంగా స్త్రీలనే ఎన్నుకుంటారు. మంగళ చెవి తీసెయ్యడం, రజని కేశాలు గొరగడం ఇవేవీ ఆ తంతుకు సంబంధించినవి కావు గదా?

మూఢ విశ్వాసాలకు, తాంత్రిక శక్తులకూ, అమ్మలకూ, బాబాలకూ, భజనలకూ ప్రసిద్ధి చెందిన దేశం మనది. ఇందులో ఏం జరిగినా ఆశ్చర్యపడనవసరం లేదు.

జాన్ ఆలోచించుకు పోతున్నాడు.

తాను కోయంబత్తూర్‌లో పోలీసాఫీసర్ శిక్షణ పొందుతున్నప్పుడు జరిగిన సంఘటన ఒకటి అతని కళ్ల ముందు కదలాడింది.

ఇరవై సంవత్సరాల తన కుమార్తె కనబడ్డం లేదని వచ్చిన రిపోర్టును దర్యాప్తు చెయ్యడం ప్రారంభించాడు జాన్ ఆ రోజుల్లో.

ఓ నెల గడిచిందో లేదో అలాగే తన చెల్లెలు కనబడ్డం లేదని, ఆమె వయస్సు ఇరవై లోపని ఓ అన్న రిపోర్టు

ఇచ్చాడు.

ఇద్దరూ కన్యలే. ఒకే కులానికి చెందిన వారే! ఈ ఉదంతం కోయంబత్తూర్ ప్రాంతంలో తీవ్ర సంచలనం లేపింది.

రోజులు గడుస్తున్నాయి.

ఇలాగే మరో రెండు కేసులు నమోదు అయ్యాయి. ఆ కన్యలు హత్యగావింపబడ్డారా? విదేశాలకు పంపబడ్డారా? ఏమైనారు?

ప్రత్యేకంగా ఒకే కులానికి చెందిన స్త్రీలు, అందునా కన్యలు ఎందుకు



మాయమౌతున్నారు?

వారు ఇచ్చిన రిపోర్టుల ప్రకారం ఆలోచిస్తే ఆ కన్నెపిల్లలు కేవలం పౌర్ణమి రోజున మాత్రమే మాయ మౌతున్నట్టు తేలింది.

ఒకే కులం – కన్నెపిల్లలు – పౌర్ణమి రాత్రి.

తీవ్రంగా ఆలోచిస్తే జాన్ తలలో ఓ మెరుపు మెరిసింది.

తాంత్రిక శక్తుల సంపాదనకు క్షుద్ర దేవతల్ని సంతుష్టులను చెయ్యడానికి ఎవరేనా ఈ ఘోరాలకు తలబడు తున్నారా!' అనే ఆలోచనతో తీవ్రంగా పరిశోధన ప్రారంభించాడు జాన్.

దాని పర్యవసానంగా ఆ పరిసర ప్రాంతాల్లోగట్టి బందోబస్తు చేసి, మానవ సంచారానికి అవకాశమే లేని కొండలు, గుట్టలు, బంజరు భూములు – ఇవన్నీ గాలిస్తే ఓ కొండ గుహలో తలలు లేని నాలుగు కంకాళాలు బయట పడ్డాయి. ఆ కంకాళాలు స్త్రీలవేసని, వాటి వయోపరి మితి ఇరవై దాటి వుండదని రిపోర్టుల ద్వారా తేలింది.

ఇంకా తీవ్ర పరిశోధన వల్ల ఆ ప్రాంతానికి చెందిన ఓ ధనిక భూస్వామి ఇందుకు కారకుడుగా అనుమానించ బడ్డాడు.

అతడిని అరెస్ట్‌చేసి, నానా హింసలకు గురిచేస్తే, చివరకు అసలు రహస్యం బయట పెట్టాడు.

అతని కులదేవత అయిన అమ్మవారు కలలో కనబడి ఒకే కులానికి చెందిన ఇరవై సంవత్సరాలలోపు కన్యలను ప్రతి పౌర్ణమి రాత్రి తనకు బలి యిచ్చి, వారి శిరస్సులను వారి ఇంటి బావులలోనూ, శరీరాలను ఊరికి దూరంగా వున్న ఫలానా కొండగుహలోనూ పదిల పరిస్తే నిక్షిప్త సంపదను తనకు అందేలా చేస్తానని చెప్పిందట.

నిక్షిప్త సంపద కోసం నిక్షేపం లాంటి అమాయక కన్నె పిల్లల జీవితాల్ని బలిగొన్నాడు ఆ ధనిక భూస్వామి.

ఆ కన్యల ఇళ్ల వెనుక వున్న బావులను వెతికించి ఆ కన్యల కపాలాలను బయటకు తీయించాడు జాన్.

ఓ భయంకరమైన నిగూఢ రహస్యం బట్టబయలు చెయ్యడానికి అహోరాత్రులు కృషిచేసిన జాన్‌ను ఆనాడు ప్రత్యేకంగా గౌరవించింది ప్రభుత్వం.

అలా...

ఈనాడు ఏదో క్షుద్రదేవతారాధన కోసం ఈ ఘోరహత్యలు చెయ్యడంలేదు కదా ఈ హంతకుడు?

ఏమో? ఎందుకు కాకూడదు??

నాగరికత పెరిగి, భౌతిక వాదం, వాస్తవిక వాదం క్షణ క్షణం బలం పుంజుకుంటున్న ఈ ఇరవైయవ శతాబ్దంలో ఇంకా ఇలాంటివి నమ్మగలమా? సశాస్త్రీయ విధానాలకీ, అతీంద్రియ శక్తులకీ సంకుల సమరం తప్పదా?

"ఎప్పుడూ మీరూ మీ కాకీ బట్టలూ, హత్యలూ, దొంగతనాలేనా? సరదాగా ఓ గంట అన్నీ మర్చిపోయి గడపడం కూడా నేర్చుకోండి" అంది జాన్ భార్య మేరీ.

'అవును కదూ. నేనూ మనిషినే. కాస్త విశ్రాంతిగా గడపవలసిన అవ సరం నాకూ వుంది. నిజమే. మేరీతో సరదాగా గడిపి ఎన్నేళ్లయింది?' అని మనసులో అనుకుని,

"ఓకే డియర్. ఇవాళ వీడు నీ ఆధీనం. ఏం చేస్తావో చేసుకో. ఏ ప్రోగ్రాం వేసుకుంటావో వేసుకో"

అన్నాడు జాన్.

మేరీ ఆనందానికి అవధులు లేకుండా పోయింది. సాయంత్రం ఎక్కడికెళ్లాలి? ఏ మూవీ చూడాలి? ఎక్కడ డిన్నర్ తీసుకోవాలి?–అనే ఆలోచనలో లీనమై "థేంక్యూ డియర్" అని, అతని పక్కనే కూర్చుని బలిష్టమైన అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది.

మెత్తగా పువ్వులా వున్న ఆమె అర చేయి అతనికి వింత సుఖాన్ని అందిచ్చింది. ఆ చేతిని అలాగే మీద వరకూ లాగి తన బలమైన పెదాలతో స్పృశించాడు. ఆ స్పర్శలో అతని మీసాలు ఆమె చేతిని అల్లరిపెట్టాయి. చిన్నగా నవ్వుకుని–

"అస్తమానూ దొంగలు, దోపిడీదార్లు, హంతకుల్ని గురించి ఆలోచిస్తూ కూర్చునే మీరు ఈ చిలిపి పనులు ఎప్పుడు, ఎలా నేర్చుకున్నారండీ" అంది నవ్వుతూ.

"ఈ మాత్రం ఒకరు నేర్పాలా! అందం ఎదురుగా ఉంటే అలవాట్లు అవే ముంచుకు వస్తాయిలే" అన్నాడు తనూ చిలిపిగా నవ్వుతూ.

"మీరసలు లాయరు అవ్వాల్సింది. నా ఖర్మ కొద్దీ ఈ ఉద్యోగంలో పడ్డారు" అంటూండగానే......

వారి ఏకాంతాన్ని భంగపరుస్తూ ఫోను నానా అల్లరీ చేసింది.

అయిష్టంగా, మేరీని వదలకుండానే కుడిచేత్తో ఫోనందుకున్నాడు జాన్.

క్షణకాలంలో అతని ముఖం గంభీరంగా మారిపోయింది.

"వస్తున్నాను ... ప్రొసీడ్" అని ఫోన్ పెట్టేసి, "మేరీ డియర్... సారీ.. నీకు ఆశాభంగం కలిగిస్తున్నానేమో... అర్జంటుగా వెళ్లాలి" అంటూ డ్రెస్ ఛేంజ్ చేసుకోవడంలో మునిగిపోయాడు.

మేరీకి ఇలాంటి పరిస్థితులన్నీ పెళ్లయిన నుంచీ అలవాటే. డాక్టర్ల పెళ్లాలకీ, పోలీసు ఆఫీసర్ల పెళ్లాలకీ ఇలాంటి చేదు అనుభవాలు తరుచూ జరుగుతూనే వుంటాయి.

నగర పోలీసు కమీషనర్ దుస్తుల్లో జాన్‌ను చూస్తున్నప్పుడు ఆమెకు అతని పట్ల ఎనలేని గౌరవం కలుగుతుంది. మాష్టారి ముందు చిన్న పిల్లాడిలా వినయంగా నిల్చుని ఆర్డర్లను అమలు జరుపుతుంది ఆమె.

అతను బయలుదేరుతుండగా సాగనంపుతూ–

"ఏ మాత్రం వీలున్నా తొందరగా వచ్చేయండి" అంది.

ఆమె కళ్ళలోకి 'అలాగే' అన్నట్టు చూసి ముందుకు నడిచాడు జాన్ సెల్వమ్.

* * *

డాక్టర్ ప్రమీల మెడ చుట్టూ ఇనుప తీగ బలంగా చుట్టబడి వుంది. అక్కడంతా ఎర్రగా కమిలిపోయి గాయంగా మారిపోయింది. ఆమె శవం పెరుంబూర్ సిమెట్రీ దగ్గర్లో బోర్లాపడి వుంది. ముఖమంతా మట్టి కొట్టుకుని వుంది. కళ్ళు వుబ్బి వున్నాయి.

పరశువాక్కం దగ్గరగా ఆమె ఒక ప్రభుత్వ ఆస్పత్రిలో లేడీ మెడికల్ ఆఫీసర్‌గా వుంటోంది. అవివాహిత. వయసు ఇరవై ఆరు వరకూ వుంటుంది. చామన ఛాయగా, పొడుగ్గా, ఆకర్షణీయంగా వుంటుంది. పిరుదులు దాటే ఆమె పొడవైన వాలుజడ ఎంతటి వారినైనా రెండోసారి చూసేట్టు చేస్తుంది. నల్లనాగు ఆమె




వీపు మీద నాట్యమాడుతున్నట్టు వుంటుంది.

స్వమతం మీద ఎంత అభిమానం ఉందో, పరమతం మీద అంత అసహనం వుంది. మగవాళ్ళ విషయాలన్నా, వాళ్ళ గురించి కబుర్లన్నా తీవ్ర విముఖత చూపిస్తుంది.

ఆమె తండ్రి బెంజ్‌మన్ ప్రభుత్వోద్యోగం నుంచి రిటైరై ప్రస్తుతం పరిశ వాక్యంచర్చి కార్యకలాపాలలో సహాయకారిగా వుంటున్నాడు.

ప్రమీల శవాన్ని పరీక్షగా చూస్తే ఆమెపై ఏ అత్యాచారం జరిగినట్టు అనిపించలేదు జాన్‌కు.

జరిగిన రెండు హత్యల విషయం ఇంకా ఏమీ తేలనే లేదు, ఇప్పుడీ మూడో హత్య. అందునా లేడీ డాక్టర్ హత్య కావించబడింది. పోలీసులు, నిఘా విభాగం వారు ఏం చేస్తున్నట్టు?

"నగరంలో హంతకులు స్వైరవిహారం చేస్తూంటే, తమ పథకం ప్రకారం హత్యలు చేసుకుంటూ పోతూంటే, అరికాలెవరికీ చీమకుట్టినట్లైనా లేదేం ?" అని ప్రాతికేయులు నిలదీసి అడుగుతున్నారు.

'అమవాస్య హత్యలు' అనే పేరుతో ప్రముఖ శీర్షికలు ప్రచురించాయి కొన్ని పత్రికలు.

అధికారులు, అనధికారులు, శాసన సభ్యులు, ప్రాతికేయులు ఒకరేమిటి అవకాశం వున్న ప్రతి వ్యక్తి ప్రశ్నల వర్షం కురిపించసాగేరు.

ఈ వత్తిడికి తట్టుకోలేక తీవ్ర అశాంతికి లోనయ్యాడు జాన్. ఏం చెయ్యాలో, ఎలా ఈ సమస్య పరిష్కారం చెయ్యాలో అతనికి ఓ పట్టాన తట్టడం లేదు.

ఆలోచించుకుంటూ పోతే ఈ మూడో హత్య కూడా ఆ హంతకుడే చేసినట్టు కనిపిస్తోంది. మూడిటికీ వున్న ఒకే ఒక సామ్యం అమవాస్య రాత్రి.

అమవాస్య రాత్రులనే హంతకుడు ఎందుకు ఎంచుకున్నట్టు? ఇదేదో ఉద్రేకంలోనో, పిచ్చిగానో చేస్తున్న హత్యాల్లాకాక ఒక పథకం ప్రకారం చేస్తున్న హత్యలని విశదమౌతోంది.

మెడికల్ రిపోర్టు చూసి చకితుడైనాడు జాన్.

పైకి అందరూ అనుకుంటున్నట్టు ఆమె అవివాహితేగాని పురుష సంపర్కం ఎరుగని అమాయిక మాత్రం కాదు. ఆమె కన్యత్వం ఏనాడో కోల్పోయినట్టు, తరచూ పురుష సాంగత్యం పొందుతూన్నట్టు రిపోర్టు వెల్లడి చేసింది.

మగవాళ్లన్నా, వాళ్ళ కబుర్లన్నా తీవ్ర విముఖత చూపడం కేవలం నటన అని ఇందువల్ల రుజువు అవుతోంది.

పురుష సాంగత్యంలో తరచూ పరవశించే ఈమె పురుషద్వేషిగా కనిపించడంలో ఆంతర్యం ఏవిటి?

ఈమెకు ఒక పురుషునితో మాత్రమే సంబంధం వుందా ? లేక పలువురితో పరిచయాలున్నాయా?

ఈ హత్యకు ఆమె ప్రియుల మధ్య ద్వేషం గాని కారణం కాదుకదా ?

అనంతమైన ఆలోచనల మధ్య అతనికి ఊపిరి ఆడడం లేదు. పోలీసు బలగం యావత్తూ దివారాత్రాలు ఎంత తీవ్ర కృషి చేసినా, ఎన్ని పథకాలు వేసినా హంతకుని ఆచూకి ఏ మాత్రం తెలియడం లేదు.

"సార్...మీ పేరున ఏదో పార్శెల్" అందించాడు ఆర్డర్లీ.



'ఇదికూడా హంతకుడినుండే అయుండాలి. హత్య చెయ్యడం, ఆ శవం నుండి ఏదో సంగ్రహించి, సరదాగా పోలీసు డిపార్టుమెంట్ కి పంపడం హాబీ అయిపోయినట్టుంది ఈ హంతకుడికి' అనుకుంటూ ఆ పార్శిల్ విప్పి చూశాడు.

అందులో సన్నని బంగారు గొలుసు శిలువ లాకెట్ తో వుంది. అది నిశ్చయంగా

ప్రమీలదే అయుండాలి. మరొకరిది అవడానికి అవకాశం లేదు.

ఆ పేకెట్‌లోనే ఓ కవరు కూడా వుంది. అందులో పోలీసుల అసమర్థతను, హంతకుని ప్రజ్ఞాపాటవాలను బేరీజు వేస్తూ రాసిన వ్యాసాలు, వార్తలు, లేఖలు గల పేపర్ కటింగ్స్ వున్నాయి. అంతేకాక ఓ కాగితం మీద ఎర్ర అక్షరాలతో "హ – హ – హ – హ" అని అంది.

ఇవన్నీ చూస్తోంటే జాన్‌కి కప్పితో చెళ్లున కొట్టినట్లైంది.

ఇక ఈ పని కేవలం ఒక్క పోలీసులతో



మాత్రమే అవదనీ, ఇకపై నాలుగు గంటలూ ఈ కార్యక్రమంపై కేంద్రీకరించే వ్యక్తికి ఈ బాధ్యత అప్పగించాలనీ నిర్ణయించుకున్నాడు జాన్.'

లావుపాటి చుట్ట వెలిగించి దట్టంగా పొగ వదుల్తూ సుదీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

* * *

ముప్పై ఏడేళ్ల డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ దివాకర్ పైకి ఎంత సీరియస్‌గా కనిపిస్తాడో, అంతర్యంలో అంత ప్రశాంతంగా వుంటాడు

పోలీసాఫీసర్‌గానూ, డిటెక్టివ్‌గానూ అతను అజరామరమైన కీర్తి ప్రతిష్టల్ని అంత చిన్న వయసులోనే ఆర్జించడమే కాకుండా ప్రభుత్వోద్యోగిగా కొన్ని పరిధులకు మాత్రమే లోబడి పని చేయాల్సి రావడంతో, ఉద్యోగానికి రాజీనామా చేసి, స్వతంత్రంగా నేర పరిశోధనకు కృషి ఆరంభించాడు.

ఆరడుగుల పైబడి ఎత్తుండే దివాకర్ మంచి అందగాళ్లలోకే జమ. చురుగ్గా ఇవతలి వాళ్ళ ఆంతర్యాలలోకి తొంగి చూసే అతని కళ్లు అతనికొక ప్రత్యేకత.

ముఖ్యంగా హత్యకేసుల్ని ఛేధించి, హంతకుల్ని అతి సునాయాసంగా పట్టుకోవడంలో అతను దిట్ట.

'నుంగంబాకం రాజా హత్యకేసు', 'మణిమంగళం బాంబ్ మర్డర్ 'రమ్య హర్మ్యంలో రమణి హత్యకేసు" – వీటిని ఛేదించడంలో దివాకర్ అనితర సాధ్యమైన ప్రజ్ఞా పాటవాల్ని ప్రదర్శించి, అటు ప్రభుత్వంచేత, ఇటు ప్రజల చేత శభాష్ అనిపించు కున్నాడు.

ఎవరేనా వివాహ ప్రసక్తి ఎత్తితే "మొదటి భార్య వుండగా, నాకెవరు రెండో పెళ్ళి చేస్తారయ్యా" అని జోక్ చేస్తాడు.

"మీకు పెళ్ళయినట్టు మాకు తెలీదే" అని అంటే–

"తెలుసుకోవాల్సిన బాధ్యత మీది. 'నాకు పెళ్లైంది బాబోయ్–' అంటూ చాటింపు వేయించ మంటారా?" అంటాడు నవ్వుతూ.

"ఇంతకీ మీ భార్యను ఎవరూ చూసిన దాఖలాలు లేవే?" అని అంటే.

"ఆమెకు ఘోషా" అంటూ తప్పించుకుంటాడు.

"అపరాధ పరిశోధన నా జీవిత ధ్యేయం. అదే నాకు తల్లీ, తండ్రీ, భార్యా, బిడ్డా, దేవుడూ, దెయ్యమూను. పెళ్ళి చేసుకుంటే కొన్ని ప్రతిబంధకాలు ఏర్పడతాయి. స్వేచ్ఛ వుండదు. అందులో నా వృత్తిధర్మం ప్రకారం ఏ నిముషంలో ఎక్కడుంటానో నాకే తెలీదు. అలాంటప్పుడు ఓ ఆడదాన్ని కట్టుకుని, దానికి లేనిపోని వర్రీలు అంటగట్టడం దేనికి? అంచేత ఎంచక్కా ఫ్రీబర్డ్‌గా తిరుగుతున్నాను. ఇంతకీ నేను అవివాహితుణ్నేగాని బ్రహ్మచారిని మాత్రం కాదు" అంటాడు ఆంతరంగికులతో దివాకర్.

అపరాధపరిశోధన, హత్య– ఇత్యాది వాటికి సంబంధించిన ఏ పుస్తకం గాని, కథగాని, నవలగాని, సినిమాగాని, అది ఏ భాషలో వున్నాసరే – అవి చదవాల్సిందే! చూడవల్సిందే! అంతపిచ్చి.

అతనికి వచ్చే రాబడిలో సగానికిపెగా విదేశాలనుండి అనేక నవలలు, కేసెట్లు తెప్పించడానికే ఖర్చు చేస్తాడు.

మనిషి శారీరకంగా కాక, మానసికంగా ఎదగడంకన్న ముఖ్యం మరేదీకాదు.




ఎవరికి అభిరుచివున్న వ్యాసంగంలో వాళ్ళు మూసుకు పోకుండా చూసుకు పోతూ అభివృద్ధి సాధించగలిగితే...అది గణనీయమైనదే!

అలాక్కాకుండా తెలుగు భాషమీద అభిమానం వున్న వ్యక్తిని లెఖ్ఖల మాష్టారుగా తీర్చిదిద్దాలని, అతని మీద అనవసర విషయం రుద్దాలని ప్రయత్నించడం అన్యాయం.

ఇలాంటి వన్నీ మన దేశంలో ఎక్కువ.

న్యాయశాస్త్రంలో అభిమానం వున్న విద్యార్థిని జియాలజీ ప్రొ ఫె స ర్ ను చేద్దామని తండ్రి అనుకుంటే, ఈ సల్లరేగడి మట్టిలో, ఎరుపు ధూళి కలపడం ఏం న్యాయం? ఏం ధ ర్మం? ఈ అన్యాయాన్ని అరికట్టే న్యాయస్థానమే లేదా ?" అంటూ అతను నేలమీద గుద్ది గట్టిగా మాట్లాడతాడు.

"విదేశాలలో విద్యార్థి అభిరుచిని గౌర వించడం వుంది. మనకిలేదు. ఇది దౌర్భాగ్యం" అంటూ ఆవేశంగా అంటాడు దివాకర్.

"నేను చేపట్టిన అపరాధ పరిశోధనలో నిష్ణాతుణ్ని అవాలనే నా తపన. అందుకే నా తపస్సు" అంటాడు దివాకర్.

తాను ఏనాటికేనా 'నేరపరిశోధన' మీద అత్యంత విలువైన రచన చేయాలనే తన అభిలాషని, న్యాయవృత్తిలో వుంటూ చాలా విలువైన పుస్తకాలు రాసిన తన మిత్రుడు రాజాతో అంటూంటాడు.

ఫోన్ గణగణమంది.

"హలో..."

"........."

"అలాగే...వస్తున్నాను..." అంటూ బయలు దేరాడు దివాకర్.

అతని మోటర్ సైకిల్ పోలీసు కమీషనర్ జాన్ సల్వామ్ కార్యాలయం వేపు దూసుకు పోతోంది.

అతని ముఖంలో ఓ చిరునవ్వు వెలిగి వెలిసిపోయింది.




తన ఆఫీసు గదిలో జాన్ ఇచ్చిన వివరాలు శ్రద్ధగా పరిశీలిస్తూ, తన నోట్ బుక్‌లో పాయింట్లు రాసుకుంటున్నాడు దివాకర్.

హతులైన మంగళ... వివాహిత, రజని...వివాహిత, ప్రమీల... అవివా హిత అయినా కన్యకాదు. అన్నీ అమా వాస్య రాత్రులలోనే జరిగాయి.

మంగళ, రజని...వీళ్లకు ప్రియులే మైనా వున్నారా? ఎక్కడా ఆచూకీలేదు.

వాళ్లకి ప్రియులున్నా, వుండక పోయినా ప్రమీల – లేడీ డాక్టర్‌కు తప్ప కుండా ప్రియుడు లేక ప్రియులు వుండి తీరాలి కాబట్టి ఆ వ్యక్తి కోసం అన్వేషణ ముందు ప్రారంభించాలి.కథ కాస్త పాకాన పడవచ్చు.

హత్యలు చేసిన వ్యక్తి వీళ్లందర్ని ప్రేమించి విఫలమై మార్గాంతరం కానక హత్యలు చెయ్యడం ప్రారంభించాడా ? విఫల ప్రేమికులంతా హంతకులు అవు తున్నారా? అలా అయితే తానుకూడా...'

నవ్వుకున్నాడు.

నెర పరిశోధనకే జీవితాన్ని అంకితం చేస్తున్న తను హంతకుడవడమా?

కానీ, విఫల ప్రేమలో మనిషిపడే తీవ్ర ఆవేదన, బాధ, కసి, అసహనం తనకు తెలియనివి కావు.

నిజానికి సవిత అలా చేస్తుందని తను కలలో కూడా వూహించలేదు.

లయోలా కాలేజీలో తను చదువుతున్నప్పుడు చింతాద్రిపేటలో తన అక్క జయమ్మగారి ఇంట్లో వుండేవాడు తను. అప్పుడు తరచూ తనింటికి వచ్చేది సవిత.

సవిత ఎంత చక్కగా వుండేది! ఒరుసుగా వుంగరాలతో వుండే ఆమె నల్లని పొట్టిజుత్తు, చిలిపిగా చూసేకళ్ళు, ఎర్రగా పండినట్టువుండే లక్కపిడత లాంటి పెదాలు, కొనతేరి సూటిగా వుండే ముక్కు, నవ్వితే సొట్టలు పడే బుగ్గలు, మంచి శరీర సౌష్టవం..సవితను చూస్తుంటే చూడాలనే వుండేది.

ఎప్పుడూ ఏదో ఒకటి అడుగుతూనే వుండేది. జవాబు చెప్పడంలో కాస్త అలక్ష్యమైనా సరే—

"ఏమిటి ఇంతసేపు చేస్తున్నారు? ప్రశ్నలకు జవాబు ఆలోచిస్తున్నారా? ఆలోచిస్తున్నట్టు నటిస్తూ, నన్ను చూసేస్తున్నారా?" అనేది నవ్వుతూ.

అలా అన్నప్పుడు తప్పకుండా సవితను చూడాలనే అనిపించేది.

ఆమె కళ్ళల్లోకి సూటిగా అలా ఎంత సేపు చూసేవాడో తెలీదు.

ఆ కళ్ళకు అకళ్ళు ఎప్పటికీ తీరేవి కావు.

పరిసరాలు కానీ, గడిచేకాలంగానీ ఏవీ గమనించే తీరిక, ఓపిక, జ్ఞాపిక వాళ్ళకు వుండేది కాదు.

రోజులు క్షణాలుగా గడిచిపోయేవి.

ఎంతగా చనువు పెరిగినా ఏనాడూ తాను చొరవ చెయ్యలేదు. ఆ విషయంలో తనని తాను ఈనాటికీ అభినందించుకుంటాడు.

మెరీనాబీచ్‌లో కొన్న ఒకే ఒక్క చాక్‌లెట్ ఐస్‌క్రీం తినడానికి తామెంత తాపత్రయ పడేవారో... !

ఒకే కొబ్బరి బొండాంలో రెండు స్ట్రాలు దించి, ఆ నీటిని ఎవరి మట్టుకువారు తాగడానికి ఎంత తొందర పడేవారో... !

వేరుశనగ పలుకులు అరచేతుల్లో పోసుకుని, ఒకరివి ఒకరు లాక్కుంటూ, అరచేతులు సున్నితంగా గిల్లుకుంటూ ఎంత అల్లరి చేసేవారో...

అవన్నీ గడచిన మధురోహలు.

జీవితంలో ఏదీ పూర్తిగా అయిపోకూడదనీ, అవుతూ అవుతూవుండాలనీ, జీవితానందం అంటే అదేననీ— ఎంతగానో ఆశించాడు తను. ఊహించాడు తను. కలలు గన్నాడు తను...

అయితే చివరికేమైంది?

తన హృదయాన్ని ఛిన్నాభిన్నం చేసి, కలలన్నీ కల్లలు చేసి, భావాలన్నీ భస్మం చేసి—

సవిత...తన ప్రియాతి ప్రియమైన సవిత...

పెద్దలు చూసిన ఓ సంబంధాన్ని ఎంచక్కా చేసేసుకుని, కొత్త పెళ్ళికొడుకుతో—

అమెరికా వెళ్ళిపోయింది.

అంతెత్తున్న వుండే వాళ్ళకి, కింద నుండే వాళ్ళంతా ఎప్పుడూ స్వల్పంగానే కనిపిస్తారు.

"ఎందుకు? ఏమిటిలా చేశావ్? మన





ప్రేమలేమైనాయ్? మన ఊహలేమైనాయ్? నీకిది న్యాయమా ?" అని నిలదీసి అడగాలని అనుకున్నాడు తను.

కానీ–

చెప్పా పెట్టకుండా, అర్థాంతరంగా అంతర్ధానం అయిపోయింది సబిత.

తన ఊహాసౌధం సర్వ నాశనమై పోయింది.

ఆడది...

ఆడదంటే ఎవరో అన్నట్టు కేవలం భోగ వస్తువు. మగవాడికి అనుకూలంగా, అనువుగా కోర్కెలు తీర్చే ఒక విలాస వస్తువు. అంతే! అంతకన్న ఎక్కువగా ఆడది కూడా మనిషేననీ, ఆమెకూ ఒక హృదయం వుంటుందనీ, అది గాయ పడితే శోభిస్తుందనీ భావించానే...ఏది అలా తలపోసానే. అది...అది–

"అది నా తప్పు. సబితా... వెళ్ళిరా సబితా వెళ్ళిరా" ఆవేదనతో అనాడు కృంగిపోయాడు తను.

కాలం మాన్చలేని గాయం వుండ దు సబిత రూపం హృదయం నుండి, జ్ఞాపకాల తలంపు నుండి అలా... అలా దూరమైపోయాయి.

ఆ దెబ్బతో అతను కొంతకాలం పాటు ఆడవాళ్ళను గురించి తేలికగా ఆలోచించే వాడు. కాని...... ఈ ప్రపంచం చాలా విశాలమైనది.

దివాకర్...ముప్పై ఏడేళ్ళ దివాకర్ వెళ్ళిపోయిన మూడేళ్ళ వేదాంతిలా నవ్వు కున్నాడు.

ఫోన్ గొడవ చెయ్యడంతో పాత జ్ఞాపకాల వల చిరిగిపోయింది.

విసుగ్గా ఎత్తిన ఫోను! అంత చిరా గ్గానూ 'రాంగ్ నంబర్', అంటూ దించే శాడు.

వర్తమానంలోకి వచ్చి–

ఈ హత్యలు మూడు ఒకరే చేసినవని భావిస్తే, ఏ ఒక్కరి హత్యా రహస్యం తెలిసినా, మిగతా విషయాలన్నీ వాటంతట అవే విడిపోతాయి.

వివాహితలై, కాపురాలు చేసుకుం టున్న మంగళ, రజనీల గురించి కన్న– ముందుగా లేడీ డాక్టర్ ప్రమీల గురించి పరిశోధన ప్రారంభించడం మంచిదని భావించాడు దివాకర్.

పురుషులను ద్వేషించే స్త్రీ, అవివా హిత అయిన ప్రమీల కన్య కాదు.... హేపీగా రతి సుఖాలు అనుభవిస్తూండేది.

ఈ విషయం చాలు.

ఇక రంగంలోకి దిగాలి.

కావల్సిన కాగితాలన్నీ రడీ చేసుకుని, బ్రీఫ్‌లో సర్దుకుని, ఫోన్ దగ్గరగా వచ్చి ఎవరికో డయల్ చెయ్యడంలో నిమగ్న మయ్యాడు దివాకర్.

* * *

అద్దంలో తన రూపురేఖల్ని మరో సారి చూసుకున్నాడు దివాకర్. అద్దం ముందు నిల్చున్నది దివాకరే అయినా, అద్దంలో కనిపించేది మాత్రం వీధి వీధి తిరిగి బట్టలు అమ్ముకునే ఓ చిల్లర వర్తకుడు.

మూతి మీద మీసం, ఎడమ కంటి కింద ప్రస్ఫుటంగా కనిపించే పుట్టుమచ్చ, తలమీద పాతకాలపు టోపి, చారల బని యను, బాతిక్ లుంగీ–ఇవన్నీ దివాకర్‌ని పూర్తిగా మార్చివేశాయి.

తనమీద తనకే నమ్మకం పోవడంతో తృప్తిగా నిట్టూర్చి, అంతకు ముందే అమర్చి పెట్టుకున్న ఓ పెదద సూట్ కేస్ పట్టుకుని బయలు దేరడానికి ముందుకు నడిచాడు అతను.

అది అతని అక్క జయమ్మగారి ఇల్లు. అక్క, బావ రామం ఇద్దరూ డాక్టర్లే కావడంతో జంటగా అమెరికా వెళ్ళి అక్కడే సెటిలైపోయారు. రెండేళ్లకోసారి వచ్చి మంచి చెడ్డా చూసుకుని వెళుతుంటారు.

ఆమెకు చాలా కంపెనీలలో వాటాలున్నాయి. బావగారి పేరన మద్రాసు, బెంగుళూరు, కాంచీవరంలో స్వంత భవనాలు వున్నాయి.

అక్కడ వాళ్లు ఆర్జించే ఆర్జనలో చాలా భాగం ఇండియాకు దివాకర్ పేరన పంపుతూంటారు. అతను ఆ డబ్బుని పెద్ద కంపెనీలలో షేర్లు కొనడానికి ఉపయోగిస్తుంటాడు.

ఇంటిని ఎవరికీ అద్దెకు ఇవ్వకుండా, తమ్ముడి అధీనంలోనే వదిలేసింది జయమ్మగారు.

అతడు కూడా ఇంటి మెయింటెనెన్సు విషయంలో ఎంతో శ్రద్ధ చూపిస్తూంటాడు.

అతడిప్పుడు బయలుదేరింది పరశువాక్కంలో డాక్టర్ ప్రమీల పని చేసిన ఆస్పత్రికి.

ఎగ్మూరునుంచి పరశువాక్కం పెద్ద దూరమేం కాదు. దూరమే అయినా నడవడమంటేనే ఇష్టపడతాడు దివాకర్.

ప్రతిరోజూ ఏదోరకంగా ఎనిమిది కిలోమీటర్లయినా నడవందే నిద్రపోడు అతను.

ఇంటి చుట్టూ వాతావరణాన్ని ఓసారి దింగ్మాత్రంగా చూసి, రోడ్డుమీద అడుగు పెట్టాడు దివాకర్.

మద్రాసు అన్నా, అక్కడి మనుషులన్నా, పాతని పూర్తిగా తుడిచి పెట్టలేక తాను జబర్దస్తీగా ప్రవేశించాలనే ఆధునిక నాగరికత చేసే ప్రయత్నమన్నా దివాకర్‌కి చాలా యిష్టం.

బొంబాయి, కలకత్తా, బెంగుళూరు వంటి మహాపట్టణాలు అతను చూసి ఉండకపోలేదు.

వాటిలో అతనికి బాగా నచ్చింది బెంగుళూరు. అందమైన ఉదయ, సాయం సంధ్యలలో ఒంటరిగా ఆ చలచల్లని గాలులను చూసుకుంటూ వాహ్యాళి కెళ్లడమన్నా, కబ్బన్ పార్కులో ఎంతోసేపు గడపాలన్నా, మెజెస్టిక్‌సర్కిల్‌లో సినిమాలు చూడడమన్నా, అశోకా హోటల్లో భోజనమన్నా, మహాత్మాగాంధీ, బ్రిగేడ్ రోడ్లలో వున్న బార్లల్లో కేబరెట్ డాన్సులు చూడడమన్నా, లాల్ బాగ్ ప్రాంతంలో నిశ్చింతగా తిరగడమన్నా, హైగ్రౌండ్స్‌లోవున్న తన హోటల్ గదిలో గర్ల్ ఫ్రెండ్స్‌ని కలుసుకోవడమన్నా, వాళ్లతో సరదాగా గడపడమన్నా...

ఇవన్నీ బెంగుళూరులో తను మరిచిపోలేని మధురజ్ఞాపకాలేగాని, అక్కడే వుండిపోవాలని అతనికి అనిపించదు.

ఎన్ని రోజులున్నా, మద్రాసు తిరిగి వచ్చేస్తేగాని తృప్తిగా వుండదు తనకి.

ముఖ్యంగా గజగజలాడించే చలిలో, చలి బాధంటే ఏమిటో కూడా తెలియకుండా చేసే తన ప్రియసఖి సిల్వియా గాఢ పరిష్వంగం కూడా తనని ఎక్కువగా బెంగుళూరులో వుంచలేకపోయింది.

సిల్వియా..ఇరవై ఏళ్ళు ఇప్పుడిప్పుడే పైబడుతున్న సిల్వియా బలే చిలిపి పిల్ల. అమ్మో... ఆమెను మరిపించడం చాలా కష్టం.

దివాకర్ బెంగుళూరులో వున్నంత కాలం అతని అంతరంగిక కార్యదర్శిగా వుండే అందగత్తె ఆమె.

 

ఆమెతో గడపడం వెన్నెలను కౌగలించుకుని సుమశయ్యపై శయనించడం లాంటిదని భావిస్తాడు దివాకర్.

ఆడదంటే హీనంగా భావించే స్థితినుండి దివాకర్‌ను ఇవతలకి లాగిన ఘనత సిల్వియాదే. ఆమె వయసులో ఏమంత పెద్దది గాకపోయినా ఒక్కోసారి ఆమె ఒడిలో తననో పసిపిల్లవాడిలా భావించుకుని తన్మయుడై పోయేవాడు దివాకర్. అదే అతనికి ఆశ్చర్యం కలిగించేది. అందుకే గాబోల్ను ప్రతి స్త్రీలోనూ మాతృ అంశ అంతర్గతంగా ఉంటుందంటారు అనుభవజ్ఞులు-అనుకున్నాడు దివాకర్.

ఏనాడూ ఆమె దివాకర్ వ్యక్తిగత వివరాల గురించి అడగలేదు. తనని పెళ్ళిచేసుకోమని అంతకంటే అడగలేదు.

తనకేవన్నావస్తువు కావలిస్తే నవ్వుతూ అడిగి తీసుకుంటుంది. నగలన్నా, అలంకరణ అన్నా సిల్వియాకు అసలు ఇష్టముండదు. నిరాడంబరత ఆమెనుంచే అందరూ నేర్చుకోవాలి.

ఇవన్నీ దివాకర్‌కు చాలా ఇష్టమైనవి.

'కలుసుకున్నప్పుడు కౌగలింతలలో మునిగిపోవడం, విడిపోతున్నప్పుడు ఆవేదన వెలిబుచ్చకపోవడం' ఈ రెండూ దివాకర్‌కు చాలా ఇష్టం. ఆ రెండూ సిల్వియాలో అతను చూశాడు.

బెంగుళూరు తలుచుకుంటే ముందుగా నిండుగా మిలమిలా మెరిసే కళ్ళతో ఎదురుగా నిల్చేది సిల్వియానే.

ఈ ఉదయరాగంలో సిల్వియా మనసంతా పరుచుకోగానే దివాకర్ ఎంతో హాయిగా ఫీలయ్యాడు.

ఎదురుగా సిల్వియా లేదు.

ఉంటే ఏం చేసేవాడో!!

ఆలోచనల సులోచనాలు తీసి చూస్తే దివాకర్ అప్పుడే పరశవాక్యంలో వున్నట్టు గ్రహించాడు. ఎదురుగావున్న క్లాక్‌టవర్ అది గుర్తుచేసింది.

నాలుగడుగులు వేసేసరికి కుటుంబ నియంత్రణ గుర్తులతో ఓ పాత భవనం కనిపించింది.

అదే ప్రభుత్వ ఆస్పత్రి అయివుండాలనే ధీమాతో అందులోకి ప్రవేశించాడు.

పొడుగాటి బల్లమీద ఓ ఇద్దరు స్త్రీలు కూర్చుని ఏవో కబుర్లాడుకుంటున్నారు.

చామన ఛాయగా, కొట్టొచ్చినట్టు కనిపించే అరచేతులంత కళ్ళు, చిరునవ్వే అలంకరణగా ఉన్న ముఖం, బాగా పెద్దవిగా వున్నాయని భావించడానికి అవకాశమున్నంత వక్షోజద్వయం, తెల్లని చీర, తెల్లని బ్లౌజు, మెడలోనూ, చేతులకీ ఎక్కువగా బంగారు నగలు ఆమె ... నర్సు అయివుండాలనుకున్నాడు.

ఆ పక్కామె ఆకుపచ్చ, ఎరుపు బోర్డరువున్న తెల్లని చీర, లేతఎరుపు బ్లౌజు వేసుకుంది. పెద్ద ఆకర్షణేమీ ఆమెలో లేదు. కానీ బాగా చురుగ్గా కనిపించింది. ఈమె ఎవరో సంఘసేవిక అయివుండాలనుకున్నాడు.

గోడకు చేరబడి ఆనాటి స్థానిక దినపత్రిక ఎవరో చదువుకుంటున్నాడు. బాగా మాసిన బట్టలు వేసుకున్నాడు.

గోడల నిండా కుటుంబనియంత్రణకు సంబంధించిన రకరకాల అంకెలు, నినాదాలు, గ్రాఫులు, మేపులు గోడ...చాలా బిజీగా వుంది.

ఆస్పత్రి వాతావరణం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

వాళ్ళిద్దర్నీ చూసి "నమస్కారం"

అన్నాడు దివాకర్

ఎందుకనో ఆ టైంలో వాళ్ళకి పని వత్తిడి ఏమీ ఉన్నట్లు లేదు. ఏవో కబుర్లు చెప్పుకుంటున్నట్లున్నారు.

ఈ రోగుల వాసనలో, మందుల ఘాటులో పీళ్ళెలా ఉద్యోగాలు చేస్తారో గదా అనిపించింది దివాకర్‌కు. అంతలోనే నవ్వొచ్చింది. వాతావరణం ఎలా ఉన్నా ఈ నర్సుల్ని చూస్తేనే అందరూ లొట్టలు వేస్తారనే నిజం గుర్తుకు వచ్చి నెమ్మదిగా వారివేపు కదిలాడు భుజం మీది మూటతో.

"ఎవరు కావాలి?" అడిగింది సంఘ సేవిక.

నర్సు అడిగివుంటే బావుండునని అనుకుని.

"మాది సింగపూర్. ఇక్కడ చీరలు, సెంట్లు, ఇతర విదేశీ వస్తువులు అమ్ము





తూంటాను. డాక్టరమ్మగారు అప్పు డప్పుడు నా దగ్గర చీరలు కొంటూం టారు. వారి కోసం వచ్చాను" అన్నాడు.

"నువ్వు చీరలమ్ముతావా? ఇప్పుడు తెచ్చావా?"అడిగింది ఆతృతగా నర్సమ్మ.

"అవును, తెచ్చాను. కానీ ముందు డాక్టరమ్మగారికి చూపించాక, వారు తీసు కున్నాక మీకు చూపిస్తాను. వారికి పెళ్ళటకదా! స్పెషల్ చీరలు కావాలంటే తెచ్చాను."

"ఎవరికి పెళ్ళి?" ఆశ్చర్యంగా అడి గింది సేవిక.

"మీ డాక్టరమ్మగారికే" నింపాదిగా అన్నాడు దివాకర్.

"ఆమెకు పెళ్ళేమిటి? ఒక్క మగా డితో కాపురం చెయ్యాల్సిన అవసరం ఏముంది ఆమెకు. నీకు తెలీదా.. ఆమె చచ్చిపోయింది. కాదు కాదు, హత్య చేశా రెవరో..." అనీ చాలా యధాలాపంగా అని—

"ఆ చీరలు నాకు చూపించవయ్యా! ఎవరు కొంటే నీకేం అవి అమ్ముడుపోవ డమే కదా నీక్కావల్సింది"అంటూ పూర్తి చేసింది నర్సు.

"డాక్టరమ్మను హత్య చేశారా!" ఆశ్చర్యం ప్రకటించాడు.

"అలా తిరిగే ఏ ఆడదానికైనా అదే గతి పడుతుంది. ఆ చీరలేవో చూపించ వయ్యా ముందు" అంది నర్సు.

దివాకర్ పెట్టె తెరిచి కంటికి సదరుగా వుండే చీరల్ని ఆ బెంచీమీద వుంచాడు.

అలా వుంచకముందే నర్సు అతడి చేతుల్లోంచి ఓ చీర అందుకుని సగానికి పైగా విప్పి, తనకి ఎలా వుంటుందో అని పమిటలా వేసుకుని చూడసాగింది.




అక్కడుంచిన చీరలన్నీ ఆమెకు నచ్చినట్టున్నాయి.

"ఆ...ఎలా ఇస్తావ్ ఈ చీర ?"

"ఖరీదుకి..." కొంటెగా అన్నాడు దివాకర్.

అందులో వ్యంగ్యం అర్థం చేసుకుని దివాకర్ కళ్ళల్లోకి మరీ విశాలంగా చూసేస్తూ నవ్వుతూ—

"అది కాదయ్యా ఇన్‌స్టాల్‌మెంటు పద్ధతిలో ఇస్తావా అని" అంది నర్సు.

"వాయిదాల మీదా...? మా సేట్ ఒప్పుకోదేమో. అయినా మీరు గవర్న మెంటువాళ్ళు కదా! అడుగుతాను! ఇవ్వొచ్చు. మీది పర్మనెంటు ఉద్యోగమే కదండీ".

"నాకు పర్మనెంటుగా వున్నది ఉద్యోగం ఒక్కటే" అంది అదోలా చూస్తూ.

"అలాగేనండీ. మీరెక్కడ ఉంటారో చెప్పండి. మా సేట్‌ని కనుక్కొని ఆయన ఒప్పుకుంటే వచ్చి ఇస్తాను. అవునుగానీ డాక్టరమ్మ చచ్చిపోయిందంటే నమ్మలేక పోతున్నాను."

"ఇందులోనమ్మడానికేముందయ్యా! మేమేమన్నా అబద్ధం ఆడుతున్నామను కుంటున్నావా ? మగపిచ్చి, మదపిచ్చి వున్న ఆడదాని బతుకు అలాగే అంతం అవుతుంది. అది సరే. నా ఎడ్రసు రాసుకో. 27, ఆదిమూలం వీధి, పెరంబూర్, మద్రాసు 13..." అంది.

అతను అది ఓ కాగితం మీద రాసు కుంటూ,"అసలు మీ పేరేమిటో చెప్పలేదు" అన్నాడు.

ఆమె నవ్వుతూ "జ్యోతి" అంది.

"అక్కడో చర్చి వుంటుంది. దానికి పక్కగానే ఒక పెంకుటిల్లు వుంటుంది. ముందు భాగంలో ఆంగ్లో ఇండియన్స్

వుంటున్నారు. వెనక భాగంలో నేనుంటు న్నాను. సాయంత్రం అయిదు తర్వాత ఇంట్లోనే వుంటాను. లక్ష్మీవారం నాకు ఆఫ్" అంది అన్నీ వివరిస్తూ.

నేర పరిశోధనలో ఈమె నాకు బాగా ఉపయోగపడవచ్చు. ఒక్క నేర పరిశోధన అన్నమాటేమిటి- అన్నిరకాలా బాగా ఉపయోగపడుతుంది......' అని మనసులో అనుకుని-

"మీ భర్త ఏం చేస్తూంటాడు" అని అడిగాడు.

జ్యోతి కిసుక్కున నవ్వి-

"మొగుడా మొద్దులా... అలాంటి శాల్తీలేవీ నాకు లేవు. నేను ఏక్ నిరంజన్. కుమారి జ్యోతిని" అంది, అప్పుడే ఆ విషయం జ్ఞాపకానికి వచ్చినట్టు పమిట సర్దుకుంటూ.




అర్థం లేదనుకుంటూనే లక్ష్మీవారం కోసం ఎదురు చూస్తూ ఆ రెండు రోజులూ గడిపాడు దివాకర్.

లక్ష్మీవారం ఉదయం, హైదరాబాదు లతల లాల్చీ, బెల్ పేంటూ వేసుకుని, మీసం, ముఖం మీద మచ్చ మరిచిపోకుండా అంతా అప్పటిలాగే తయారై, ఓ డజను మరిన్ని మంచి చీరలు, బ్లౌజు ముక్కలు పెట్లో పెట్టి బయలుదేరి, ఎగ్మూరులో బస్సెక్కాడు దివాకర్.

కొద్దిసేపు తర్వాత పెరుంబూర్‌లో దిగి, జ్యోతి ఇచ్చిన చిరునామా వెతుక్కుంటూ నడక సాగించాడు.

చాలా ఇబ్బాగా వుంది ఆ ప్రాంత మంతా బీదరికం, దారిద్ర్యం, మురికి, చెత్త, చెదారం- ఓ రకంగా మురికివాడ అనుకోవచ్చు.

అయితే మురికివాడ పేరుకేగాని, నిజానికి అందులో నివసించే వాళ్ళ ఇళ్ళు చాలా పరిశుభ్రంగా, ఆకర్షణీయంగా వున్నవి కూడా వుంటాయి.

అలాగే జ్యోతి వుండే ఇల్లుకూడా చక్కగానే ఎందుకు వుండి వుండకూడదు అని అనుకుంటూ, నాలుగైదు సందులు దాటి ఎట్టకేలకు చర్చి, దానిపక్కగా వున్న ఇంటి ముందు చిన్న బోర్డు కనిపించింది. ఆ బోర్డు మీద జ్యోతి చెప్పిన ఆంగ్లోఇండియన్ పేరుంది.

మెల్లగా గేటు దాటి ముందుకు నడిచి, వెనకవున్న ఇల్లు చేరాడు. అది నిశ్చయంగా జ్యోతి ఇల్లే అయ్యుంటుందనే విశ్వాసంతో తలుపు తట్టాడు.

ఓ క్షణం తర్వాత తలుపు తెరిచింది జ్యోతి.

ఎదురుగా కనబడ్డ బట్టలమ్మే దివాకర్‌ని చూసి ఆశ్చర్యంగా-

"అరే... నువ్వా ... నిజంగా వస్తావనుకోలేదు. రా...రా...లోపలికిరా..." అంటూ ఆహ్వానించింది.

అప్పుడే తలంటుకున్నట్టుంది. పొడవాటి కేశాలు తడితడిగా చిందరవందరగా వున్నాయి. తెల్లటి జాకెట్టు, ముదురు పసుపురంగు చీర ధరించివుంది ఆమె. కళ్ళల్లో కుంకుడు పులుసు పడిందో ఏమో విశాలమైన కళ్లు ఎరుపు జీరతో ఎంతో ఆహ్లాదంగా వున్నాయి.

నిజంగా చెప్పుకోదగ్గ అందం ఆమెది. దానికి తోడు కాస్త భారీగా అనిపించే శరీరమేమో అందానికి హుందాతనం కూడా జతపడింది. హాస్పిటల్లో సేవా భావం ప్రదర్శించే ఆ డ్రెస్‌లో ఉండగా కోరిక పుట్టించే ఈ అందమే, ఇప్పుడు ఈ వాతావరణంలో ఈ దుస్తుల్లో సద్భావం కలిగించటమేగాక ప్రేమ అంటారే, అది పుట్టించేలా ఉండటం ఆశ్చర్యం కలిగించింది దివాకర్‌కు. అందం అనేది మనిషిలో ఉందా? చూసేవారిలో ఉందా? పరిసరాల్లో ఉందా? వేష ధారణలో ఉందా అనే మీమాంసలో పడ్డాడు దివాకర్ అలాగే ఆమెను కళ్ళప్పగించి చూస్తూ.

గుటకలు మింగుతూ లోపలికి వచ్చి అక్కడున్న చిన్న స్టూలుమీద పెట్టె పెట్టి నిల్చున్నాడు.

"కూర్చో...అలా ఆ కుర్చీలో కూర్చో. తలుపులు తీసి వుండడం ఇక్కడంత మంచి పని కాదు" అంటూ వీధితలుపు లోపలినుంచి గడియ వేసి, చిందర వందర అయిన జుత్తుని వదులుగా కొప్పు పెట్టుకుని, తానూ ఒక కుర్చీలో కూర్చుంది. అతని వేపు చూస్తూ.

'కొప్పులో ఈ పప్పులకుప్ప...అబ్బ ఎంతబావుందీ' అనుకున్నాడు దివాకర్.

"కొత్తవేమైనా తెచ్చావయ్యా ... అవునుగానీ నీ పేరేమిటి?" అంది సర్దుకుంటూ.

"శేఖర్ ... సింగపూర్ శేఖర్ అంటారు. మీ డాక్టరమ్మగారు నన్ను అలాగే పిల్చేవారు"

"మధ్య ఆవిడగురించి ఎందుకయ్యా! చీరలు చూపించు"

"అలాగేనండి మీకు యజమాని కదా, ఆమె అంటే అంత చీదరెందుకూ మీకు? పాపం చనిపోయింది కూడాను" సానుభూతి ప్రదర్శించాడు.

"నీ దగ్గర చీరలు కొని వుంటుంది. అందుకే ఆమెపై ఈగ వాలనివ్వడం లేదు నువ్వు అది... అది ఆడకుక్క... ఛిచ్..."

"ఛ ఛ ... అంతంత పెద్ద మాటలెందుకు"

"పెద్ద మాటలు కాదయ్యా మగాడైతే చాలు. ఇంకా ఆడకుక్క నయం... పైగా పెద్ద డాక్టరు...ఛ..."

"ఎంతో దైవభక్తి కలదనీ, మగవాళ్ళంటే కోపమనీ"

"అదంతా ఓ నాటకం. అమ్మో... అదా..."

"ఏం చేసింది డాక్టరమ్మ?"

"ఆ విజయ లేదూ... మొన్న నువ్వు చూశావే"

"ఎవరూ... ఏ విజయా ?"

"అదేనయ్యా ఆ రోజు ఆస్పత్రిలో నాతోపాటు లేదూ... ఆమె సోషల్ వర్కర్"

"ఓ! సంఘ సేవికా"

"సంఘ సేవికా పాడా. ఆవిడకు కాబోయే మొగుణ్ణి ఎంచక్కా వల్లో వేసుకుంది. అంతేనా నా బోయ్ ఫ్రెడ్సుంటే వాళ్ళనీ కొంగున కట్టేసుకుంది. ఆవిడ ఇల్లొక బోతల్ హౌస్‌కన్నా హీనమైంది. పొడుగు వాడవనీ, పొట్టివాడవనీ, లావుగా వుండనీ, సన్నగా వుండనీ రూపు రేఖలెలాటివి కానీ మగవాడైతే చాలు...అంత కామపిశాచిని నేనెక్కడా చూళ్ళేదు.నయం చచ్చిపోయింది కానీ మరో రెండు సార్లు కలిసుంటే నిన్ను....నిన్ను కూడా బెడ్ రూంలోకి లాగేసును. ఎంచక్కా చీరలూ

అవీ వూరకనే కొట్టేసును నీ నుండి. నువ్వుకూడా ఓ రకంగా అందగాళ్ళలోనే జమ"

ప్రమీల మీద జ్యోతికి వున్న కసి ఇంతా అంతా కాదని ఆమె మాటల ప్రవాహం వల్ల తెలుస్తోంది.

పెళ్ళి కాకుండా డాక్టర్ ప్రమీల అనేక మగవాళ్ళను వలలో వేసుకుంటోందని నిందించే ఈ జ్యోతి మాత్రం ఏం తక్కువ తింది? ఈమెకు బోయ్ ఫ్రెండ్స్ వున్నారట...అంటే...ఈవిడ మాత్రం ఏం పవిత్రంగా వుంది?

నర్సులందరూ అలాంటివారంటే ఏమో చెప్పలేం.

అయినా ఈవిడనూ, ఆవిడనూ అని ఏం ప్రయోజనం. ఈ సమాజంలో ఏది సజావుగా జరగవలసిన రీతిలో, జరగవలసిన వయసులో జరిగిపోతోంది గనుక, ప్రత్యేకంగా ఏ ఒక్కరిద్దర్నో ఎలా తప్పు పట్టటం. ఆ మాటకొస్తే ఇప్పుడీ క్షణాన్న తను అసలు వచ్చిన పనేమిటి? మరి తన బుర్రలో తొలుస్తున్న పురుగుల రొద ఏమిటి? ఆవిడ అందం చూడగానే సిల్వియాను మరచిపోయి ఏమేమో కలలు కనటంలేదా తను...

"అనవసరంగా నా చేత వాగించావు కానీ మీ సేట్ వాయిదాల మీద ఇవ్వ డానికి ఒప్పుకున్నాడా?" అడిగింది జ్యోతి.

"ఒప్పుకోకపోతే మీ ఇల్లు వెతుక్కుంటూ వస్తానా" అంటూ పెట్టె తెరిచాడు.

అందులో చీరలు, వాటి డిజైన్లు జ్యోతిని వెర్రెత్తించాయి. అన్నిటినీ పట్టుకుని విప్పేసి నానా గొడవ చేసేసింది.

'ఆడవాళ్ళకి చీరలన్నా, నగలన్నా అంత వెర్రిగా వుంటుంది కాబోలు' అనుకున్నాడు మనసులో దివాకర్.

"ఒక్క క్షణం. కాఫీ తీసుకువస్తాను" అంటూ ఆమె కుర్చీలోంచి లేచి పక్క గదిలోకి ఓ గెంతు గెంతింది.

వెనుకనుండి చూస్తే మరింత అందంగా కనుపించిందామె.

'జ్యోతి మరీ అల్లరి పెట్టేస్తోందే' అని మెచ్చగా అనుకుని చీరల వంక చూశాడు.

ఆమె అన్నీ చిందర వందర చేసేసింది.

ఈ పరిశోధన కోసం ఓ బట్టలషాపు మిత్రుణ్ణి అడిగి ఈ చీరలు తెచ్చాడు తను. జ్యోతికి తను వాయిదాల మీద నిశ్చయంగా చీర ఇవ్వలేడు. ఓ చీర ఆమెకు అలాగే వాయిదాల పద్ధతి అని చెప్పి ఇచ్చి దాని ఖరీదు తానే షాపుకి ఇచ్చేయాలి.

నేర పరిశోధనలో కొంత ఖర్చుకూడా అవుతుందికదా!

పొగలు కక్కుతున్న వేడి వేడి ఇడ్లీలు గల రెండు ప్లేట్లు, సాంబారు, చట్నీ పొడి ఇవన్నీ ఓ ట్రేలో పెట్టి తీసుకు వచ్చింది జ్యోతి.

ఆమెకు సహాయం చేసేందుకు ట్రే తాను అందుకోబోయాడు దివాకర్ ఎలియాస్ శేఖర్.

ఆమె చేతివేళ్ళు అతనికి తగిలాయి. ఆ స్పర్శకు ఆమె విశాలంగా, కొంటెగా అతనివేపు చూసింది.

ఆ చూపుకు ఏ అర్థం చెప్పుకోవాలో, సిల్వియా కూడా అతనికి చెప్పలేదు.

ఆ అర్థం దొరికే నిఘంటువు ఇంత వరకూ ముద్రించబడలేదు.

టేబిల్ మీద ట్రే పెడుతున్నప్పుడు

ఆమె వంగక తప్పలేదు. అప్పుడు పమిట జారి కిందపడబోయింది.

ఆమె యవ్వనసంపద ఎంత కంగారు పెట్టిందో దివాకర్ ఊహకు అందని విషయం.

"తినవయ్యా బాబూ... తినే సేటట్టు అలా చూస్తావేం" కొంటెగా అంటూ, ఓ కుర్చీలో కూర్చుని ఇడ్లీ ప్లేటు అందుకుంది.

"ఇవాళ శలవు రోజు కదా! బాగా ఆలస్యంగా లేస్తాను. ఇడ్లీలే చేసుకుంటాను. నాకు చాలా ఇష్టం కూడానూ. అన్ని పనులూ అయాక ఎంచక్కా ఓ అరడజను ఇడ్లీలు నావి కావని 'హాంఫట్' చేసి, రడీ అయి, ఇక రోడ్డు మీద పడతాను. ఫ్రెండ్స్ ఇళ్లకో, మేట్నీ సినిమాకో పోతాను. మధ్యాహ్నం భోజనం చెయ్యను. రాత్రికి మాత్రం హాయిగా ఎన్నో హోటల్‌కు వెళ్ళి సుష్టుగా తిని ఇల్లు చేరతాను. లేదా మరో సినిమాకి పోతాను. నాకు సినిమా పిచ్చి ఎక్కువ" తింటూ మాట్లాడుతోంది జ్యోతి.

"అయితే మిమ్మల్ని ఈ రోజు వచ్చి డిష్టర్బ చేశానన్నమాట"

"అబ్బెబ్బే ... అలాంటిదేం లేదు. నువ్వు రావడం ఇవాళ నాకు చాలా సరదాగా వుంది" అంది జ్యోతి.

"ఓ చిన్న సలహా కావాలి..." నసుగుతూ అడిగాడు శేఖర్.

"ఏమిటి?" అన్నట్లు విశాల నయనాలతో ప్రశ్నించింది జ్యోతి.

"మరేం లేదు. మీ డాక్టరమ్మ..."

"మళ్ళా ఆవిడ విషయం ఎందుకయ్యా"

"అది కాదు. ఆమె నాకు కాస్త డబ్బు బాకీ వుంది"

"అది చావు ఖాతా కింద రాసుకో"

"అలాంటే ఎలా? మా సేట్ వూరుకోడు కదా! ఆమె బంధువులు ఎవరేనా.."

"బంధువులా పాడా... రాయపేటలో ఆమె ప్రియులలో ఒకడికి పెద్ద ఫేన్సీ షాపు ఒకటి వుంది. పవిత్రన్ అను కుంటాను అతని పేరు ... గణేష్ ఫేన్సీ స్టోర్స్ కాబోలు. అక్కడ నీ అదృష్టం ట్రై చెయ్యి"

శేఖర్ మరేం మాట్లాడలేదు.

టిఫిన్ అయాక, కాఫీ చేసి ఇచ్చింది జ్యోతి. ఆ తర్వాత ఆమెకు నచ్చిన ఓ చీర వుంచుకుని, ఖరీదడిగింది.

"అమ్మో! నూట ఏభై రూపాయలే, నేనెక్కడ తేను. తగ్గించుకోవయ్యా బాబూ"

"మీరు వాయిదాల లెక్కన కదండీ ఇస్తారు. సరిపోతుందిలెండి. నెలకి ఏభై చొప్పున ఇచ్చెయ్యండి."

"అమ్మో. ఏభయ్యే. పాతిక కన్న ఒక్క కానీ ఎక్కువ ఇవ్వలేను".

"సరే. సేట్‌తో చెప్తాను. మరి నేను వస్తాను" అంటూ లేచాడు శేఖర్.

"అంత అర్జంటా. కొంచెం సేపు వుండు" అంది జ్యోతి.

మనసులో అయితే అతనికి వుండాలనే వుంది. ఆమె నిర్లక్ష్య సౌందర్యాన్ని చూడాలనే వుంది.

ఆ తర్వాత ఏమౌతుందో కూడా అతనికి తెల్సు.

ఎలాంటి ఆడదాన్నైనా అతను ఆకర్షించగలడు. తన వేపు తిప్పుకోగలడు.

అయితే, నేర పరిశోధనలో ఎదురయ్యే వారి జోలికి మాత్రం పోడు. అది అతని నియమం.

జ్యోతిని తనివితీరా ఓసారి చుంబిం





చాలని అతనికి కోర్కె కలిగింది. కానీ... ఆమె పరిస్థితి, వ్యవహారం అర్థం అవుతూనే వుంది. అయినా...

బాక్స్ పట్టుకుని బయలుదేరాడు దివాకర్.

* * *

ఆ రోజంతా దివాకర్ చాలా బిజీగా వున్నాడు. జాన్ సెల్వమ్‌ను కలుసుకుని, ఇంతవరకూ తాను చేసిన పరిశోధనలు, వాటి వివరాలు అన్నీ రడీ చేసి, టైపు చేయించి, ఫైల్ చేశాడు.

అలసటగా ఇంటికి వచ్చి, షవర్ బాత్ చేసి, టి. వి. ఆన్ చేశాడు. నానా చెత్తా వస్తోంది.

'భారతదేశంలో టీవీ ఇంకా అభివృద్ధి చెందాలి' అనే విమర్శ మనసులోనే అనుకుని, మంచం మీద వెల్లకిలా పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

ఆ రోజున తను చేసిన పనులన్నీ ఓసారి నెమరు వేసుకున్నాడు. బండి మరీ మెల్లగా ముందుకు నడుస్తోంది. ఇలాగైతే లాభం లేదనిపించింది.

జ్యోతి జ్ఞాపకానికి వచ్చింది.

ప్రమీల విషయంలో ఆమె చాలా దయాహీనంగా వుంది. ఆమెతో సంభాషణ వల్ల ఏం కొత్త విషయాలు తెలిసాయి? నేర పరిశోధన ఎంతవరకూ ముందుకు నడిచింది?

పైకి ఎంతో పవిత్రంగా కనిపించే ప్రమీల అసలు స్వరూపం తెలిసిన వ్యక్తి ఈ హత్య చేశాడా?

అలా అయితే మంగళ, రజని కూడా వక్ర మార్గాలలో సంచరించేవారా?

వక్రమార్గాలలో తిరిగే స్త్రీలను హత్య చేసే శపథం ఏమైనా చేశాడా ఈ హంతకుడు?

అలాంటి స్త్రీల మీద ఆ హంతకుడికి ఎందుకంత కసి?

...ఆలోచనలన్నీ తలను చుట్టుముడుతున్నాయి.

హతులు ముగ్గురూ ఒక ప్రాంతానికి చెందినవారు కారు. ఆ కొస ఒకరైతే ఈ కొస ఒకరు.

మరి హంతకుడికి ఈ విషయాలు, వివరాలు ఎలా తెలిసాయి?

అతనేమన్నా సేల్స్‌మన్ ఉద్యోగం చేస్తున్నాడా? వాళ్ల ఉద్యోగ ధర్మం ప్రకారం ఎప్పుడూ తిరుగుతూ వుండాలి. వాళ్ళకి ఎన్నో విషయాలు తెలుస్తాయి.

మంగళ...

మంగళ భర్త సదాశివన్ ఏదో సేల్స్‌మన్ ఉద్యోగి అని విన్నాడు.

అతనిని గాని కాంటాక్ట్ చేస్తే...?

అంతకన్న ముందుగా రజని పని చేసిన వజీర్ అలీ కార్యాలయానికి వెళ్ళాలనుకున్నాడు.

* * *

వజీర్ అలీ ఏదో పని మీద హైదరాబాద్ వెళ్ళినట్టు చెప్పాడు ఆ ఆఫీసు మేనేజర్ ఖాసింఖాన్.

ఖాసింఖాన్‌కు తనకు తాను పరిచయం చేసుకున్నాడు దివాకర్. మర్యాద సూచకంగా కాఫీ తెప్పించాడు ఖాసిం.

అక్కడే కాస్త దూరంగా కూర్చుని ఓ వృద్ధుడు తనని చూసి సమస్కరించడం ముందే గుర్తించాడు దివాకర్.

మాటల సందర్భంలో అతడి పేరు ముత్తుస్వామి అనీ, ఆ కార్యాలయ ప్రారంభం నుంచీ అక్కడే టైపిస్టుగా పని చేస్తున్నాడనీ తెలుసుకున్నాడు.

ఖాసింఖాన్ వల్ల ఏ ఉపయోగమూ

లేకపోయింది. అడిగినదానికి ముక్త సరిగా ఏదో జవాబు తప్ప, ప్రయోజనం లేకపోయింది. అదీగాక అతనికి పుట్టెడు చెముడు.

వాళ్ళ వద్ద శలవు తీసుకుని బయటకు వచ్చి మోటార్ సైకిలు ఎక్క-బోతూండగా, ముత్తుస్వామి దగ్గరగా వచ్చి-

"బాబూ ! రజని హత్య విషయం ఏమైనా తేలిందా?" అని అడిగాడు.

"లేదండీ ! దివారాత్రాలు కృషి చేస్తూనే వున్నాం. ఇంకా ఏ సమాచారం అందలేదు అ... బైదిబై.. మీకు జీతం ఎంతిస్తారు?" అడిగాడు దివాకర్.

"ఏం ఇస్తారు బాబూ ! గొర్రెతోక బెత్తెడే అన్నట్టు నా జీతం, నా బతుకు అడక్కండి. ఈ లైన్లో బాగుపడా లంటే అదృష్టమేనా బాగుండాలి లేదా ఎవరో కవిగారు అన్నట్టు అందమైన ఆడదానిగానైనా పుట్టాలి".



"అదేవిటండీ! ఆడదానిగా పుడితేచాలు గొప్పవాళ్ళు అయిపోతారేవిటి"

"అలాగే అనిపిస్తూంది బాబూ ! చూడండి మరి రజని కేవలం నిన్నగాక మొన్న ఈ సంస్థలో జాయినై, క్షణ క్షణ ప్రవర్ధమానమై, మా బాస్ వజీర్ అలీ అభిమానాన్ని ఎంతగానో చూరగొంది. ఏ దైవపు చిన్న చూపోగాని లేకపోతే ఇంకా ఎంతో ఎత్తు ఎదిగిపోయి వుండేది. అర్థాంతరంగా కన్ను మూసింది. పాపం"

"ఆమె కోసం ఎవరేనా ఇక్కడికి వచ్చేవారా ముత్తుస్వామిగారూ..."

"రారండి..."

"రారా... రాలేదా..."

"రారు.."

"అదేమలా?"

"ఆమె వివాహిత. పైపెచ్చు వజీర్ అలీగారి అంతరంగిక..."

"అంతరంగిక అంటే?"

"అంతరంగిక కార్యదర్శి అన్న మాట.."

"కాదు మరేదో దాస్తున్నారు"

"అబ్బే. అలాంటిదేంలేదు. వాళ్ళిద్దరూ చాలా చనువుగా వుంటారని మా కార్యాలయంలో అందరికీ తెల్సు. ఇందులో నేను రహస్యంగా వుంచిందేముంది?"

"ఉమాపతి – అంటే రజని భర్తకు వీళ్ళ చనువు సంగతి తెల్సా?"

"అదేమో బాబూ... ఆ వివరాలన్నీ నాకెలా తెలుస్తాయి ? ఆఫీసులో వాళ్ళిద్దరూ చనువుగా వుంటారని, పని వేళలు అయిపోయినా అతని ప్రైవేట్ రూంలో ఆమె చాలా సేపు కూర్చుంటూంటుందని, అలీగారు ఆమెకు చాలా ఖరీదైన విదేశీ పరిమళ ద్రవ్యాలు బహుమతి లిస్తూంటారని... ఇవేవీ రహస్యాలు కావుగాబట్టి నాకూ తెలుసు. ఇక లోపలి విషయాలంటారా... ఆ భగవంతుడికే తెలియాలి. వస్తాను బాబూ! మా ఆవిడకు ఆరోగ్యం సరిగాలేదు. మందులు కొనుక్కోవాలి" అంటూ ముత్తుస్వామి నిష్క్రమించాడు.

మోటర్ సైకిల్ ముందుకు దూసుకుపోతోంది.

దివాకర్ తలలో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

"రజని వివాహిత. ఇద్దరు బిడ్డల తల్లి. స్వంత ఇల్లు, అభిమానించే భర్త. అయినా ఆమె వజీర్అలీతో ప్రేమ కలాపాలు సాగించినట్టు తెలుస్తోంది. ముత్తుస్వామి మాటలను బట్టి రజని ప్రవర్తనఅనుమానాస్పదంగాకనిపిస్తోంది.

ఒకవేళ భర్త ఉమాపతికి తన భార్య రజని ప్రేమ వ్యవహారం తెలిసిపోయిందా?

తెలిసి అతడే...

కాదు. కాకూడదు.

భర్తలను మోసం చేసే స్త్రీలన్నా, ప్రియులను మోసంచేసే ఆడవాళ్ళన్నా– బాగా కసివున్న ఎవరో ఈ హత్యలు చేస్తున్నాడా ?

అయుండాలి. ఆలోచించుకుపోతూంటే సమస్య మరీ జటిలంగా తయారు కాజొచ్చింది.

ఆలసటగా నగర పోలీసు కమీషనర్ కార్యాలయం చేరి, జాన్ సెల్వామ్‌ను విష్ చేశాడు దివాకర్.

"సరిగ్గా సమయానికి పిలిచినట్టు వచ్చేరే! మీ గురించే అనుకుంటున్నాను" అంటూ జాన్ బీరువాలోంచి ఓ పేకెట్ తీసి దివాకర్‌కు అందిచ్చాడు.

ఆతృతగా విప్పాడు దివాకర్.

అది... అది... జ్యోతికి తాను అమ్మిన చీర. అవును... అదే...అదే!

దివాకర్ సంభ్రమాశ్చర్యాలతో ఆ చీరకేసి చూస్తున్నాడు.




జ్యోతి శరీరం నగ్నంగా గదిలో మంచం పక్కన పడివుంది. ఆమె వేసుకునే బ్రా ఆమె ప్రాణాలు తీసే ఆయుధంగా వుపయోగించాడు హంతకుడు. తలగడ గలీబు ఆమె నోట్లో కుక్కబడి వుంది.

శరీరంమీద ఏ గాయాలు లేవు. మంగళ, రజని, ప్రమీలలలాగే మెడ చుట్టూ వురి బిగించడంవల్ల ఊపిరి ఆడక చనిపోయింది.

శవపరీక్షలో ఆమె కన్యకాదని, అతి తరచుగా పురుష సంపర్కం కలిగి ఉండే దని తెలిసింది. అయితే చట్టరీత్యా ఆమె అవివాహిత.

ఉదయం పాలవాడు వెళ్ళేసరికి తలుపులు తీసివుండడం గమనించి, ఎంత పిలిచినా పలక్కపోయేసరికి లోపలికి తొంగిచూశాడట.

నగ్నంగా పడివున్న జ్యోతి శవాన్ని చూసి అతను కంగారుగా కేకలువేశాడు. నలుగురూ చేరారు.

ఆమె హత్య కావింపబడినది అమావాస్య రాత్రి.

అంటే, ఈ హత్యలన్నీ ఒకే హంతకుడు చేస్తున్నట్టు మరోసారి రుజువైంది.

ఈ హంతకుడు అక్రమ మార్గాలలో పోయే స్త్రీలను మాత్రమే హత్యే చేసాడు.అదీన్నీ అమావాస్యరాత్రులలోనే అనే విషయం బలపడింది.

ఈ వార్త ఓ పెద్ద సంచలనాన్ని సృష్టించింది.

ఎవరో వర్తమాన ప్రచురణ కర్త, ఓ పేరున్న రచయితచేత 'మద్రాసు హత్యలు' అనే పేరిట ఓ చిన్ని పుస్తకం రాయించి సచిత్రంగా ప్రచురించి, స్వల్ప ఖర్చుతో మంచి ఆదాయం కూడా చేసుకున్నాడు.

పేపరు కటింగులు, ఈ పుస్తకం, కేసుకు సంబంధించిన ఇతర వివరాలు ఇవన్నీ దగ్గర పెట్టుకుని తదేకంగా ఆలోచిస్తున్నాడు దివాకర్.

ఇన్‌స్పెక్టర్ జనరల్ రాజారుద్ర ప్రత్యేక సమావేశం ఒకటి ఏర్పాటుచేసి ఉన్నతాధికారులందరినీ సమావేశపరిచి, ఈ హత్యల గురించి చాలా తీవ్రంగా చర్చించాడు.

దివాకర్ కూడా ఈ సమావేశంలో పాల్గొని రాజారుద్ర వెలిబుచ్చిన అభిప్రాయాలను కూలంకషంగా గ్రహించాడు.

రోజులు గడుస్తున్న కొద్దీ ఇంకెన్ని హత్యలు కానున్నవో అనే భయం అందర్లోనూ చోటుచేసుకుంది.

'ఈ హత్యలు చేస్తున్న వ్యక్తి ఏదో మానసిక రుగ్మతకు లోనైనాడు. ఆ తీవ్ర మానసిక సంచలనం అతని చేత ఈ హత్యలు చేయిస్తున్నది. అంతేగాని కాంతా కనకాలు ఈ హత్యకు కారణం కాదు.'

అని నిర్ణయించి అందరూ అప్రమత్తతో వుండి, అతి త్వరలో ఈ హంతకుడిని పట్టుకునేందుకు తీవ్ర కృషి చెయ్యాలని ఆయన ఆదేశించాడు.

* * *

నేను జ్యోతితో మాట్లాడం గాని, ఆమె ఇంటికి వెళ్ళి కొంతసేపు గడపడం గాని, ఆమెకు చీర అమ్మడంగాని ఈ హంతకుడు చూశాడా? నేను మారు వేషంలో వున్నానే! అయినా నన్ను పోల్చుకున్నాడా? అలాగే కాకపోతే, ఆ కొత్త చీర కమీషనర్ గారి పేరన పంపడంలో ఆంతర్యం ఏమిటి ? లేక కాకతాళీయంగా మంగళ చెవి, రజని జుత్తు, ప్రమీల గొలుసు పంపినట్టుగానే, జ్యోతి కొత్త చీర కూడా పంపేడా?... నేను హంతకుడిని వెంటాడబోతే, నన్నే హంతకుడు వెంటాడుతున్నాడా? చురుకుగాచూసే నా కళ్లు, పదునుగా పరిగెత్తే నా బుద్ధి నా వెంట వుండే హంతకుడిని గుర్తించలేక పోతున్నాయా ? ఈ కేసు రోజు రోజుకీ ఇంత జటిలంగా ఎందుకు తయారవుతున్నది ?

అసంతమైన ఆలోచనల్లో మునిగి పోయాడు దివాకర్.

నలభైఏళ్లకన్న తక్కువ వయసే వుండే మంగళ భర్త సదాశివన్ విపరీతంగా బీర్ తాగుతూండడం వల్ల పెద్ద బొజ్జతో అంత లావుగా తయారయ్యాడు. అప్పుడే అతనిలో వృద్ధాప్యపు ఛాయలు అవా ఒకటి కనిపిస్తున్నాయి. జుత్తు ఎక్కువగా వూడిపోతూ పట్టబ్బుర తయారవుతూంది.

ఆ శనివారం సాయంత్రం అతను ఇంట్లోనే వున్నాడు.





దివాకర్ వస్తూనే తననితాను పరిచయం చేసుకున్నాడు.

ఇద్దరూ ఎదురెదురుగా చెరో సోఫాలో కూర్చున్నారు.

"మీతో కొంచెం మాట్లాడదామని ఇలా వచ్చాను. నాకు తెలుసు. నేను అడిగే విషయాలు మిమ్మల్ని మానసికంగా బాధిస్తాయని. అయినా తప్పదు"

"నాకు అర్థమైంది ఇన్స్పెక్టర్‌గారూ! మీ డ్యూటీ మీరు చేస్తున్నారు. అడగండి. చెబుతాను"

"జరిగిన నాలుగు హత్యల గురించీ మీరు తెలుసుకునే వుంటారు. ఈ నాలుగు హత్యల్నీ దగ్గరగా పరిశీలిస్తే హంతకుడు ఒకడే అని అనుమానం కలుగుతుంది. ఏమంటారు" అడిగాడు దివాకర్.

"నేనేమంటాను. చెప్పండి"

"అదికాదు. మీకూ అలాగే అనిపిస్తోందా అని అడుగుతున్నాను"

"నాకు అనిపించడం, అనిపించక పోవడంతో ఏం వుంది? నా బతుకు బుగ్గిపాలై పోయిందికదా! ఇక ఏది ఎలా అయినా నాకేం అంత పట్టింపులేదు" నిరాశా నిస్పృహల మిశ్రమం అతని గొంతులో ధ్వనించింది.

"ఈ హంతకుడు చూపరులకు పైకి చాలా సామాన్యంగానూ, సాధువుగానూ కనిపిస్తూ అంతర్యంలో తట్టుకోలేనంత సంఘర్షణ అనుభవిస్తూంటాడని అనిపిస్తోంది. ఇదో ఫోబియా. ఈ ఫోబియా వుండేవాళ్లు చాలా విచిత్రంగా ప్రవర్తిస్తారు. ఈ హంతకుడు నిశ్చయంగా ఈ ఫోబియాతో బాధపడుతున్నాడని నాకు గట్టిగా అనిపిస్తున్నది. సమాజంలో మంచి స్థానంలో వుంటూ, సాంసారిక సుఖాలు అనుభవిస్తూ, పిల్లా పాపలతో హాయిగా కాలం గడుపుతూ, కామాతురత చేత

అందర్నీ మోసగిస్తూ వక్ర మార్గాలు తొక్కే స్త్రీలంటే ఇతనికి సరిపడదు. అలాంటి స్త్రీలు ఎదురైతే నిశ్చయంగా వాళ్లను చంపకుండా వదలరు ఇలాంటి ఫోబియా వుండేవాళ్లు. ఈ నాలుగు హత్య లలో మృతులైన నలుగురు స్త్రీలూ వక్ర మార్గాలలో చరించినవాళ్ళేఅనే..."

"ఇన్స్పెక్టర్" వెక్కిళ్ల మధ్య అన్నాడు సదాశివన్.

"ఐయామ్‌సారీ సదాశివన్! తప్పదు. మీ భార్యకు ఇతర పురుషులతో సంబంధం వుందనే అనుమానం కలగడం భరించ వీలులేని బాధే కలిగిస్తుంది. తప్పదు. కేసు అటే లీడ్ చేస్తోంది. అంచేత మీ ఇంటికి వచ్చే మగవాళ్ల వివరాలు కాస్త చెప్పండి"

సదాశివన్ దివాకర్ వేపు జాలిగా చూశాడు. అతని కళ్ళు అశ్రుపూరితాలై వున్నాయి.

'ఇలాంటి ప్రశ్నలు అడగడం ధర్మమా?' అన్నట్టున్నాయి అతని చూపులు.

అయినా తప్పదు. చెప్పాలి.

"మా ఇంటికి మా కొలీగ్స్ అంటే పది పదిహేనుమంది సేల్స్‌మెన్ వస్తూంటారు"

"తరుచూనా?"

"కాదు. ఏ రెండు మూడు నెలలకో ఓసారి"

"ఎందుకు?"

"వూరకనే నా కోసం"

"వాళ్ళలో ఎవరేనా మీ భార్యతో చనువుగా మాట్లాడంగాని, ప్రవర్తించడం గాని మీరు గమనించారా?"

"లేదు. వాళ్లు ఎవరేనా వచ్చినప్పుడు ఆమె సాధారణంగా ఎదురుపడేది కాదు. కాఫీ ఎప్పుడేనా ఇవ్వవలసివస్తే వచ్చి ఇచ్చేది"

"మరోలా అనుకోకండి. ఇంట్లో మీరు ఎప్పుడేనా డ్రింక్స్ అంటే విస్కీ, బ్రాంది లాంటివి తీసుకోవడం, మీ ఫ్రెండ్స్‌ని ఆహ్వానించడం..."

"నోనో అలా ఎప్పుడూ జరగలేదు. నేను బీర్ ఎక్కువగానే తీసుకుంటాను. ఒక్కణ్ణి నా గదిలో కూర్చుని ఏకాంతంగా అయిదారు బాటిల్స్ తీసుకుంటాను. ఎవ్వర్నీ ఎప్పుడూ ఆహ్వానించలేదు"

"సరే! ఎందుకడుగుతున్నానంటే, మీ ఇంటికి వచ్చే మీ కొలీగ్స్ కానీండి, మిత్రులు కానీండి వాళ్లలో ఈ ఫోబియాతో సఫర్ అయేవాళ్ళు ఎవరేనా వుంటే, వాళ్ళకి మీ భార్య అక్రమ సంబంధాల విషయం తెలిసి వుంటే కసితో సమయం కోసం వేచి వుండి...."

"బస్ బస్ ఇక ఆపండి ఇన్స్పెక్టర్. మీరడిగిన దాంట్లో ఆంతర్యం అర్థమైంది. మా కొలీగ్స్, మా ఫ్రెండ్స్ వీళ్ళవివరాలు కావలిస్తే తప్పకుండా ఇస్తాను. ఇంకా ఈ విషయంలో ప్రశ్నలడిగి నన్ను చిత్రవధ చెయ్యకండి" భారంగా తల పట్టుకుని దుఃఖించసాగేడు సదాశివన్.

"ఓకే సదాశివన్! సారీ, మిమ్మల్ని మానసికంగా డిస్టర్బ్ చేశాను. వస్తాను" అంటూ లేచాడు దివాకర్.

* * *

చీకటి తెరలు బాగానే ముసురు కున్నాయి.

దివాకర్ మనసంతా కికావికలంగా వుంది. సమస్యా పరిష్కారం ఏదీ అవడం లేదు. క్లూ ఎక్కడా దొరకడం లేదు.

తిన్నగా ఆఫీసర్స్ క్లబ్‌కు వెళ్ళి,



అక్కడ కొంతసేపు గడిపివస్తే బావుణ్ణని పించింది.

రిటైర్డ్ బ్రిగేడియర్ కాంపస్ చాలా సరదా అయిన వ్యక్తి. క్లబ్‌కి అప్పు డప్పుడు వస్తూంటాడు. డిఫెన్స్ మనిషే అయినా, ఈ క్లబ్‌కు రావడంలో ఓ సరదా వుందంటాడు. అతన్ని చూస్తే 'ఇంత పొట్టి మనిషి ఎలా డిఫెన్స్‌లో సెలెక్ట్ అయ్యాడా?' అని అనుమానం వస్తుంది.

అయితే బ్రిటిష్ కాలంలో హైట్ అంత ముఖ్యంగా చూసేవాళ్ళు కాదు. మనిషి, మనసు దిటవుగా వుందా లేదా, చురుగా వున్నాడా లేదా...ఇది మాత్రమే చూసే వారు.

అలా సెలెక్ట్ అయి, బ్రిగేడియర్ స్థానం వరకూ ఎదిగి రిటైరైన వ్యక్తి కాంపస్.

'అతను ఇవాళ క్లబ్‌కు వస్తే బావుణ్ణు. ఏవో తన అనుభవాలు చెప్తూ వూహా లోకంలోకి తీసుకుపోతాడు' అనుకుంటూ క్లబ్‌లోకి వచ్చి, మోటర్ సైకిల్ పక్కన వుంచాడు.

క్లబ్ చాలా డల్‌గా వుంది. బ్రిగేడి యర్ రాలేదు. తెలిసిన ఫ్రెండ్స్ కూడా రాలేదు.

ఏం చెయ్యాలో తోచలేదు. ఇంటికి వెళ్ళి వంటరిగా గడపాలంటే 'పనిష్ మెంట్'లా ఫీలయాడు.

వంటరితనం మనిషిని ఎంతగా కృంగ దీయగలదో అప్పుడప్పుడు దివాకర్‌కు అనుభవమే!

సిల్వియా జ్ఞాపకానికి వచ్చింది. వెంటనే తను వున్నది బెంగుళూరులో కాదని కూడా గుర్తొచ్చింది.

ఒక్కొక్కప్పుడు అంతే. ఎన్నో వున్నా ఏమీలేని వంటరితనం భయం కరంగా ఎదుట నిలుస్తుంది.

తప్పదు. అనుభవించాలి.

—అని అనుకుంటూండగా, ట్రిప్లికేన్‌లో వర్కింగ్ వుమెన్స్ హాస్టల్‌లో వుండే అరుణ గుర్తుకు వచ్చింది.

ఆమె ఇరవై రెండేళ్ళ అందమైన చిన్నది. మైలాపూర్‌లో ఓ ఫైవ్ స్టార్ హోటల్‌లో రిసెప్షనిస్టుగా వుంటోంది.

ఆ హోటల్‌లో జరిగిన ఓ పెద్ద చోరీ కేసు తాను పరిశోధించేటప్పుడు, అరుణతో పరిచయం అయింది.

తొలిసారి అరుణను చూసినప్పుడు, ఆమె లేత కింది పెదవి మీద కనిపించిన నల్లని పుట్టుమచ్చ అతనిలో మరులు రేపింది. మనిషి పొట్టిగా వున్నా, స్మార్ట్‌గా, చకచకా ఇంగ్లీషు మాట్లాడేస్తూ ఎంతో కలివిడిగా వుంటుంది.

'పుట్టుమచ్చ వున్న పెదవిని ముద్దు పెట్టుకోకపోతే, ఆ బతుక్కేం అర్థం వుంది?' అనుకుని, అంతకన్న ఎక్కువే సాధించాడు అరుణ నుండి దివాకర్.

హాస్టల్ వార్డెన్ చాలా ఖరాఖండీ మనిషి. ఎవర్నీ బయటకు వదలదు. ఏ నెలకో, రెండు నెలలకో ఓ ఆదివారం పర్మిషన్ ఇస్తుంది. అదేనా ఉదయం ఆరు నుంచీ రాత్రి పది వరకూ. ఆ తర్వాత వచ్చేవాళ్లు చలిలో, వానలో బయట బాధ పడవలసినదే!

"అత్తగార్ని మించిపోయిన ఆమె అజమాయిషీ కోరల నుంచి తప్పించు కోలేక, కోడళ్ళ కన్న నికృష్టంగా బతుకు వెళ్ళమారుస్తున్నాం" అంటూంటుంది అరుణ.

అయితే అరుణకు ఆ బాధ లేదు. డిటెక్టివ్ ఇన్స్‌పెక్టర్ దివాకర్ తనకు మారపు చుట్టమని చెప్పడమే కాకుండా,




దివాకర్ చేత కూడా చెప్పించేసింది అరుణ.

సాధారణంగా పోలీసు డిపార్ట్‌మెంటుతో ఎవరూ తగువు పెట్టుకోరు. వార్డెన్ అందుకు భిన్నంగా ప్రవర్తించ లేదు.

నెలకోసారి అరుణ శనివారం సాయంత్రం దివాకర్ రూంకి వచ్చి, సోమవారం ఉదయం హాస్టల్‌కి చేరేది. నేటివ్ విలేజ్ వెళ్తున్నానని అబద్ధం చెప్పేది.

'ఇవాళ శనివారం.... అరుణ... అరుణ వస్తే బాగుణ్ను' అనుకున్నాడు దివాకర్.

అరుణతో గడిపిన జ్ఞాపకాలు తియ తియ్యగా మనసంతా నిండిపోయాయి.

రూంకి వచ్చిన దగ్గరనుండి–

"ఇవాళేం వండిపెట్టేది? నీకేం ఇష్టం? నాకు ఫ్రాన్స్ ఫ్రై ఇష్టం. నీకేం కావాలో చెప్పు. చక్కగా గాజుల చేత్తో చేసి పెడతాను. ముందు బాత్‌రూంకెళ్ళి స్నానం చేసి రా..." ఇలా నానా గొడవా చేస్తుంది.

అరుణ తన సమక్షంలో ఉన్నంతకాలం గంటలు క్షణాల్లా గడిచిపోయేవి. సిల్వియా జ్ఞాపకం వస్తే మాత్రం ఓ క్షణం తాను గిల్టీగా ఫీల్ కావలసి వచ్చేది. కాని అది ఓ క్షణమే. అవసరం ముందు, కోరిక ముందు ఆ ఫీలింగ్స్ అన్నీ అణిచి పెట్టేసేవాడు.

తాను ఆ ఇద్దరిలో ఎవరినీ వివాహం చేసుకోవాలనుకోలేదు. కావాలనుకుంటే అభ్యంతరాలు లేవు. కానీ, తనకూ, వాళ్ళకూ కూడా అలాంటి ఆలోచన ఎన్నడూ రాలేదు... తనకు రాలేదు, నిజమే. కానీ సిల్వియా– అరుణలకు కూడా రాలేదని తనెలా చెప్పగలడు. వారి ప్రవర్తనను బట్టి తాను కేవలం అలా అనుకుంటున్నాడు అంతే.

"రోజుకో మగాడితో, వాడెంత గొప్ప వాడైనా, రసికుడైనా సరే తిరగటాన్ని ఏ ఆడపిల్లా సరదాగా తీసుకోదు, ఇష్ట పడదు" అంది సిల్వియా ఒకసారి ... నిజమేనేమో... మరి అరుణ సంగతి తెలిస్తే ఏం చేస్తుందో సిల్వియా...

'అరుణ వస్తే బావుణ్ను. పోనీ హాస్టల్‌కు ఫోన్‌చేసి కనుక్కుంటే ఎలా వుంటుంది' అనుకుంటున్న దివాకర్ ముందు ఓ ఆటో ఆగింది.

అందులోంచి అరుణ ... అప్సరాలా అరుణ దిగి–

"హలో దివాకర్" అంటూ పలకరించింది.

కాదు, అతనిపై సుగంధం చిలకరించింది.

అది కలో, నిజమో గుర్తించలేనంత సంభ్రమంతో అరుణను చూశాడు దివాకర్.

అది రోడ్డైపోయింది గానీ, లేకపోతేనా అమాంతం ఆమెను ఎత్తేసుకుని, ఇటునుండటూ, అటునుండిటూ గాలిలో తేలిపోయేవాడు.

ఆటో వెళ్ళిపోయింది. అరుణ వెనక కూర్చుని, గిలిగింతలు పెడుతూ దివాకర్ నడుం చుట్టూ కుడిచెయ్యి వేసింది.

అంతలావు మనిషీ గిలిగింతలకు గలగల నవ్వేడు.

ఏనాడూ లేనంత ఆనందంగా మోటర్

సెకిల్ ఎగ్మూర్‌వేపు హండ్రడ్ హార్స్ పవర్‌తో దూసుకుపోయింది.

* * *

గదిలోకి రాగానే అమాంతం ఎముకలు విరిగిపోయేంతగా అరుణను బలంగా కౌగలించేసుకుని, ముఖమంతా ముద్దుల్తో నింపేశాడు దివాకర్.

అరుణ అతని ధాటికి తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరయి పోయింది.

"ఏమిటి బాబూ ఇది...అబ్బ... వూపిరైనా తీసుకోనిస్తావా"

"ఏమో నాకు తెలీదు ... అలా చెయ్యాలని అనిపించింది. చేసేసాను. ఇక నీకేమేం చెయ్యాలనిపిస్తే అలా చేసేయ్. నేనేం అభ్యంతరం పెట్టను" అన్నాడు.

"నాకేం ఇలాంటి పనులు చెయ్యాలని లేదుగానీ, ముందుగా స్నానం చెయ్యాల్సి వుంది"

"ఖర్మ! నా రూంకి రాగానే ముందు నీకు స్నానం గుర్తుకు వస్తుంది"



"మరేం గుర్తుకు రావాలి. మా హాస్టల్ బాత్‌రూం ముందు క్యూ చూస్తే తెలుస్తుంది" అంది నవ్వుతూ.

దివాకర్‌లో నూతనోత్సాహం పొంగి పొరలుతోంది. అంత వరకూ వున్న వంటరితనం, దిగులు ప టా పం చ లై పోయాయి.

అరుణ రాకతో వింతకాంతి ప్రవేశించింది.

"ఓకే! ఇవాళ నువ్వేమీ వంట ప్రయత్నం చెయ్యకు. రెష్టారెంట్ కెళ్ళి కావల్సినవి తీసుకువస్తాను. హేపీగా తిని, సరదాగా గడుపుదాం ఏం" అన్నాడు దివాకర్.

"ఎందుకు అనవసరంగా మనీ వేస్టు. నేనున్నానుగా పదినిమిషాల్లో కావల్సింది వండి పెడతాను" అంది అరుణ.

"ఎందుకు లెద్దూ అనవసర శ్రమ. నన్ను వెళ్ళనీ" అంటూ బయటకు నడిచాడు దివాకర్.

* * *

పరమ నిష్టా గరిష్టుడు, నిరంతర గాయత్రీ మంత్ర జపాభిలాషి అయిన సంపూర్ణశాస్త్రిగారు ఆల్వార్‌పేట నుంచి అప్పుడే ఇంటికి వచ్చారు.

అది ఓ బ్రహ్మాండమైన ఇల్లు. బ్రహ్మాండమైన ఇల్లంటే మరీ పెద్దదనేం కాదు. అలాగని చిన్నదీ కాదు. కానీ,ఉన్నంతలో చక్కగా కట్టించి, చక్కగా అలంకరించిన ఇల్లు అది. ఖాళీ స్థలంలోని గార్డెన్ కూడా పకడ్బందీ ప్లాన్ ప్రకారం వేసింది కావటంతో ఆ ఇంటికి అదనపు అందం వచ్చింది.

ఇంతకీ అది ఆయన స్వంత ఇల్లేమీ కాదు. నగరంలో ఎనలేని కీర్తి ప్రతిష్టలు, భోగభాగ్యాలు సంపాదించి, తిరుగులేని న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన సూరి అయ్యర్‌గారి స్వగృహం అది.

నిజానికి సంపూర్ణశాస్త్రిగారికి నా అనే వాళ్ళెవరూ లేరు. భార్య, ఒకేఒక్క కూతురు కాశీయాత్రకు వెళ్ళి, ప్రమాదవశాత్తూ గంగానదిలో మునిగి చనిపోయారు

అప్పటి నుంచి శాస్త్రిగారు విరాగియై కేవలంజపతపాదులతోనూ, భగవచ్చింతనతోనూ తన వృద్ధాప్యపు చివరి దినాల్ని గడుపుకు వస్తూన్నారు.

శాస్త్రిగారంటే సూరిఅయ్యర్‌గారికి ఎనలేని గౌరవం. ఆయనచేత ఏ శుభ కార్యం ప్రారంభించినా, ఆ కార్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెంది, సర్వశుభాలూ జరుగుతాయని అయ్యర్‌గారి ప్రగాఢ విశ్వాసం.

అయ్యర్‌గారు తొలిసారిగా న్యాయస్థానంలో వకీలుగా అడుగుపెట్టే ముందు పూజచేసి, ఆ దైవాక్షతలు చల్లి, "మనో వాంఛా ఫలసిద్ధిరస్తు - సమస్త సన్మంగళాని భవంతు" అని మనసా వాచా శాస్త్రిగారు ఆశీర్వదించారు.

ఆ ఆశీః ఫలమే తనీనాడు మద్రాసు బార్ కౌన్సిల్‌కు అధ్యక్షుడు కావడం, లక్షలకు లక్షలు ఆర్జించడం. తన ఈ ఉచ్ఛస్థితికి శాస్త్రిగారి ఆశీర్వాదమే కారణమని నమ్ముతాడు సూరిఅయ్యర్.

అందుకే తన ఇంట్లోనే ఒక గది వారికి ప్రత్యేకించి సమస్త సౌకర్యాలూ కలిగించాడు అయ్యర్.

సర్వసంగపరిత్యాగి అయి, సాధు జీవనం గడుపుతున్న జ్ఞాన వృద్ధుడు,




వయోవృద్ధుడు అయిన శాస్త్రిగారికి కోరికలంటూ ఏముంటాయి గనక?

అయ్యర్‌గారి ఇంట్లో వున్న దైవ పీఠాన్ని నిత్యం సేవిస్తూ, పూజాది కార్య క్రమాలు నిర్వహిస్తూ, ధూపదీప నైవే ద్యాలతో దైవపీఠం కళకళ లాడు తున్నట్టు వుంచడం, దైవప్రసాదాన్ని ఇంట్లో వుండే అయ్యర్‌గారికి, వారి కొడుకు, కోడలు, మనుమలకు అందిస్తూ, నిత్యం వారి అభివృద్ధికై దైవాన్ని ప్రార్థించడం మినహా వేరే కార్యక్రమం అంటూ శాస్త్రిగారికి లేదు.

అయ్యర్‌గారి చిన్నారి మనుమలకు అప్పుడప్పుడు చిన్న చిన్న నీతిబోధకాలైన శ్లోకాలు నేర్పించడంలో శాస్త్రిగారు ఎనలేని ఆనందాన్ని పొందుతూంటారు.

అయ్యర్‌గారి కొడుకు కూడా సహృదయుడు. అతనేదో బ్రిటిష్ కంపెనీకి ఇండియాలో కోఆర్డినేటింగ్ సెక్రెటరీగా వుంటున్నాడు.

కోడలు వనజ తత్సాంప్రదాయాల్ని పుణికి పుచ్చుకున్న సాధ్విలా కనబడుతుంది.

ఆమెకు సంగీత సాధనంటే వల్లమాలిన పిచ్చి. రోజులో సగానికిపైగా సంగీతపు ఆలోచనలే.

జీవితాన్ని సంపూర్ణంగా వెచ్చించినా రసమయ సంగీతంలో ఆవంతకూడా నేర్చుకోలేమని, అంచేత అవకాశమున్నంత సేపూ సంగీత సాధనే తన జీవిత ధ్యేయమని ఆమె అంటుంది.

బాగా ధనిక కుటుంబం నుంచి వచ్చి, అలాంటి ధనిక కుటుంబానికే కోడలు కావడంతో ఆమెకు సాధారణపు ఈతి బాధలేవీ తెలీవు. అంచేత ఆమెకోరిక — అదే సంగీత సాధన నిరాఘాటంగా అత్తింట్లోనూ సాగిస్తున్నది.

క్రింది భాగంలో నీటి పంపు పని చెయ్యకపోవడంతో శాస్త్రిగారు మేడమీది పంపుకోసం వెళ్ళారు.

ఏదో సభకు అధ్యక్షత వహించాల్సి వుందని, రాత్రి తొమ్మిది వరకూ తాను రాలేనని అయ్యర్‌గారు ఫోన్ చేశారు.

ఆయన కొడుకు ఏనాడూ తొమ్మిది లోగా ఇల్లు చేరడు.

కోడలు వనజ మేడమీద సంగీత సాధన చేసుకుంటోంది. పిల్లల్ని తీసుకుని ఆయా అలా పార్కుకి వెళ్ళింది.

చిరు చీకట్లు ముసురుకుంటున్నాయి.

శాస్త్రిగారు మేడ ఎక్కి, వనజ గది దాటి ముందుకు వున్న బాత్‌రూంకేసి నడుస్తూ యాధాలాపంగా వనజ గదిలోకి చూశారు.

ఒక్కసారి ఆయన సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. తాను నిల్చున్న చోటు కిందకి జారిపోతున్నట్టు భావించారు.

వనజ... ఆయినింటి ఆడపడుచు... పెద్దింటి కోడలు... సదాచార సంపన్నురాలు...ఇద్దరు బిడ్డల తల్లి...ఆ సంగీతం మాష్టరు...మధ్య వయస్కుడు... జుల పాలజుత్తు... పెద్ద పెద్ద చెంపలూవాడు... వాడిని వాటేసుకుని, అర్ధనగ్నంగా మంచం మీద కామక్రీడలో మునిగివుంది.

బాగా చీకటేనా పడలేదు. తలుపు లేనా వేసుకోలేదు. ఊహకే అందనంత నీచాతినీచానికి వనజ దిగజారి పోతుందనీ అసలామె ఇంతటి నీచప్రవృత్తి గలదనీ కలలో కూడా అనుకోలేదు శాస్త్రిగారు.

క్షణికమైన శారీరక సుఖంకోసం ఉచ్చనీచాలన్నీ మరిచిపోయి ఎక్కే గుమ్మం, దిగే గుమ్మంతో పొట్టపోసుకునే

ఓ సంగీతం మాష్టరుతో వనజ ఇలా...

ఛఛ...పవిత్రతకు మారుపేరు అనుకునే స్త్రీ ఎంతగా పతనమై పోతోంది.

అంతవరకూ ఒడలు పులకరించేట్టు సంగీతం చిలకరించిన వీణ... సరస్వతికి మారురూపం, మూగగా ఆ పవిత్ర దృశ్యాన్ని అంతంత కళ్ళతో చూస్తోంది.

శాస్త్రిగారికి ఏం చెయ్యాలో తోచలేదు.

అక్కడ ఒక్క క్షణం నిలవలేక పోయారు. తన రాకనుగాని, పోకనుగాని ఏమీ గమనించనంత తమకంలో రతి క్రీడలో మునిగివున్నారు వారు.

నిత్యగాయత్రీ జప ఫలితం యావత్తూ తన నుంచి దూరం అయిపోయినట్టు, ఈ నీచ దృశ్యం చూసిన మరుక్షణంలో తాను తన సర్వశక్తులూ కోల్పోయినట్టు ఫీలయ్యారు శాస్త్రి.

వృద్ధాప్యం వల్లనైతేనేమి, ఊహకందని దృశ్యం చూడడంవల్లనైతేనేమి శాస్త్రిగారు మానసికంగా బాగా కృంగిపోయి మేడ దిగిపోయారు.

ఆయన మేధ పనిచెయ్యడం మానేసింది.




జ్యోతి ఇంటి ముందున్న ఆంగ్లో ఇండియన్ దంపతులను చూద్దామనీ, వారి ద్వారా ఏమైనా క్లూ దొరుకుతుందేమోననీ వాహనారూఢుడై దూసుకుపోయాడు దివాకర్ పెరంబూర్‌కేసి. పదినిమిషాల్లో ఇంటి ముందు వున్నాడు.

ఆ ఇల్లు ఇంకా పోలీసుల ఆధీనంలోనే వుంది. తనను చూసిన పోలీసులు గౌరవ సూచకంగా సెల్యూట్ చేసి అనుసరించారు.

లోపలకు అడుగు పెట్టగానే, గడచిన దృశ్యం కళ్ల ముందు కదలాడింది. అంత అందమైన జ్యోతి కూడా హంతకుడి ఘాతుకానికి బలైపోవడం భరించలేక పోయాడు దివాకర్.

హంతకుడు ఆమెతో కొంతసేపు గడిపి చివరకు హత్య చేశాడా? లేక కేవలం హత్య కోసం మాత్రమే వచ్చి తన కార్యం పూర్తి చేసుకువెళ్లాడా!జ్యోతి కొత్త చీర కట్టుకుని పడుకుందా? మరి ఆ కొత్త చీర హంతకుడి దృష్టిలో పడిందా? కొత్త చీర కట్టుకుని ఎవరూ పడుకోరే!

అన్నీ శేష ప్రశ్నలే. అన్నీ ఆరంభమే గాని, అంతం లేకుండా పోయింది ఈ కేసులో.

ఆంగ్లో ఇండియన్ పెద్దమనిషిని కలుసుకుని విష్ చేశాడు.

అతను బాగా వృద్ధుడు. డెబ్బై పైన వుంటుంది వయసు. పొడుగు. అంతకు తగ్గ లావు. వదులుగా జారి సాగిన బుగ్గలు. గుబురు కనుబొమలు. ఇంత పెద్ద వయసులోనూ రోజూ గెడ్డం గీసుకునే అలవాటు వల్ల ఫ్రెష్‌గా కనిపిస్తున్నాడు. కాకీ నిక్కరు, తెల్ల చొక్కా టక్ చేసుకున్నాడు. లావుపాటి చుట్ట చేతిలో ఆరిపోయి వుంది.

"లైక్ టు హేవ్ టీ" అన్నాడు.

"నో... థేంక్స్" అంటూ అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు దివాకర్.




అతని భార్య వద్దంటున్నా టీ తీసుకు వచ్చి అందిచ్చింది. వెలిసిపోతున్న పూల గౌను వేసుకుంది. తైలవిహీనమైన జుత్తు తల మీద గుబురుగా పెరిగి వుంది. ఆమె కూడా బాగా పొడుగూ, లావూను.

"జ్యోతి గురించి మీకు తెలిసింది చెప్పండి" ప్రారంభిస్తూ అన్నాడు దివాకర్.

"మాకు తెలిసిందేముంది? పాత సంప్రదాయాలన్నా, పెద్దవాళ్ళన్నా ఆమెకు చాలా గౌరవం. తీరిక వున్నప్పుడల్లా మా దగ్గరకొచ్చి, రక రకాల కబుర్లు చెప్పేది. అనారోగ్యంతో వుంటే ఎంతో సేవ చేసేది. ఏమైనా మంచి వంటకాలు చేసుకుంటే మాకు రుచి చూపించకుండా తినేది కాదు. మా దృష్టిలో చాలా మంచి పిల్ల జ్యోతి. అయితే మగ స్నేహితులు అప్పుడప్పుడు ఆమె గురించి వచ్చి వెళ్ళేవారు"

"వారిని మీరు గుర్తుపట్టగలరా?"

"అంత జ్ఞాపకశక్తి ఎక్కడిది? నా వయస్సు ఎంతనుకుంటున్నారు" నవ్వుతూ అన్నాడు.

"వచ్చే మగాళ్లు రాత్రిళ్లు కూడా వుండే వాళ్ళా?"

"అసలు వాళ్ళు వచ్చేదే రాత్రిళ్ళు. రాత్రంతా వుండేవాళ్ళనే అనుకుంటాను. ఏ అర్ధరాత్రో వెళ్ళిపోతే మాకు తెలీదు కదా"

"మరి మీరెప్పుడూ ఆమెను వారించలేదా? ఆడపిల్ల గదా. ఒంటరిగా వుండేది కదా"

"చూడండి ఇన్స్పెక్టర్‌గారూ! ఆమెను వారించడానికి మాకేం అధికారం వుంది? ఇంతకీ అది ఆమె తప్పు కాదు. హృదయాన్ని కలవర పెట్టే వయసు, నిలవ నీయని మనసు. తను మాత్రం ఏం చేస్తుంది? వయసులో వుండే పిల్లని పట్నంలో ఉద్యోగంలో వదిలేసి, ఇంత వయసు వచ్చినా కులుకుతూ తిరిగే ఆమె తల్లిదండ్రుల్ని అనాలిగాని! ఆమెకు పెళ్ళి చేసేస్తే ఆదాయం ఆగిపోతుందని భావించే తల్లిదండ్రుల్ని శిక్షించాలి, ఈమె చేసే తప్పుడు పనులకి కట్టుబాట్లు, సాంప్రదాయం ఇవన్నీ పాతకాలపు అలవాట్లని నాగరికులు గేలి చేయవచ్చు గాని, వాటి విలువ జీవిత పతనావస్థలో గాని మనిషికి తెలీదు. జ్యోతిని మేం ఏమీ నిందించం" అభిమానం ఉప్పొంగగా అతని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

అరచేతులతో కళ్ల తుడుచుకున్నాడు.

ఆమెకు మగ స్నేహితులుండేవారని, కాస్త ఖుషీగా తిరిగే రకమనీ తనకూ తెలుసు. ఇప్పుడు ఈ వృద్ధ దంపతులవల్ల కొత్తగా తెలుసుకున్నదేమీ లేదు. ఇంకా ఎక్కువగా వీళ్ళని కదపడం అనవసరమనుకుంటూ, వారి వద్ద వీడ్కోలు తీసుకున్నాడు.

* * *

మొన్న తాను చూసిన దృశ్యంతో సంపూర్ణ శాస్త్రిగారు మానసిక శాంతి కోల్పోయారు.

తను చూసిన విషయం అయ్యగారికి గాని, అబ్బాయికి గాని చెప్పాలా? వద్దా? లేక ఆమెనే నేరుగా అడిగేసి, కడిగేసి రావడం మంచిదా? ఎవరో తన తప్పుడు పనులు చూశారని తెలిస్తే కాస్త భయమేనా వుంటుంది. ఏం చెయ్యాలి? ఎటూ తేలని ఆలోచనలతో సతమతమై, వూరి బయట శివాలయంలో శూన్యంలోకి చూస్తూ కూర్చున్నారు శాస్త్రిగారు.

వనజకు బుద్ధులు చెప్పాలనీ, ఆమెను

సన్మార్గానువర్తిని చేయాలనీ, అది తన గురుతర బాధ్యతనీ భావించి గోష్పాద మంత పిలకను ఓసారి విదిల్చి, చిన్నగా ముడి వేసి, వడివడిగా ముందుకు నడిచారు శాస్త్రిగారు.

కొద్దిసేపటికి అయ్యరుగారి ఇల్లు చేరారు శాస్త్రిగారు. గొంతు పొడారిపోవ డంతో కాస్త మంచి తీర్థం తీసుకుందా మనే తలపుతో వంట ఇంట్లోకి నడిచారు ఆయన.

వంటపుట్టి జ్ఞానమణి పాలతో హల్వా చేసి రడీగా వుంచి, బోండాలు చెయ్య డంలో నిమగ్నమై వున్నాడు.

పాల హల్వా ఘుమ ఘుమ వాసన వేస్తోంది.

"కాస్త రుచి చూస్తారేమిటి శాస్త్రి గారూ" అడిగాడు జ్ఞానమణి.

"వద్దు" అని తలతోనే జవాబిచ్చి–

"కాస్త మంచి తీర్థం అందుకో మణీ" అన్నారు శాస్త్రిగారు.

మణి అందించిన మంచినీళ్ళు గటగటా తాగేసి–

"మణీ! అమ్మాయి ఇంట్లో వున్నదా" అని అడిగారు

"మేడ మీద వుంటారు బాబూ" అన్నాడు.

మేడ మీదకు భారంగా అడుగులు వేసు కుంటూ చేరారు శాస్త్రిగారు.

ఆమె గది తలుపులు వేసి వున్నాయి లోపలి నుంచి. పక్క కిటికీ తలుపు ఓరగా తెరిచి వుంది.

శాస్త్రిగారు ఆ కిటికీ తలుపుగుండా లోపలికి చూశారు. అక్కడి దృశ్యం చూడగానే వారి హృదయం ఒక్కసారి భగ్గుమంది.

వనజ మంచం మీద పడుకుని వుంది. ఆమె మీదకు వంగుతూ ఎవరో యువ కుడు. వెనక భాగం కనిపిస్తోంది.

సన్నగా, పలచగా, కాస్త పొడుగ్గా.

శాస్త్రిగారు అవాక్కైపోయారు.

జరుగుతున్న అత్యాచారాలు ఆయన భరించలేకపోతున్నారు. ఏం చెయ్యాలో తోచని అయోమయస్థితి.

చేస్తున్న తప్పిదాన్ని తెలియజెప్పి, ఆమెను ఋజు మార్గంలో వుంచుదామని బయలుదేరి, తీరా ఆమె మరొకరితో తన శయనాగారంలో కులుకుతూండడం చూసిన్నీ ఏమీ అనలేని, చెయ్యలేని అచేతనులైపోయారు శాస్త్రిగారు.

'ఈ పరిస్థితిని ఎదుర్కొని, ఆమెను సరైన మార్గంలో పెట్టడానికి నాకు చాలినంత మానసిక ధృతి ఇయ్యి భగవం తుడా' అనుకుంటూ, వణికే కాళ్లతో శాస్త్రిగారు కిందవున్న పూజామందిరం లోకి వెళ్ళి, దైవ పీఠం ముందు పద్మా సనం వేసుకుని, నిశ్చల ధ్యానముద్ర కోసం వృథా ప్రయాస పడ్డారు. స్థిరచిత్తం కోసం శతధా ప్రయత్నించారు.

కొద్ది క్షణాలు గడిచాయి.

శాస్త్రిగారి వెనుక నుండి ఎవరో వచ్చి బలంగా ఆయనను మోకాలితో ముందుకు నెట్టారు.

మానసిక వికలత్వమూ, శారీరక దుర్బలత్వమూ – ఈ రెండింటితో నీర సించిపోయిన శాస్త్రిగారు ఆ బలానికి ముందుకు, దైవపీఠం మీదకు తుళ్లిపడి పోయారు.

ఉద్ధరిణ, శఠగోపం, వెండి ప్రమిదలు ఇవన్నీ శాస్త్రిగారిముఖాన్ని గాయపరిచాయి. అప్రతిభులై వారు వెనక్కి తిరిగి ఆ ఆగం తకున్ని పరిశీలిద్దామని ప్రయత్నించేలోగా అతని బలమైన చేతులు శాస్త్రిగారి మెడ




చుట్టూ ఒక బ్రాను బిగించాయి. బ్రా రాను రాను మరీ బిగుసుకుపోయింది. శాస్త్రిగారి వృద్ధనయనాలు భయంతో వణికి పోతూ హంతకుణ్ని చూశాయి. అవి హంతకుణ్ని గుర్తించాయి.

కానీ, సాక్ష్యం ఇచ్చేందుకు వీలు లేకుండా అవి అరక్షణంలో నిర్జీవాలై అలాగే మూసుకు పోయాయి.

దైవప్రార్థనే ఊపిరిగా బతికిన శాస్త్రి గారి జీవిత చరమ ఘట్టం దైవం పాదాల ముందే అంతమైపోయింది.

* * *

ట్రేలో వేడి వేడి పాల హల్వా, బోండాలు, చట్నీ – వీటిని తీసుకుని జ్ఞానమణి మేడ ఎక్కి వనజ గదిలోకి ప్రవేశించాడు.

అతని చేతిలో ట్రే అలాగే నేలమీద పడి, ప్లేట్లన్నీ ఛిన్నాభిన్నమైపోయాయి. వనజ మంచం మీద వికృతంగా పడి వుంది. ఆమె కళ్లు భయంకరంగా వుబ్బి వున్నాయి. మెడచుట్టూ ఆమె వేసుకునే బ్రా బిగించబడివుంది. బ్లౌజు, పయ్యెదలేని ఆమె వక్షస్థలం నగ్నంగా కనిపిస్తోంది. ఆమె ముక్కు భయంకరంగా కోసివేయ బడింది. జుత్తు కొంతభాగం కత్తిరించ బడివుంది.

ఆ దృశ్యాన్ని చూసిన మణి కెవ్వున కేకవేస్తూ "బాబూ శాస్త్రిగారూ" అంటూ పరిగెత్తుకు మేడదిగి పూజామందిరంలోకి అడుగు పెట్టాడు.

అక్కడి శాస్త్రిగారి మరణ దృశ్యం చూడగానే మణి కళ్లు చీకట్లు కమ్మేయి.

నిలువునా అతను పూజా మందిరంలో స్పృహ తప్పి పడిపోయాడు. అమావాస్య రాత్రి మరోసారి వికటాట్టహాసం చేసింది.

* * *

ఇంతవరకూ కేవలం స్త్రీలను, అందునా వక్రమార్గాను వర్తులను మాత్రమే ఈ హంతకుడు హత్య చేస్తా డనుకుంటున్న తరుణంలో సంపూర్ణ శాస్త్రి హత్య కథను కొత్త మలుపు తిప్పింది.

బ్రా బిగించి అతన్ని హత్య చేసిన తీరును తలోరూ తలో రకంగా అనుకుం టున్నారు.

నగర పోలీసు కార్యాలయంలో పెద్ద సంచలనం వచ్చింది. పోలీసు కమిషనర్ జాన్ సెల్వం అహం దెబ్బతింది.

నలుగురూ విమర్శించే తీరు, పత్రి కలు విసురుతున్న విసుర్లు అతన్ని అవ మానానికి గురి చేస్తున్నాయి.

ఉన్నతాధికారులందర్నీ సమావేశ పరచి, కాగల కార్యం గురించి పథకాలు తయారు చేశారు.

డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ దివాకర్ వేపు చులకనగా చూస్తూ–

"మీరు పేపర్లో వస్తున్న వార్తల్ని చదువుతున్నారనుకుంటాను. హంతకుడు చేస్తున్న స్వైరవిహారం, తత్పర్యవసా నాలు గ్రహిస్తున్నారనుకుంటాను. ఇంత వరకూ స్త్రీలనే హత్యచేస్తూ వచ్చిన హంతకుడు వృద్ధుడైన సంపూర్ణశాస్త్రిని హత్య చెయ్యడం గమనిస్తే, మన ఆలో చనలు తప్పుమార్గాన పట్టించడానికి గాని ఇలా చేసాడా అనిపిస్తోంది. హత్యలు చెయ్యడం, వారికి సంబంధించిన వస్తువుల్ని కమీషనర్ కార్యాలయానికి వెక్కిరిస్తున్నట్టుగా బంగీలు కట్టి పంపి స్తూండడం చూస్తూంటే హంతకుడు మనతోనూ, మన డిపార్ట్మెంటుతోనూ ఆటలాడుతున్నట్టు కనిపిస్తోంది. ఇవాళ వచ్చిన ఈ పార్శెల్స్ చూడండి" అంటూ

రెండు పార్శెల్స్ దివాకర్‌కు అందజేశాడు జాన్.

అందుకుని విప్పి చూశాడు దివాకర్.

ఒకదాన్లో వనజ ముక్కు, రెండో దాన్లో శాస్త్రిగారి జుట్టు వున్నాయి.

వాటిని పరిశీలనగా చూసి, టేబిల్ మీద పెట్టాడు దివాకర్. అతని తలలో వెయ్యి ఆలోచనలు చోటు చేసుకున్నాయి.

ఇదమిద్ధమని ఎటూ తేలడం లేదు.

నరక సాగిస్తున్నవాడు గమ్యం చేరకపోడు. హత్యలు చేస్తూ, హంతకుడు న్యాయం స్థానం వేపే వస్తున్నాడని



అనుకున్నాడు దివాకర్.




వనజ, సంపూర్ణ శాస్త్రుల హత్యానంతరం తొలిసారి చూసినవాడు అయ్యరుగారింటి వంటపుట్టి జ్ఞానమణి.

అతణ్ని కలుసుకుని కొన్ని ప్రశ్నలు వేయడం ద్వారా కొంత ఆధారం దొరకవచ్చు అనుకుని బయలుదేరాడు దివాకర్.

గొప్పింటివాళ్ళ అనేక రహస్యాలు ఆ ఇళ్ళల్లో పనిచేసే ఆయాలకు, పనివాళ్ళకు, వంటచేసే వాళ్ళకు తెలుస్తాయి.

అయ్యగారి కీప్ సంగతి వారి కారు డ్రైవర్‌కు తెలిసినట్టు, అమ్మగారి ప్రియుడి సంగతి ఆమె పనిమనిషికి తెలిసి తీరుతుంది.

వాళ్ళు వాళ్ళ రహస్యాల్ని గుండెల్లో పెట్టుకుని కాపాడతారు. మరి వారికి దొరికే బక్షీషులు అలాంటివి.

అయితే జ్ఞానమణికి అన్నీ అంత వివరంగా తెలుస్తాయా అంటే—ఏమో ప్రయత్నలోపం ఎందుకుండాలి?

ఎవరో అనుభవజ్ఞుడు అన్నట్టు 'ప్రయత్నబల లోపమే ఫలబల లోపము' కాబట్టి ప్రయత్నం ఎందుకు మానాలి?

మెడికల్ రిపోర్టు ప్రకారం వనజ ముందు హత్య చెయ్యబడింది. ఆ తర్వాత శాస్త్రి హత్య కావడంలో అర్థం కనబడ్డం లేదు. ఒకవేళ వనజను హత్యచేస్తూండగా శాస్త్రి హంతకుడిని చూశాడా? గుర్తించాడా? ఆ భయంతో అడ్డం తొలగించేందుకు శాస్త్రిని తప్పని పరిస్థితుల్లో హంతకుడు చంపి వుండవచ్చు.

ఈ ఆలోచన కాస్త సమంజసంగానే తోచింది దివాకర్‌కు. బహుశ అదే నిజం కావచ్చు.

ఆలోచనలమధ్య అయ్యరుగారి ఇల్లు వచ్చేసింది.

ఇల్లంతా శోకమయంగా వుంది.

శ్మశాన నిశ్శబ్దం అక్కడ చోటు చేసుకుంది.

ఓ సోఫాలో అయ్యరుగారు, వారి అబ్బాయి కూర్చుని వున్నారు. అశ్రుపూరితాలైన వారి నయనాలు ఉబ్బి ఉన్నాయి.

పిల్లలు ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోతున్నారు.

వంటపుట్టి జ్ఞానమణి ట్రేలో కాఫీ తీసుకువచ్చి వారికి అందిస్తూ తీసుకోమని బలవంతం చేస్తున్నాడు.

వారు వద్దంటూంటే కొద్దిగా గొంతు తడుపుకోమని బతిమాలుతున్నాడు.

"ఈ విపత్కర పరిస్థితిలో మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యను. మీ వంటపుట్టి మణితో ఏకాంతంగా కొద్దిసేపు మాట్లాడి వెళ్ళిపోతాను..." అంటూ మణిని కిచెన్‌కు రమ్మని చెప్పాడు.

అయ్యరుగారు ఓసారి నిస్తేజంగా దివాకర్ వంక చూశారు. ఏమీ అనలేదు.

మణి వెనుకనే దివాకర్ కూడా నడిచి కిచెన్ చేరాడు.,

"చూడు మణి ! నన్ను చూసి ఏమీ కంగారు పడాల్సిన పనేంలేదు. నేనడిగే ప్రశ్నలకు కాస్త ఆలోచించి సరైన సమా

ధానం చెప్పు" అన్నాడు మణి భుజం తడుతూ అతనికి కాస్త ధైర్యం కలిగిస్తూ.

"అడగండి సార్! మా అయ్యరుగారు కూడా ఎవరడిగినా చూసింది చూసినట్టు చెప్పమన్నారు"

"ఇక్కడ ఎన్నాళ్ళనుంచీ పని చేస్తున్నావ్?"

"పదేళ్లపైన వుంటుంది. నా జీవితం అయ్యరుగారి చలవవల్ల చల్లగా సాగిపోతోంది"

"అయ్యరుగారు చాలా మంచివారు కదూ ?"

"దేవుడండీ ఆయన. అంత మంచి మనిషి కాబట్టే జీవితంలో ఎంతో అభివృద్ధి సాధించారు".

"శాస్త్రిగారు నీకు బాగా తెలుసా?"

"ఆయన మా అయ్యరుగారికి దైవ సమానుడు. శాస్త్రిగారి దీవెనతో మా సూర్యోదయం, ఆశీస్సులతో సూర్యాస్తమయం అవుతాయి. తన ఈ ఉన్నతికి శాస్త్రిగారి ఆశీఃఫలమే కారణమని భావిస్తారు మా అయ్యరుగారు".

"శాస్త్రిగారికి ఎవరేనా శత్రువులున్నారంటావా?"

"ధర్మరాజంటి ఆయనకి శత్రువు లేమిటండీ" అన్నాడు మణి.

"మీ అయ్యరుగారింటికి తరుచూ ఎవరెవరు వస్తూంటారు? కంగారు పడకుండా కాస్త ఆలోచించి చెప్పు"

"చాలా మంది వస్తూంటారండి"

"చాలామంది అంటే"

"అంటే ఆయన పార్టీలు, జూనియర్లు, ఇంకా అప్రెంటీసులు, ఇంకా చిన్న పిల్లల ప్రైవేటు మాష్టరు, సంగీతం మాష్టరు ఇలా చాలామంది వస్తూంటారండి"

"అలా అంతా గుత్తలంలా చెప్తే ఎలాగయ్యా! కాస్త వివరంగా చెప్పుమరి"

"అలాగేనండీ. జూనియర్లు, అప్రెంటీసులు కలిసి ఆరుగురుంటారండి. అందులో ముగ్గురు మగ, ముగ్గురు ఆడ"

"వాళ్ళ పేర్లు?"

"పేర్లాండి, మరి కాస్త గుర్తు చేసుకోనివ్వండి".

దివాకర్ జేబులో నోట్ బుక్ తీసుకుని, బాల్ పెన్ క్లిక్ మనిపించాడు.

"పద్మనాభ అయ్యరొకాయనండి, ఈయన కాస్త పెద్దవాడిలా కనబడతాడండి, కుమారస్వామి భక్తుడండి. వర్ధిరాజని ఒకాయనండి – చాలా జిడ్డుగా వుంటాడు. మరి ఎలా వాకీలు పాసయాడో గానండి. రంగస్వామి అని ఒకతనండి–చాలా చురుగ్గా, తెలివిగా కనబడతాడు. ఈమధ్యే ఆయనకు పెళ్ళి కూడా అయిందండి"

"ఊ... తర్వాత"

"మిగిలిన వాళ్ళు ఆడవాళ్ళండి. కల్పన అని ఒకామె, మాలిని అని మరొకామె, చిత్ర అని ఒకామె – ఈ ముగ్గురూ బాగా డబ్బున్న వాళ్ళవడంచేత చాలా నిర్లక్ష్యంగా వుంటారండి వాకీలు వృత్తిలో. బాగా సింగారించుకోవడం, ఎప్పుడూ ఏవో సినిమాల విషయం మాట్లాడుకోవడం ఇదేనండి వాళ్ళకి పని."

"అహా... ఆ తర్వాత..."

"అన్నట్టు మరచిపోయాను... ఈ మధ్య మరో ఇద్దరు కూడా వస్తున్నారండి అయ్యరుగారి దగ్గరకి"

"ఎవరు వాళ్ళు?"

"వేణుగోపాల్ అని ఒకాయనండి. చక్కగా విధేయతగా నేర్చుకుందామనే దృష్టితో వుంటాడండి. అయ్యరుగారికి

అతనంటే చాలా ఇష్టం."

"అహా... మరి ఇంకో ఆయన?"

"ఆయన పేరు మాధవమీనన్ అండి. చాలా అందంగా సినిమా ఏక్టరులా వుంటాడు. సినిమాల్లో ప్లీడర్లు ఎలా వాదిస్తూంటారో, ఇక్కడ కూడా అలాగే పెద్ద హీరోలాగ మాట్లాడతాడండి. అతని కండి – ఈ ప్లీడరీ పనికన్నా, సిన్మా హీరో అయిపోవాలనే ఆశ ఎక్కువటండి. అదే అంటూంటాడు. అతను కేరళ నుంచి వచ్చాడండి".

"అలాగా! ఇంకా మిగిలినవాళ్లు?"

"ఇంకెవరండీ...ఆ...పిల్లలకిపాఠాలు చెప్పే జానకిరామన్ అనే కుర్రాడండి. చాలా లేతగా కనిపిస్తాడండి. అమాయకంగా, ముభావంగా వుంటూ, తనేదో తన పనేదో – అంతేనండి అతను."

"ఆ తర్వాత?"

"........."

"మరి మీ సంగీతం మాష్టరు"

"ఆయనాండి. సుందరం మాష్టారని అంటారండి... వనజమ్మగారికి పాఠాలు చెప్పడానికి వస్తారండి. చాలా హుషారైన మనిషండి. పెద్ద జులపాలజుత్తూ, వెడల్పాటి చెంపలూ వుంటాయండి ఆయనకి"

"అదిసరేగాని మణీ! ఇప్పుడు నువ్వు చెప్పావు చూడు, వీళ్ళలో ఎవరేనా వనజ అంటే అసహ్యించుకునే వాళ్లున్నారా?"

"అదేమిటండీ అలా అడుగుతారు. ఆమె చాలా మంచి మనిషి. ఆమెను అసహ్యించుకునే వాళ్లు వుంటారా?"

"ఎందుకు వుండకూడదు? ఆమె వ్యక్తిగతమైన జీవితం గురించి నీకేమైనా తెలుసా?"

"తెలీదండి"





ఈ 'తెలీదు' అనే మాట వెనక 'తెలిసినా చెప్పను' అనే ధ్వని వున్నదని దివాకర్ గ్రహించాడు.

"చూడు మణీ! తెలీదు అని నువ్వు అన్నంత మాత్రాన నేను నమ్ముతానని అనుకోకు. నీకు తెలిసింది దాచకుండా చెప్పమని మీ అయ్యరుగారు చెప్పారని నువ్వే చెప్పావు. మరి అలాంటప్పుడు నిజం చెప్పడానికి నీకేం అభ్యంతరం?"

"అదికాదండి..."

"అదికాదు, ఇదికాదు – నువ్వు చెప్పే విషయాల వల్ల మాకు ఒక్క 'క్లూ' దొరికినా హంతకుడు దొరికిపోతాడు. నీకు మంచి బహుమతి కూడా ఇప్పిస్తాను. చెప్పు...వనజ ఎవరెవరితో సరదాగా వుండేది."

"అమ్మో! అవి పెద్దింటి విషయాలండి."

"చూడు మణీ! విషయాలు రచ్చకెక్కాక, ఇక పెద్ద చిన్న భేదం వుండదు. నీకేం భయంలేదని చెప్తున్నాను కదా.. ఆ సంగీతం మాష్టరు..." అర్థాంతరంగా ఆగేడు దివాకర్.

"సుందరం బాబు వనజమ్మగారితో బాగా చనువుగా వుండేవారండి. అరు అరి గురువుగారు కదండి మరి.."

"గురుశిష్య సంబంధమేనా, మరింకేదైనా..."

"అలా అడిగితే నేనేం చెప్పనండి. మరి వాళ్ళిద్దరూ బాగా సోషల్‌గా, ఇదిగా..." ఆగిపోయాడు మణి.

"మిగతా జూనియర్లు, అప్రెంటీసులు వీళ్ళెవరైనా..."

"అబ్బే! అలాంటిదేం లేదండి."

"అంటే... ఒక్క సుందరంతో మాత్రమే..."

"అవునండి! ఒక్కసుందరం మాష్టరి

గారితో మాత్రమేనండి..." అంటూ 'అరెరే' అని నాలిక్కొరుక్కున్నాడు మణి.

"అదేమలా నాలిక్కొరుక్కుంటున్నావ్?"

చెప్పకూడని రహస్యమేదో విడమర్చి చెప్పేసినట్టు ముఖం భయంగా పెట్టాడు మణి.

"అది సరేగాని వనజ, ఆమె భర్త ఎలా వుంటారు?"

"బాగానే వుంటారండి"

"ఎప్పుడూ కీచులాడుకోవడం అలాంటివేం లేవా?"

"నా ఎరికన ఏం లేవండి."

"సరే–ఇక నువ్వు నీ పని చేసుకో వచ్చు" అంటూ లేచాడు దివాకర్.

* * *

జరిగిన ఉదంతాలు, సేకరించిన వివరాలు అన్నీ తేదీలవారిగా తన ఫైల్లో రాసుకుని, సుదీర్ఘంగా నిట్టూర్చాడు దివాకర్.

పోలీస్ కమిషనర్ జాన్ సెల్వంతో ఒక గంటకు పైగా ఈ విషయంపై చర్చించి, ఇంకా తాను కలుసుకోవలసిన వ్యక్తుల జాబితా ఒకటి తయారుచేసి, అది జాన్‌కు చూపించాడు.

అందులో మొదటి పేరు సంగీతం మాష్టరు సుందరం పేరు వుంది.

"ఏమిటీ చర్చలలోనూ, లిస్టులు తయారు చేసుకోవడంలోనూ ఇంకా వుంది మనపని, ఈ హంతకుడు దొరికేలోగా మరిన్ని హత్యలు జరిగిపోయేట్టుగా వుంది" అన్నాడు జాన్.

"నో సర్...మనం సరైన మార్గంలోనే అన్వేషణ ప్రారంభించాం.హంతకుడు పట్టుబడడానికి ఇంకా ఎంతో కాలం పట్టదు...మరి నాకు శలవిప్పించండి" అంటూ మైలాపూర్ వేపు మోటర్ బైక్ మీద దూసుకుపోయాడు.

అప్పకన్ను వీధిలో, 58వ ఇంటి నెంబరు ముందు వాహనాన్ని ఆపి,మీదకు చూశాడు.

మేడమీది భాగంలో 58వ నెంబరు వుంది.

సన్నగా వున్న మెట్లమీద వడివడిగా అడుగులు వేస్తూ, గుమ్మం ముందు నిల్చుని తలుపు తట్టాడు.

మంచి నిద్రలో వున్నాడో ఏమో, సుందరం కొద్ది సేపటికిగాని తలుపు తియ్యలేదు.

అతని కళ్ళు నిద్రమత్తులో జోగుతున్నాయి.

"రండి. మీరు ఇవాళో రేపో వస్తారని నాకు తెలుసు. అది మీ డ్యూటీ. మా మావయ్య కూడా మన్నారుగుడిలో పోలీసు ఇన్స్‌పెక్టర్‌గా వుండేవాడు. ఇప్పుడు పోయాడు లెండి. అలా కూర్చోండి" అన్నాడు సుందరం.

గది చక్కగా సర్దబడి వుంది. ఓ రేడియోగ్రాం, రికార్డుప్లేయరు, వీణ, హార్మోనియం, నిలువెత్తు సరస్వతీదేవి తైలవర్ణ చిత్రం–అతను మంచి పొజిషన్‌లో వున్నాడని తెలియజేస్తున్నాయి.

"చూడండి సుందరంగారూ! మీకు సంగీతమేనా జీవనాధారం?"

"ఔనండి! సరస్వతీదేవి నా ఆరాధ్య దేవత. ఆమెను నమ్ముకునే బతుకుతున్నాను. నాకు ఏ ఇబ్బందీ లేకుండా గడిచిపోతోంది."

"మీ భార్య, పిల్లలు..."

"పిల్లలు లేరండి...భార్య పుట్టింట్లో వుంది"

"ప్రసవానికి వెళ్ళిందా?"

"కాదండి...నాతో సరిపడక వెళ్ళిపోతా నని చెప్పి మరీ వెళ్ళిపోయింది."

"అదేమలా"

"కళాకారుల బతుకులన్నీ ఇలాగే వుంటాయండి, ఒకరితో ఒకరు సరిపుచ్చు కుని బతికేస్తే ఫరవాలేదుగానీండి, లేకపోతే-ఇదిగో ఇలాగే ఎడముఖం పెడ ముఖం, విడిపోవడం, విడాకులు"

"అది సరేగానీ వనజ గురించి కొన్ని వివరాలు కావాలి..."

వనజ పేరు వినగానే అతని ముఖం దుఃఖాచ్ఛాదితం ఆయిపోయింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగిపోయాయి. అరచేతు లతో కళ్ళు తుడుచుకుంటూ -

"ఎంత ఘోరం జరిగిపోయింది" అన్నాడు.

"జరిగినదానికి ఎటూ ఎవరం ఏమీ చెయ్యలేం. పోయిన ప్రాణం తిరిగి ఎలాగూ తేలేం. కనీసం హంతకుడినైనా పట్టుకో గలిగితే గొప్ప మేలు జరుగుతుంది. మీరు నిజాయితీగా చెప్పే జవాబులు మాకు కొంతవరకూ తోడ్పడగలవు"

"తప్పకుండా చెప్తాను. మీరడిగే ముందు ఓ నిజం నాకు నేనుగా చెప్పేస్తు న్నాను. వనజ నాకు శిష్యురాలు మాత్రమే కాదు. నాకు ప్రేయసి కూడా. మేం ఇద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం" అన్నాడు సుందరం.

అలా అంటున్నప్పుడు అతని గొంతులో ఓ ప్రియుడి బాధ స్పష్టంగా వినిపించింది.

"ఈ విషయం వేరెవరికేనా తెలు సునా ?"

"ఏమో చెప్పలేను.... అయితే వదం తులు, గాలికబుర్లు మా విషయంలో వున్నాయని విన్నాను"

"అదికాదు. ఒక ముఖ్య విషయం కోసం అడుగుతున్నాను ఈ ప్రశ్న. హంతకుడు ఇంతవరకూ చేసిన హత్య లన్నీ ఒకే మాదిరిగా వున్నాయి. వనజ హత్య అందుకు భిన్నంగా లేదు. అంచేత మీ ప్రణయం విషయం నిక్కచ్చిగా అందరికీ తెలుసా అని అడుగుతున్నాను"

"వనజ భరకు చూచాయగా తెలుసు నేమో? ఇది కేవలం అనుమానం మాత్రమేస్మండీ"

"అయ్యరుగారి జూనియర్లు, ఇతర బలగం..."

"చెప్పలేను.అయితే మాధవమీనన్..."

"ఎవరతను?"

"ఈ మధ్యనే అయ్యరుగారి దగ్గర కొత్తగా చేరాడు. సినిమా విలనీ వేషాలూ వాడూను. వనజ చెప్పింది వాడు తనని టేకిల్ చెయ్యడానికిప్రయత్నిస్తున్నాడని"

"అంత మాత్రం చేత మీ ప్రేమ వ్యవ హారం అతనికి తెలుసునని ఎలా అను కుంటున్నారు?

"ఒకరి భార్య అయివుండి నన్ను ప్రేమించింది కాబట్టి, తనను కూడా ఎందుకు ప్రేమించకూడదు అని అతను అనుకొని ట్రైచేసి వుంటాడనిఅనుమానం"

"అది సరే! ఇక ఆ పిల్లలకు పాఠాలు చెప్పే ట్యూటర్?"

"ఎవరూ.. జానకిరామన్ గురించా"

"అవును"

"అబ్బే.. అతను చాలా చిన్నవాడు. కాలేజీ మెట్లు ఇంకా మొన్నే దిగాడు. మంచి కుర్రాడు. తండ్రి లేడు. అతన్ని నేనే పిల్లల పాఠాల కోసం ట్యూషన్‌కు పెట్టాను. కష్టపడి పని చేసే చిన్న కుర్రాడు".

 

"ఆ.. చూడండి సుందరంగారూ! పంటపుట్టి జ్ఞానమణికి మీ ప్రేమ వ్యవహారం తెలుసా?"

"తెలిసే వుండాలి. మేం ఇద్దరం చనువుగా వుండేటప్పుడు కూడా అతను చాలా సార్లు కాఫీలు అవీ తెచ్చిచ్చేవాడు"

"మరి శాస్త్రిగారికి?"

"చెప్పలేను. తెలిసివుండదు"

"మీరిద్దరూ తరుచూ ఎక్కడ కలుసుకునేవారు?"

"వనజ గదిలోనే. అక్కడే ఆమెకు సంగీతం నేర్పేవాడిని"

"ఇంకెక్కడేనా కలుసుకునేవారా?"

"మద్రాసులో కలుసుకుంటే ఇంట్లోనే కలుసుకునేవాళ్ళం"

"మరి వేరే చోట్ల అంటే వేరే ఊళ్లల్లో గాని కలుసుకునేవాళ్లా?

"అప్పుడప్పుడు తిరువయ్యూర్ వెళ్ళి వచ్చేవాళ్లం. అక్కడ త్యాగరాజ సంగీతారాధనోత్సవాలకు ఇద్దరం తప్పకుండా వెళ్ళేవాళ్ళం"

"ఎక్కడ దిగేవారు?"

"ఆమె మేనత్త ఒకామె అక్కడుంది. ఆమె ఇంట్లో"

"మరి మీ ఇద్దరూ ఇలా పై వూరు వెళ్ళడానికి వనజ భర్త అంగీకరించేవాడా?"

"అంగీకారమేమిటి? అతనే వెళ్ళమని ఏర్పాట్లు చేసేవాడు"

"ఇక్కడ ప్రతిరోజూ మీరు కలుసుకునేవారా?"

"లేదు. వారానికి మూడు రోజులు మాత్రమే పాఠాలు చెప్పేవాణ్ని. అది వారం తప్ప మిగతా రోజుల్లో ముఖాముఖి కలుసుకోవడంగాని, ఫోన్లో మాట్లాడ్డంగాని చేసేవాణ్ని"

"ఫోను ఎక్కడ వుంది అయ్యరు గారింట్లో?"

"మధ్యహాల్లో కాక వనజ గదిలో ప్రత్యేకంగా ఓ ఫోనువుంది. అది ఆమె భర్త ఆఫీసు ఫోను"

"అలాగా" అంటూ బయలుదేరాడు దివాకర్.

అతను మోటరుసైకిల్ ఎక్కి, స్టార్ట్ చేసి, వీధి మలుపు తిరిగేవరకూ సుందరం బాల్కనీలోంచి చూస్తూనే నిల్చున్నాడు.




"అందరూ అంటున్నారని కాదుగానీ, నిజంగానే మాధవమీనన్ మంచి అందగాడు" అనుకున్నాడు అతన్ని చూడగానే దివాకర్.

"కూర్చోండి! కాఫీ తీసుకుంటారా?" అడిగాడు మీనన్.

"నో.. మీతో కొద్దిగా మాట్లాడాలని వచ్చాను"

"వనజ హత్యగురించా?" అని అతను అంటున్నప్పుడు అందమైన అతని కింది పెదవి అతి క్రూరంగా వంగింది.

"మీరెలా అనుకుంటున్నారు?"

"అనుకోవడానికి ఇందులో ఏముంది గనక? ఇప్పుడు మద్రాసు మహాపట్టణంలో హాట్ టాపిక్ ఇంకోటి ఏముది? హంతకుడి తెలివితేటలు, ప్రభుత్వం, పోలీసుల అస

మర్థత-ఇంతేకదా ఎక్కడ చూసినా సంభాషణ. అందులోనూ వసజ మా సీనియర్ లాయరు గారి కోడలు. మాకు తెలిసిన వ్యక్తి. అందుకే అలా అన్నాను" అన్నాడు నవ్వుతూ.

ఎందుకో ఇంత అందమైన మీనస్ వెనక ఏదో క్రూరత్వం గోచరించింది దివాకర్‌కు.

కళాకారుని ఇల్లనిపించుకుంది అతని

ఇల్లు. చాలా కళాత్మకంగా, అందంగా అలంకరించబడివుంది ఆ గది.

ఖరీదైన సోఫాసెట్లు, అంత లావు కార్పెట్లు, గోడమీద అందమైన అమ్మాయి ఉదయించే సూర్యుణ్ని ఆశ్చర్యంగా చూస్తున్న దృశ్యం – మంచి అభిరుచిగల వాడే అనుకున్నాడు మనసులో.

"మీకు వనజ బాగా తెల్సా?"

"ఆ...బాగా తెల్సు"

"బాగా అంటే ?"

"ఒక ఆడది మగాడికి బాగా తెల్సంటే ఏమి అర్థం వస్తుందో అంత బాగా"

"కాస్త వివరిద్దురూ చంపక"

"అందంగానూ, సెక్సీగానూ వుండే ఆడది వనజ"

"సెక్సీగా అంటున్నారు..."

"ఔను. సెక్సీగానే. ఆమెకు మగాళ్ళంటే,అందులోనూ కాస్తకళాహృదయం వున్న మగాళ్ళంటే మరీ ఇష్టం"

"మీరంటే ఇష్టమేనా?" సూటిగా అడిగాడు.

"వై నాట్...మేం ఇద్దరం కలిసి నగరంలో ఎన్నో సినిమాలు చూశాం. ముఖ్యంగా సెక్సీ మలయాళ చిత్రాలు. అలాంటి చిత్రాలు చూస్తుంటే వనజ ఆనందం చూడాలి..."

"ఏమిటి మీరంటున్నది ? ఆమె అలాంటిదా?"

"ఏం... ఆమె అలాంటిది కాదనా మీ అనుమానం?"

"అనుమానం కాదు. ఓ నమ్మకం"

"అదిగో ఆ వెర్రి నమ్మకాలే ఆడ వాళ్ళ ఇష్టారాజ్యపు ఆటలకు ఆలవాలాలు. వనజ మగ పిచ్చి వున్న స్త్రీ"

"మరి ఆ సంగతి ఆమె భర్తకు తెల్సా?"

"ఎవరు...ఆ మనోరంజన్‌కా? వాడో చేతకాని చవట"

"అంత మాటంటున్నారేమిటి!"

"ఇది నేనన్నమాటకాదండీ! సాక్షాత్తూ వనజ తన భర్తని ఉద్దేశిస్తూ అనే మాట. ఒకసారి కాదు. చాలా సార్లు అంటూండేది. ఆమె. 'ఆ చేతకాని చవట నాకు భర్త అని అనడం సిగ్గుచేటు. అతనూ, అతని బిలి యర్డ్ ఆటలూ, పీకలమొయ్యా తాగడం, చావు దెబ్బతిన్నట్టు గుర్రుపెట్టి నిద్ర పోవడం. ఏంసుఖపడి చచ్చాను గనక ఆ మనిషితో మీరంటూ వుండబట్టిగానీ' అని అంటుండేది వనజ"

షాక్ తిన్నట్టు ముఖం పెట్టాడు దివాకర్!

'ఓ స్త్రీ! ఎలా నిన్ను అర్థం చేసుకోవడం?' అని గట్టిగా మనసులో అనుకున్నాడు.

'సత్సాంప్రదాయ సమన్విత, సాధ్వి, ఇద్దరు బిడ్డలతల్లి అయిన ఓ పెద్దింటి కోడలి ఆంతర్యం ఇంతటి కామపీడితమా? శారీరక సుఖాలకు అంతటి ప్రాముఖ్యమా ఆమె జీవితంలో' అని అనుకున్నాడు దివాకర్.

"ఆ సుందరం... అదే ఆ సంగీతం మాష్టారు...వాడితో తన భార్య కామకేళి సాగిస్తున్నదని తెలిసి కూడా వూరుకున్న చవట ఆ మనోరంజన్. వాడి అలుసు చూసుకునే వనజ విశృంఖల విహారం మొదలు పెట్టింది"

"మీరెప్పుడేనా ఆమెతో..."

"ఒకసారేం ఖర్మ. ఆమెతో ఆమె గదిలో... ఆమె శయ్యమీద..."

"ఏ సమయంలో మీరు వెళ్ళేవారు?"

"సమయానికేముంది? మనోరంజన్ ఉదయంవెళ్ళి సాయంత్రానికి గాని రాడు. లాయరుగారు కోర్టు పని అయాక క్లబ్బులు, మీటింగులు- ఏనాడూ రాత్రి తొమ్మిదిలోగా ఇల్లు చేరరు. ఆ సుందరం గాడు వారానికి మూడురోజులే వచ్చేవాడు. అయినా దివాకర్‌గారూ! ఇదేం వెర్రి ప్రశ్నండీ!కామాతురులకు నలజ్జ,నభయం, న సమయం... మీరు గ్రహించాలిగానీ అడగడమేమిటి చెప్పండి?" నవ్వుతూ అన్నాడు మీనన్.

అతను నవ్వినప్పుడు క్యా రం గా వంగే అతని కింద పెదవి మరోసారి చూశాడు దివాకర్.

"మీరు, సుందరం కాక వనజకు ఇంకెవరితోనైనా పరిచయం వుండేదా?"

కొద్ది సేపు ఆలోచించి–

"ఆ! రంగస్వామి అని ఒకడున్నాడు. ఈ మధ్యే పెళ్ళికూడా చేసుకున్నాడు. వాడుకూడా వనజను మెచ్చి చూసినట్టు చెప్పుకుంటాడు. ఎంత వరకూ నిజమో తెలీదు. అయేవుంటుందిలెండి. ఎందుకంటే ఓసారి ఇద్దరం సరదాగా సినిమా చూస్తున్నప్పుడు వనజే అంది – 'అరంగస్వామి పెళ్ళి చేసుకుంటున్నాడట. తెల్సా? అనేక పాఠాలు నా దగ్గర నేర్చుకున్నాకే పెళ్ళి చేసుకుంటున్నాడు కాబట్టి అతని సాంసారిక జీవితం సుఖమయం అవుతుందనే ఆశిస్తున్నాను' అని!, కాస్త నదురుగా వయసులో వుండే ఏ మగవాడినైనా వనజ ఇష్టపడిపోయేది" అన్నాడు మీనన్.

"మరి పిల్లలకు పాఠాలు చెప్పే టీచరెవరో వున్నాడట"

"అతనా.. జానకిరామనా? అబ్బే అతను బాగా చిన్నవాడు. అయినా వనజకు అలాంటివారు ఆనరు. అతడు కూడా చాలా మంచివాడు. తన పనేదో, తన లోకమేదో అంతే!"

"వనజ ఇంతమందితో ఇంతగా ప్రేమ కలాపాలు సాగించినా లాయరుగారికి తెలియలేదంటే ఆశ్చర్యంగా లేదూ?"

"లేదు. ఊరందరికీ తెలిసాకే ఇలాంటి భాగోతాలు ఇంటివాళ్ళకి తెలిసేది. పెళ్ళాం కడుపుతో వున్నదన్న సంగతి ఆఫీసు కొలీగు వల్ల తెలుసుకునే భర్తలెందరు లేరు లోకంలో"

"సరే ఎవరికి తెలిసినా, తెలియక పోయినా ఈ హంతకుడికి మాత్రం ఆమె కామకేళీ విలాసాలు తెలుసు" అంటూ బయలుదేరాడు దివాకర్.

* * *

అందరూ మంచివాడు, చిన్నవాడు అంటూన్న జానకిరామన్‌ను చూడాలని పించి బయలుదేరాడు దివాకర్.

మోటర్ సైకిల్ మైలాపూర్, పెట్టెముదలి వీధిలో 96వ ఇంటిముందు ఆగింది.

అది చాలా శిథిలావస్థలో వున్న చిన్న ఇల్లు. గాలీ, వెలుతురూ చొర వీలులేని ఇల్లులా కనిపిస్తోంది. పైకి కిటికీలేమీ లేవు. ఇంటి కప్పుమీద పక్షులు మోసుకొచ్చిన అనేక విత్తనాలు మొలకలెత్తి చిగురిస్తున్నాయి.

ఇంటిముందు నిల్చుని తలుపు తట్టాడు.

రెండు నిమిషాల తర్వాత దగ్గుతూ అనారోగ్యంగా వున్న ఓ ముసలాయన తలుపు తీశాడు.

తననితాను పరిచయం చేసుకున్నాడు దివాకర్.

ముసలాయన చాలా భయపడుతూనే "నేను జానకిరామన్ పెదతండ్రిని, నా పేరు జయరామ్. రండి. లోపలికి రండి" అంటూ ఆహ్వానించాడు దివాకర్‌ని.

గది బాగా చీకటిగా వుంది. మురికి బట్టలు, చెత్తా చెదారం పేరుకుపోయి వుండడంవల్ల గదిలోంచి దుర్వాసన వస్తోంది.

అక్కడున్న ఓ చిన్న స్టూలు చూపిస్తూ తను కిందనున్న చింకిచాప మీద కూర్చున్నాడు జయరామ్.

ఇల్లు అపరిశుభ్రంగా వుంది. దారి

ద్ర్యాన్ని సూచిస్తూ చిరిగిపోయిన జోళ్ళు, అతుకులున్న బట్టలు దర్శనమిచ్చాయి.

"జానకిరామన్ ఏం చేస్తూంటాడండి" అడిగాడు దివాకర్.

"ఏం చేస్తాడు బాబూ! బతకడానికి ఏదో ఒక పని చెయ్యాలికదా! నిరుద్యోగ సమస్య ఎలా వుందో మీకు తెలియంది కాదు. ఇంటర్ ఫస్టియరయాక మరి చదువు సాగించలేకపోయాను. నాకన్న చిన్నవాడైన వాడి తండ్రి నాకన్న ముందే పోయాడు, వీడి బాధ్యత నాకు అప్పగించి. నాకు కూడా ఎవరూ లేరుగాబట్టి ఏదో వీడిని పెంచి పెద్దచేశాను"

"మరి అతని తల్లి ?"

"ఆమె కూడా ఎప్పుడో చచ్చిపోయింది"

"అలాగా! మరి ఇప్పుడు అతను ఏం చేస్తున్నట్టు?"

"ఏవో ట్యూషన్లు చెప్పుకుంటూ కాలం వెళ్ళమారుస్తున్నాడు. నేనారి పైపై ఎందుకూ కొరగాకుండా ఇలా పక్క చేరాను. ఏదో ఆ సంగీతం మాష్టారు సుందరం వుండబట్టి మా వాడికి ట్యూషన్లు ఒకటి రెండు దొరికాయి"

"ఎక్కడ చెప్తూంటాడు ట్యూషన్లు?"

"అయ్యర్‌గారని మంచి పేరున్న వకీలువారి ఇంట ముందు ప్రవేశించాడు. అదేనా సుందరంగారు చెప్పబట్టి. అయ్యరు గారు చాలా మంచివారు. మా వాడిని ఎంతో దయగా, ప్రేమగా చూసుకుంటారు"

"ఎన్ని ట్యూషన్లు వున్నాయేమిటి మీ వాడికి?"

"ఐదారు వున్నట్టున్నాయి. వాడు ఇంట్లో వుండే గంటలు బహుకొద్ది. చాలా కష్టజీవి బాబూ వాడు"

"కనిపిస్తోంది. కష్టపడి పనిచేసే వాళ్ళకు తప్పకుండా విజయం లభిస్తుంది. అతను వచ్చాక చెప్పండి. మరోసారి వస్తాన్నేను" అంటూ లేచాడు దివాకర్.

"పాపం మావాడు పనిచేసే అయ్యరు గారి కోడల్ని, వారింట్లో వుండే శాస్త్రి గారిని ఎవరో హత్య చేశారట. రోజులు చాలా దారుణంగా వున్నాయి. నీతి, నిజాయితీ, మంచి చెడ్డ మచ్చుకైనా కనబడ్డం లేదు. ఆడవాళ్ళకి రక్షణ అన్నది లేకుండా పోయింది" అన్నాడు జయరామ్.

"అవునండీ. మనిషిలోని నిజాయితీ నశించిపోతోంది. ఎన్ని చట్టాలు ఉంటేనేం? ఎంత పోలీసు బలగం వుంటేనేం? వ్యక్తిగతమైన మార్పు రాందే ఏ మంచీ జరగదు. ఆ..మీవాడు వెళ్ళే ముందు ఎక్కడికి వెళ్తున్నది చెప్పి వెళ్తాడా?" అన్నాడు గది గుమ్మం దాటుతూ దివాకర్.

"చెప్పడానికేం వుందండీ. అంతా రొటీన్ కదా! అయిదారు ట్యూషన్లు... రోజూ వెళ్తూంటడం. ట్యూషన్ చెప్పి వస్తూండడం. ఇవాళ మ్రేస్ గేట్ రోడ్‌లో ఏదో ట్యూషను వుందని చూసుకు వస్తానని, వచ్చేప్పుడు అమెరికన్ లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలేవో రిఫర్ చేసుకు వస్తానని చెప్పాడు. వాడు పుస్తకాలు ఎక్కువగా చదువుతూంటాడు."

"అలాగా. నే వెళ్ళివస్తానండీ" అంటూ బయలుదేరాడు.

* * *

మంగళ భర్త సదాశివన్‌కు సంబంధించిన సేల్స్‌మెన్ గురించి ఆరా తీద్దామని ఓ రోజు అనుకున్నా, ఆ అవసరం ఇప్పుడు కనబడ్డం లేదు.

వనజ, సంపూర్ణశాస్త్రి — వీరి హత్యల




తర్వాత, సదాశివన్ సేల్స్ మెన్ గురించి ఇక ఆలోచించవలసిన అవసరం కనిపించడం లేదు.

హంతకుడికి వనజ గురించి కూడా అంటే, ఆమె అంతరంగిక జీవితం గురించి కూడా తెలుసును అంటే, అతడు ఈ ప్రాంతాలకు ఆమె ఇంటి వాతావరణానికి పరిచితుడై వుంటాడని అనిపిస్తోంది.

అయితే సంపూర్ణశాస్త్రి గారిని హత్య చెయ్యడంలో ఆంతర్యం హంతకుడిని శాస్త్రిగారు గుర్తించడమే అనుకోవాలి. ఆ హంతకుడు శాస్త్రిగారికి కూడా బాగా తెలిసే వుండాలి. అంచేత ఆ అడ్డు తొలిగించక తప్పలేదు హంతకుడికి.

అనుమానాస్పదుల జాబితా రోజు రోజుకీ తగ్గిపోతూండడం, ఏవో రెండు మూడు పేర్లు మాత్రం జాబితాలో మిగిలి వుండడం దివాకర్‌కి ఎంతో ఆనందాన్ని ఇచ్చింది.

కాస్త జాప్యమే అయినా, తను హంతకుడికి దగ్గరగా వస్తున్నందుకు తనని తాను అభినందించుకున్నాడు.

* * *

యధాలాపంగా చేతికున్న ఎలాక్ట్రానిక్ వాచీ చూసుకున్నాడు దివాకర్.

అది ఆరు దాటి పది నిమిషాలు చూపిస్తోంది.

అత్యంత ఆధునికమైనదీ, ఎంతో ఖరీదైనదీ అయిన ఆ ఎలక్ట్రానిక్ రిష్టు వాచీ అతని అక్క జయమ్మగారు ఇచ్చిన బహుమతి.

అక్కకీ, బావకీ తనపట్ల ఉండే అభిమానానికీ, ప్రేమకీ ఎంతో ఆనందిస్తూంటాడు దివాకర్.

ఇక్కడ దొరకనివి, అక్కడ అతి చౌకగా దొరికేవి అయిన ఏ అవసర వస్తువైనా అక్క జ్ఞాపకం వుంచుకుని మరీ కొని పంపిస్తుంది. లేదా తను వచ్చేటప్పుడు తీసుకు వస్తుంది.

అలాంటిదే ఎలక్ట్రానిక్ టైప్‌రైటర్, చీకట్లో కూడా ఫోటోలు తీసే కెమెరా, ఎలక్ట్రానిక్ మైక్రోఫోన్—ఇలా ఎన్నో బహుమతులుగా తనకు ఇచ్చింది.

ఎందుకో ఇవాళ బాగా ఆకలి వేస్తోంది. ఏ రెస్టారెంట్ మీదో పడి బాగా సంచేసుకోవాలని అనిపించింది.

అరుణ వుంటే ఇలాంటి సమయాల్లో తనకి కావల్సినవన్నీ క్షణాల మీద అమర్చి పెట్టేది.

ఎన్నాళ్లయిందో అరుణను చూసి.

ఈ పరిశోధనలో పడి పూర్తిగా డస్సిపోయాడు తను. తనకు విశ్రాంతి కావాలి.

ఆ విశ్రాంతి సమయంలో తనకిష్టమైన హోటల్లో ఇష్టమైన రీతిలో యధేచ్ఛగా, హాయిగా, తీయగా గడపాలని మనసు మహా రెపరెపలాడుతోంది.

అలాంటి ఆనందాన్ని కోరకుండానే అందించే వ్యక్తులు ఇద్దరే ఇద్దరు. సిల్వియా...ఆమె బెంగుళూరులో వుంది. రెండవ వ్యక్తి అరుణ. ఇక్కడే వున్నా అరుదుగా దర్శనం ఇస్తోంది.

అరుణకోసం మనసు వెంపరలాడింది.

అరుణ చేసే చిలిపి పనులు ఇన్నీ అన్నీ కావు. ఎంతటి గంభీరమైన మగాడైనా ఆమె ముందు బలాదూరే.

బలే మనిషి.

హాస్టల్ కబుర్లు అభినయ పూర్వకంగా చెబుతూ కడుపుబ్బ నవ్విస్తుంది. హాస్టల్ వార్డెన్ని అనుకరిస్తూ అదోరకం మిమిక్రీ చేయటంలో ఆరితేరిపోయింది.

కళ్ళలోకి చూస్తూ కిలకిలా నవ్వేస్తుంది.

అసలు ఏ మగాడైనా చిత్తయ్యేది ఎక్కడ?

అనుమానం ఏం వుంది?

ఆడదాని ముందే!

అందులో ఆ వ్యక్తి అందమూ, చెందమూ, చిలిపి మకరందమూ కలిగిన జాణ అయితే ఇక ఆ మగాడు నిస్సందేహంగా ఆమె బందీ అయిపోయినట్టే.

"ఇన్నిన్ని తమాషాలు ఎక్కడ నేర్చుకున్నావు అరుణా" అంటే-

"ఫలానా బడిలో" అంటుంది.

"ఫలానా అంటే..."

"దానికి ప్రత్యేకంగా పేరంటూ ఏం వుండదు సూర్యారావుగారూ"

"అదెవరు?"

"ఇంకెవరు. తమరే. తమ పేరు దివాకర్ అని మరిచిపోయారా?

"బలే ఇదిగా వుందే"

"'ఇది' అంటే ఏమిటి?"

"అలా అడిగితే,ఏం చెప్తాం?కొన్నిటికి భావం బోధపడేట్టు ఎక్స్‌ప్రెషనే తప్ప, సరైన పదం వుండదు. అయినా ఇలాంటి వ్యర్థ ప్రసంగాలేమిటి – ఇంత విలువైన సమయాల్లో. నువ్వింకా చాలా నేర్చుకోవాలయ్యా."

"అవన్నీ నేర్పుతావనే గదా నీ ఒడిలో తల వాల్చుకుని శ్రద్ధగా వింటున్నాను" అనేవాడు దివాకర్.

అరుణ అంత చలాకీ పిల్లలు చాలా అరుదు.

అరుణకు తెలీదూ–

తను ఆమె భర్త కాదనీ, సరదా కాలక్షేపం కోసం అప్పుడప్పుడు కలుసుకుంటూంటామని. నీతి శాస్త్రరీత్యా తాను 'తప్పు' చేస్తున్నానని ఆమెకు తెలీదూ?

తెలుసు.

తెలిసీ ఇలా తనతో ఇంత చనువుగా ఆమె గడుపుతూండడాన్ని ఓసారి ఆట పట్టించాలని, గమ్మత్తుగా ఏడిపించాలని అనిపించి–

"అరుణాదేవిగారూ! తమరు పెళ్ళి కావల్సిన పిల్లకదా – మరిలా నా వెంట పడి...."

"కంటపడ్డాక తప్పదుకదా"

"తప్పేకదా."

"తప్పే అయినా తప్పేది కాదుకదా"

"తప్పేదికాదా! తప్పు ఏదీ కాదా..."

"ఏదీ తప్పు కాదనే నా ఉద్దేశం. అసలు తప్పొప్పులని ఈ లోకంలో రెండు వున్నాయంటారా?" సూటిగా అడిగింది అరుణ.

"ఉన్నాయంటారు."

"ఎవరు?"

"అందరూ అంటారుకదా!"

"మీరూ అంటారా?"

"మరి అందర్లో నేనూ వున్నానుకదా!"

"అయితే తప్పు-ఒప్పు అని రెండుంటే ఇలా మనం కలుసుకోవడం తప్పంటారా, ఒప్పంటారా?"

"తప్పే అంటాను".

"అలా తెలిసిన్నీ మీరాతప్పు ఎందుకు చేస్తున్నట్టు?"

సూటిగా అడగ్గానే గతుక్కుమన్నాడు దివాకర్. క్షణంలో సర్దుకుని పురుష భావం ఆ పరుష భావాన్ని చెదరగొట్టగా–

"నేను మగాణ్ని. నేను కోరేనే అనుకో. మరి నువ్వు తప్పు అని తెలిసీ ఎందుకు ఔనంటున్నట్టు?"

"ఏం. మగాడైతే ఏంటిట గొప్ప ? నీతి అనేది అందరికీ ఒకటి కాదా? ఆడది చేస్తే అది పాడుదీను, మగాడు చేస్తే అది




ఘనతానా? నా దృష్టిలో మనకి ఇష్టమైన వన్నీ మంచి పనులున్నూ, అయిష్టమైన వన్నీ చెడ్డ పనులున్నూ అని అనుకుంటున్నాను. నువ్వేదో ఇవాళ నన్ను తప్పించుకుందుకి నీతి పాఠాలు వల్లె వేస్తున్నట్టున్నావ్. ఇలా అన్నావు నిన్ను వదిలేసి నా దారిన నేను పోతానను కున్నావా ఏం. జాగ్రత్త! నేను నిన్ను వదిలేసే నీగతేం కాను" అనేది అరుణ నవ్వుతూనే.

"దివా...నువ్వంటే నాకెంత పిచ్చో, ఇష్టమో, తపనో—ఈ కళ్ళ నడగవోయీ! నీ కోసం నేను ఎంతగా ఎదురుచూస్తూంటానో, రోజులో ఎన్నెన్నిసార్లు నీగురించి తలచుకుంటానో నా పెదవులను అడగవోయీ! ఆడది! నువ్వూహిస్తున్నట్టు చపలచిత్తకాదోయీ! శారీరక సుఖాల శిఖరాల కోసమే ఆడది మగాడిని చేరదోయీ! అణువణువునా నిండిపోయేట్టు మగాడిని ఆడది తన హృదయమంతా ప్రతిష్ఠించుకుంటుంది. పదిలంగా ఆ రూపాన్ని, ఆ అనుభవాన్ని నిక్షిప్తం చేసుకుంటుంది.... !!" తన్మయంగా అనేది అరుణ గంభీరంగా. అంతలోనే హాస్యం ... అంతలోనే మళ్ళీ ఇంత గాంభీర్యం...

ఆ సమయంలో అరుణ ముఖంలో నైర్మల్యం, ప్రేమ, కళ్ళచివర్ల చిప్పిల్లే ఆనందభాష్పాలు...ఇవన్నీ దివాకర్‌ను మైమరపిస్తాయి.

"దివా! నీకు పెళ్లంటే ఇష్టం వుండదు. కానీ, పెళ్ళంటే ఇష్టం వుండని ఆడదుండదు. నేనూ మరి ఆడదాన్నే! నిన్ను నావాడిగా వాడిగా నా చూపులతో కట్టేసుకోవాలని ప్రతి క్షణం అనిపిస్తుంది. కానీ, నా స్వార్థం కోసం, నీ వ్యక్తిగత భావాన్ని ఛిద్రం చెయ్యడం నా కిష్టం లేదు. రాధ కృష్ణున్ని జీవితమంతా ఆరాధించిందేగాని, వివాహ బంధంలోకి దించలేదు. నేను...నేను కన్నుమూసే చివరి క్షణం దాకా 'నీవు నావాడవు' అనే భావం నాకు మిగిల్చితే అదే నాకు పదివేలు. అందుకు నేను ఎదగని ఈ లోకం వేసే ఏ నిందకైనా సిద్ధమే! ఒకరిమీద ఒకరికి ఎందుకింతటి గాఢ ప్రేమ కలుగుతుందో, ఎందుకంతటి మమతానురాగాలు రాగాలు తీస్తాయో... నేను కవయిత్రినైనా అయాను కాను" అంటూ గువ్వలా దివాకర్ ఒడిలో ఇమిడిపోతుంది అరుణ.

ఆవేశంతో, గాఢప్రేమతో అరుణ మాట్లాడుతున్నప్పుడు దివాకర్ ఆమెవేపు ఎంతో ఆరాధనాభావంతో చూడ్డం మినహా ఒక్కమాట మాట్లాడడు.

ఒకొక్కరి సాంగత్యంలో అంతటి శక్తి వుంటుంది కాబోలు...

అరుణ మనసంతా నిండిపోయింది.

దివాకర్ ఆమె జ్ఞాపకాల వెన్నెలను మనసారా అనుభవిస్తున్నాడు.

ఆరోజు...

బయట మధ్యాహ్నం నుంచీ ఒకటే వర్షం. ఆకాశం చిల్లు పడిందా అన్నంత వర్షం.

ఎక్కడికీ కదలలేడు. ఇంట్లో ఒక్కడూ వుండాలంటే ఎంతో బాధగా వుంది.

వేడివేడిగా ఏదో తినాలని, వెచ్చవెచ్చగా ఏదో తాగాలని, అరుణతో ఎక్కడెక్కడో విహరించి రావాలనీ – ఒకటే ఆశ కలిగింది ఆ వాతావరణంలో.

మనసుకేం?

గత క్షణంలో ఇక్కడున్నది, మరు క్షణంలో మరు క్షణంలో పడిపోతుంది.

దానికున్నంత వేగం ఇంక దేనికుంది!

అయినా పగ్గాలులేని మనసులా, బహు బంధాలతో బందీఅయిన మనిషి ఎలా ప్రత్యక్షం కాగలడు?

ఆలోచనలకు అవాంతరంగా అంత వర్షంలో గదిలో బెల్ లయబద్ధంగా నినదించింది.

వెళ్ళి తలుపు తీసి చూస్తే ఏముంది?

తడిసి ముద్దయిపోయి ఎదురుగా అరుణ !

అతని ఆశ్చర్యానికి, ఆనందానికి అవధులు లేవు.

"ఏమిటలా చూస్తున్నారు ? ముందా ఆటోకిడబ్బులిచ్చి పంపేయండి" అంటూ గదిలోకి పరిగెత్తింది.

షాక్ నుంచి తేరుకుని దివాకర్ ఆటో



ఛార్జీ ఇచ్చేసి వచ్చాడు.

ఓసారి నువ్వని, మరోసారి మీరని అనడం అరుణకు అలవాటే!

ఆమె ఎలా పిలిచినా అతనికి బాగుంటుంది.

"అయినా పిలుపులో ఏముంది. పలపులోగాని" అని ఓ సారి తియ్యగా దమాయించేసింది అరుణ.

'నిజంగా నిజంకామోసు' అనుకుని, తనకేసి ఆశగా చూస్తూ ముందడుగు వేసిన దివాకర్‌ను ఆపేసింది అరుణ.

"ఆగు బాబూ ఆగు. నా మొహాన అర్జంటుగా ఓ తువాలు కొట్టకపోతే ఇహ జలుబు తుమ్ములతో నిన్ను అదరగొట్టేస్తాను. ఆ తర్వాత అంతా రసాభాస అయిపోతుంది" అంటూ ఎదురుగా కనిపించిన తువాలు, మడత విప్పని బొంబే డయింగు వారి లేత గులాబీ పూల బెడ్ షీటు తీసుకుని, బాత్‌రూంలోకి తుర్రుమంది.

అరుణకుఅది అలవాటైపోయిన ప్రథమ కార్యక్రమం. ఆ బాత్రూంను చూడగానే బయట తగిలించుకున్న దుమ్మునూ, చమటనూ వదిలించుకోవాలనిపిస్తుందామెకు. ఆ పని ముందు పూర్తయితే గానీ సరదాగా మాట్లాడే ఉత్సాహం రాదు.

ఆ సంగతి దివాకర్‌కూ తెలుసు.

అందుకే బుద్ధిగా తిండికి ఏర్పాట్లుచేసి డైనింగ్ టేబుల్‌సు సిద్ధంగా ఉంచాడు ఆమె దర్శనం కోసం ఎదురు చూస్తూ. నిజానికి అరుణ స్నానం చేసి వచ్చాకే చాలా అందంగా, ఫ్రెష్‌గా కనుపిస్తుంటుంది. వాడిపోయిన పూవుకు బదులు అరవిచ్చుకున్న మొగ్గలా ఉంటుందప్పుడు.

"అరుణా! నీ గురించి ఈ నిమిషంలో ఎంతగా ఆలోచిస్తున్నానో తెల్సా?"

"తెల్సు. అందుకేగా ఇంత వర్షంలో అలా పరిగెత్తుకు వచ్చాను"

"ప్రత్యక్షమవడం అంటే ఇన్నాళ్లూ ఏమిటో అనుకున్నాను. నీ గురించి గాఢంగా, ఏకాగ్రతతో తలచుకున్నాను. అంతే! దేవీ సాక్షాత్కారం అయింది. ఏమైనా మన పూర్వుల మాటలు నమ్మాలి సుమా..."

దేవి సాక్షాత్కరించాక తప్పనిసరిగా భక్తుడికి వరం ఇవ్వాల్సిందేగదా. ఇవ్వాళేం వరం ఇస్తారు దేవిగారు...?"

"దివా... ఇవాళ నిన్ను అలా అలా చూస్తూ గడిపేయాలని వుందయ్యా... ఎందుకో నా కళ్ళనిండా నువ్వే"

అంటూ ఆ విశాల నయనాలను మరీ సువిశాలంచేస్తూ అతని వేపే చూస్తోంది.

ఆమె కళ్లల్లో కామం లేదు, సెక్స్ లేదు, వాంఛలేదు, అతని సాంగత్యంలో శారీరక సౌఖ్యం తనివితీరా అనుభవించాలనే కోరిక లేదు.

ఉన్నది ఒకే ఒక్క భావం –

అతను మంచం మీద వెల్లకిలా పడుకుంటే, అతని గుండెలమీద తలఆన్చి అతని కళ్ళల్లోకి అలా అలా చూస్తూ, ఈ సర్వప్రపంచాన్నీ మరిచిపోయి, ఓ నూతన స్వర్గంలో తన్మయత్వం చెందాలని, శారీరక వాంఛలకు అతీతమైన ప్రేమ అనేదాన్ని అనుభవించాలని...

ఆమె కోరిక!

అదే అంది దివాకర్‌తో!

అలా అంటున్నప్పుడు ఆమెలో కనిపించిన స్వచ్ఛతకు దివాకర్ ఆశ్చర్యపోయాడు.

తను కేవలం సెక్సుదృష్టితోనే చూసే అరుణకు తనపై ఇంత ప్రేమా?




ఇంతటి అభిమానమా ? ఇంతటి ఆరాధనా భావమా?

అరుణ అలా చూస్తూనే వుంది దివాకర్‌ని !

దివాకర్ కూడా ఆమెకేసి అన్నీ మరిచిపోయి అలా చూస్తూనే వున్నాడు.

వాళ్లిద్దరూ అలా ఎంతోసేపు అనిమిషులైనారు.

క్షణికమూ, శారీరకమూ అయిన సెక్సు సుఖంకన్న, శాశ్వతమూ, మానసికమూ అయిన ఈ ప్రేమానుభూతి ఎంత మిన్న !

'ఇది అనుభవించదగినదే గాని, వివరించదగ్గది కాదు' అనుకున్నాడు దివాకర్.

"ఏదో పార్టీకి మీ ఓటు వెయ్యండి" అంటూ నానా గొడవా చేస్తూ వచ్చిన కారు, అతనిని ఊహల ఊయల నుంచి వర్తమానంలోకి తీసుకువచ్చింది.

'కూడు, గూడు, గుడ్డ- ఎలాగూ ఈ రాజకీయ నాయకులు ప్రజలకు అందివ్వలేకపోతున్నారు. కనీసం వారిని తీయని ఊహలలోనైనా జీవించనివ్వకుండా అల్లరి చేస్తున్నారు. హు...'అని దీర్ఘంగా నిశ్వసించి చేతి వాచీకేసి చూసుకున్నాడు.

'ఇవాళింకా లక్ష్మివారం. శనివారం అయితే గాని, ఆమె గురించి ఆలోచించనక్కర్లేదు. సరే. ఈ ఉపవాసాలు ఎలాగూ తప్పేవి కావు. లైబ్రరీకెళ్ళి ఓ రెండు మంచి పుస్తకాలు తీసుకుని, రెష్టారెంట్‌లో ఇంత నాస్తా చేసి, రూం చేరుకోవడం ఉత్తమం, అనుకుంటూ తిన్నగా లైబ్రరీకి బయలుదేరాడు.

లైబ్రేరియన్ సోమనాథ్, దివాకర్‌ను చూడగానే విష్ చేసి కుర్చీ చూపించాడు.

సోమనాథ్ ఉద్యోగిగా లైబ్రేరియన్ కావచ్చు గానీ, అతని బ్రెయినొక సాహిత్యపు బ్రెయిన్. దానికి నిరంతర యానమే తప్ప అలసట వుండదు. విశ్రాంతి వుండదు.

ముఖ్యంగా సోమనాథ్ ఇంగ్లీషు సాహిత్యమంటే ఎక్కువ ఇష్టపడతాడు.

జార్జ్ ఆర్వెల్ నుండి షెల్లీ దాకా వాళ్ళ రచనల గురించి సోదాహరణంగా, అనర్గళంగా పేజీలు, పేరాల సహితంగా చెప్పగలడు.

అతని జ్ఞాపకశక్తికి అబ్బురపడి దివాకర్ అతనికి తన నేర పరిశోధనకు కావల్సిన విషయాల గురించి, వ్యక్తుల గురించి వివరించి ఓ దృష్టి వుంచమని చెబుతూ వుంటాడు.

అలా సోమనాథ్ కొన్ని ఆచూకీలు తియ్యడంలో దివాకర్‌కు ఎంతో ఉపకరించాడు.

ఒకరంటే ఒకరికి ఎంతో గౌరవమూ, మరెంతో అభిమానమున్నూ.

"ఏమిటి విశేషాలు" అడిగాడు దివాకర్.

"ఏం వున్నాయ్. ఈమధ్య మీరడిగిన 'ది మిచిగన్ మర్డర్స్', 'కన్ఫెషన్ ఆఫ్ ఎ నాజీ స్పై' రెండూ వచ్చాయి. తీసుకెళ్తారా?" అడిగాడు సోమనాథ్.

"ఇంకా తీసికెళ్తారా అనే ప్రశ్న కూడానా? వెంటనే ఇచ్చెయ్యక. ఆ రెండూ మీరు చదివేసే వుంటారు. అవేవో కాకమ్మ కథలు కావు. కేవలం యదార్థ గాథలు. నేరస్తుల మానసిక స్థితిగతులు, వారు చెప్పే చిత్రాతిచిత్రమైన విషయాలు ఎంతో ఉత్తేజాన్ని, ఉద్రేకాన్ని, ఉత్సాహాన్ని కలగజేస్తాయి. ఇలా ఇవ్వండి" అన్నాడు దివాకర్.

సోమనాథ్ పుస్తకాలు వేరే నోట్



చేసుకుని, దివాకర్‌కు అందిస్తూ అన్నాడు "వీటి కోసం ఆ కుర్రాడు వచ్చినప్పట్నుంచీ అడుగుతున్నాడు. జవాబు చెప్పాలేక, ఇవ్వాలేక చస్తున్నాను".

"ఎవరేమిటి? అంత ఇంట్రెస్ట్ ఉన్న కుర్రాడు?"

"చందా కట్టలేదు. ఊరకనే ఇక్కడే చదివి ఇచ్చేస్తూంటాడు. పేరు అడగలేదు. ఆ పుస్తకంలో సంతకం చేస్తూంటాడు వచ్చినప్పుడల్లా" అని సిగ్నేచర్ బుక్ చూపించాడు.

"ఎలా వుంటాడు?"

"అతి సాధారణంగా. ఏ ప్రత్యేకతా లేదు. కాలేజీ కుర్రాడిలా వుంటాడు"

దివాకర్ ఏమీ అనలేదు.

సిగ్నేచర్ బుక్ తెరిచి, ఓ పదిహేను రోజుల క్రితం నుంచీ సంతకాలన్నీ పరిశీలనగా చూశాడు.

రెండు మూడు సార్లు వచ్చిన వాళ్ళు, ఐదారు సార్లు వచ్చిన వాళ్ళు కాక, పది పదిహేను సార్లు వచ్చిన వాళ్ళు- అదేనా ప్రతిరోజూ రెగ్యులర్‌గా వచ్చేవాళ్ళు ఓ ఇద్దరున్నారు.

ఆ పేర్లు పరిశీలనగా చూశాడు.

వాటిని పదేపదే మననం చేసుకున్నాడు.

అలా ఆ పేర్లు రెండూ చూస్తూంటే, దివాకర్ తలలో ఏదో మెరిసినట్లయింది.

అందులో ఒక పేరు దగ్గర అతని దృష్టి నిలిచిపోయింది.

దాని వేపే చూస్తున్నాడు.

ఆ సంతకం సంతకంలా కాక కాస్త ప్రస్ఫుటంగా రాసినట్టు వుంది.

ఓ క్షణం తర్వాత, సోమనాథ్ వేపు చూస్తూ "చూడండీ ఈసారి అతను వస్తే, క్యాజువల్‌గా అతని వివరాలు తెలుసుకోండి. అతను సంతకం పెట్టాక ఆ సంతకం గుర్తు పెట్టుకోండి" అన్నాడు దివాకర్.

"అలాగే" అన్నాడు సోమనాథ్.

దివాకర్ పుస్తకాలతో బయలుదేరి మోటర్‌సైకిల్‌ను స్టార్ట్ చేశాడు.

తన కిష్టమైన రెస్టారెంట్ కేసి వడిగా దూసుకుపోయింది మోటర్‌సైకిల్.

* * *

వెతుకుతున్న కొద్దీ ఆకాశం దూరం అవుతున్నట్టు, ఆలోచిస్తున్న కొద్దీ హత్యా రహస్యం అభేద్యమైపోతోంది.

ఏమాత్రపు ఆచూకీ దొరక్కుండా, ఆధారం లేకుండా జరుగుతున్న ఈ హత్యల వెనక ఏదో నిగూఢమైన కారణం వుండే వుంటుంది.

రౌడీ అనగానే చారల బనియను, ముఖం మీద కత్తిగాటు, ఎర్రని కళ్ళు వుండాలని రూలేం లేదు.

తెలుగు పండితులనగానే పంచ, లాల్చీ, ఓ పేం బెత్తం, గుండు, ఓ చెక్కని పిలక, నశ్యాభ్యాసం ఇవన్నీ వుండి తీరాల్సిన అవసరమేం లేదు.

మారే కాలంతోపాటు వేషభాషలు, ఆహార విహారాలు - అన్నీ మారిపోతున్నాయి.

తెలుగు పండితుడు ఎంచక్కా ఫుల్‌సూట్‌లో వస్తే ఆశ్చర్యంతో మనం నోరు తెరుస్తే, ఆ తప్పు ఆయనది కాదు.

ఆలోచనల్లోనే తప్పువున్న మనదీ ఆ తప్పు.

అలాగే హత్యలు చేసేవాడు 'ఇలా వుండాలి. ఇలా వుంటాడు' అని మనం ఆలోచిస్తే, ఊహిస్తే అ తప్పుమనదే!

బిచ్చగాడు అనేవాడు దైన్యంగా, చింకి బట్టలతో, ఎముకల పోగుగా,

 

లోతైన కళ్ళతో, కొనఊపిరితో వుంటాడని ఊహించనక్కర్లేదు.

చక్కగా డ్రెస్ చేసుకుని, ఎంతో స్టైల్‌గా, అతి నాగరికంగా 'అడుక్కునే' ఆధునిక బిచ్చగాళ్ళు ఎందరు లేరు నేడు!

సగటు బిచ్చగాడు 'ధర్మం బాబా' అని అడుక్కుంటే, నిర్దాక్షిణ్యంగా వదిల్చికొట్టే మనమే, కాస్త ఇంగ్లీషు ముక్కలు జోడిస్తూ ఎంతో వినయంగా యాచించే వ్యక్తికి ఓ రూపాయి ఇచ్చి పంపిస్తాం.

అలాగే హంతకులు కూడా భయంకరంగా వేటకత్తులతో బయలుదేరరు.

మనలో ఒకరిగా వుంటూ, అన్నీ తెలుసుకుంటూ చాప కింద నీరులా ప్రవేశించి, గుట్టుచప్పుడు కాకుండా ప్రాణాలు తీసే హంతకులు కూడా వుంటారు.

అందులో ఇది అణుయుగం. ఇరవయ్యవ శతాబ్దం.

అన్ని విషయాలలోలాగే హత్యలు, దోపిళ్ళ విషయంలో కూడా అత్యంత నాగరిక దేశాలలో జరిగే విధానాన్ని మన వాళ్ళూ అనుసరిస్తున్నారు.

అనుసరణ మనిషి జన్మహక్కు.

దాన్నెవడు కాదనగలడు?

ఆలోచనలతో తన ఆఫీసు గదిలో కూర్చున్న దివాకర్‌కు అంతరాయం కలిగిస్తూ ఫోన్ గణగణమంది.

"దివాకర్ హియర్."

"............"

అంతే!

దివాకర్ ముఖం వెయ్యి వెలుగులతో నిండిపోయింది.

"వాట్...స్వీటీ. యు ఆర్ హియర్"

అతను ఆనందంతో, ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

"........."

"అలాగా. ఓకే. వస్తున్నా. అరక్షణంలో నీ ముందుంటాను. రూం నెంబరెంతన్నావ్."

"............"

"ఓకే"

గాలిలో తేలిపోతూ, ఇంచుమించు పరుగులాంటి నడకతో ఇంటికి తాళం వేసి, మోటర్ సైకిల్ స్టార్ట్ చేశాడు.

తోవలో ఎలా పట్టణ రద్దీని తప్పించుకున్నాడో, ఎలా గమ్యం చేరాడో అతనికే తెలీదు.

హోటల్ చోళా ముందు దిగి, లిఫ్ట్ ముందు ఆగేడు.

రూం నెంబరు చూసి, బెల్ నొక్కాడు.

క్షణంలో తలుపు తెరుచుకుంది.

ఎదురుగా మెరిసే కళ్ళతో సిల్వియా!

అమావాస్య రాత్రి. ఆ కటిక చీకటిలో అపూర్వ కాంతితో వెన్నెలలు వెదజల్లే జాబిల్లిలా వుంది సిల్వియా.

కాలి మునుకుల మీదకు పసుపు, ఆకుపచ్చ కలగలిపిన పువ్వుల గౌను మరి కిందకు దిగలేనని బైఠాయించింది. నిజానికి సిల్వియా ఆదుస్తుల్లోనే అందంగా ఉంటుందేమో. అరుణలా చీరకట్టు, బొట్టులో ఆమెను ఊహించుకోలేకపోయాడు దివాకర్. అలాగే అరుణనీ ఈ డ్రెస్‌లో ఊహించటం అసాధ్యం. నిజంగా డ్రెస్‌లో ఏమీ లేదేమో! అంతా తన చూపులోనే ఉందేమో. చూడగా చూడగా ఈమెనిలా గౌన్లలో, ఆమెనలా చీరల్లో తప్ప మరోలా ఊహించలేని స్థితికి

వచ్చేశాడేమో. ఏమైనా ఎవరి అందం వారిదే.

వెనక నుంచి కాలితో రూం తలుపుని ధబాల్న ఓ తన్ను తన్ని, అమాంతం సిల్వియాను తన బిగి కౌగిటిలో చేర్చు కున్నాడు దివాకర్.

ఆమె అతని ధాటికి తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది.

అయినా అవన్నీ గమనించే స్థితిలో లేడు దివాకర్.

కొన్ని నిమిషాల స్పర్శ సుఖాల తర్వాత ఇద్దరూ విడిపోయారు.

"వాటే ప్లెజంట్ సర్ప్రైజ్ స్వీటీ" అన్నాడు దివాకర్.

"నాకూ నిన్నటివరకూ ప్రోగ్రాం తెలీదు. బాస్ నిన్న సాయంత్రం పిలిచి అర్జంటుగా ఆఫీసు పని అప్పజెప్పి, రిజర్వు చేసిన టిక్కెట్ చేతికిచ్చి వెళ్ళి రమ్మన్నారు. మామూలు పరిస్థితిలో అయితే రెఫ్యూజ్ చేసేదాన్ని. కానీ, మీరు ఇక్కడ వున్నారు కదా—మనం కలుసు కుని చాలా రోజులైంవికదా – ఓ సారి చూసినట్టుంటుంది కదా ..."

"సరదాగా గడిపినట్టుంటుంది కదా— అని బయలు దేరేసావా? వెరీ గుడ్. అబ్బ ఎంత ఆనందంగా వుందో! ఈ మధ్య నిన్ను తలుచుకోని రోజులేదు. ఎంత డల్‌గా ఫీలయానో... నిన్నైతే మరీను"

"నేను వచ్చేసానుగా మరింక డల్ ఏమిటి"

"ఇంతకీ నీ ప్రోగ్రాం ఏమిటో చెప్పావు గావు?"

"ఏముంది! తినటం, తిరగటం, నిద్ర పోవటం-మామూలేగా"

"అంతేనా..."

"పోనీ! బీచిలో తడుస్తూ డ్యూయెట్లు పాడుకుందామా?"

"కాదు, నీ వీపు పగలగొడదాం" అంటూ లేచాడు దివాకర్.

* * *

సాయంత్రం ఇద్దరూ ఏకాంతంగా వుండే ఇలియట్స్ బీచ్‌లో కూర్చున్నారు. ఉదయం గౌను వేసుకున్న సిల్వియా ఇప్పుడు స్కై కలర్ చీర, అదే కలర్ స్లీవ్‌లెస్ బ్లౌజు వేసుకుంది. ఎడం చేతికి ఆభరణం లాంటి వాచీ పెట్టుకుంది. మెడలో కనీ కనిపించనంత సన్నని బంగారు గొలుసు. జుత్తు ఓ చిన్న రిబ్బన్‌తో కట్టి వదిలేసింది.

సంధ్య వెలుగులు ఆమె ముఖం మీద దోబూచులాడుతున్నాయి. ముఖం మీద గాలికి అటూ ఇటూ కదులుతూ ముంగు రులు మూగుతున్నాయి.

అక్కడా అక్కడా కొన్ని జంటలు కూర్చుని గుసగుసలాడుకుంటున్నాయి.

విశాల సాగరం మీంచి వీచేగాలి నీటి తుంపర్లను కూడా మోసుకొచ్చి జంటల మీద పన్నీరు చిలికిసోంది.

సిల్వియా చేతిని తన చేతిలోకి తీసు కుని, మెత్తగా నొక్కుతూ ఏదోమాట్లాడు తున్నాడు దివాకర్.

ఆమె ప్రకృతి సౌందర్యాన్ని తిల కిస్తూ ఊకొడుతోంది.

కాస్త దూరంలో ఓ యువకుడు వెల్లకిలా పడుకుని ఆకాశాన్ని, ఇటూ అటూ తల తిప్పుతూ కదిలే జంటల్ని చూస్తున్నాడు.

సిల్వియా దృష్టి ఆ యువకుడి మీద పడింది.

"పాపం గర్ల్‌ఫ్రెండ్ రాలేదు కాబోలు. ఒంటరిగా, నిరాశగా ఒక్కడూ ఎలా పడు




కున్నాడో" అంది.

దివాకర్‌కి కూడా అలాగే అనిపించింది కానీ సిల్వియా అలా అనడంతో అతనికి చిరాకేసింది. అది సహజంగా మగాడికి కలిగే చిరాకు.

తనతో వచ్చిన ఆడది ఇంకెవడో మగాణ్ని గమనించడం, అతడి గురించి మాట్లాడం ఏ మగాడూ భరించలేడు.

"పోన్లెద్దూ ఎవడి గొడవో మనకెందుకు మధ్య. డిన్నరెక్కడ తీసుకుందామో చెప్పు. ఏదేనా మూవీకెళ్దామంటే చెప్పు.."

దివాకర్ అంటూండగా దూరంగా పడుకున్న యువకుడు లేచి ఇసుక రేపుకుంటూ రోడ్డుకేసి మెల్లిగా నడక సాగించాడు.

"పాపం వెళ్ళిపోతున్నాడు" అంది సిల్వియా.

దివాకర్ ఏం అనలేదు.

కనుమరుగయేవరకూ అతణ్ని చూశాడు.

"డిన్నరెక్కడ తీసుకుందాం" తిరిగి అడిగాడు దివాకర్.

"మీ ఇష్టం. మూవీకి మాత్రం తప్పకుండా వెళ్దాం" అంది సిల్వియా.

"అదికూడా నా యిష్టమేనా?" అడిగాడు దివాకర్.

"కాదు నా యిష్టం"

"గుడ్. అయితే చెప్పు"

"మీకు తెల్సుగా నాకు మలయాళీ పిక్చర్సంటే యిష్టమని"

"ఎందుకని ?"

"అందుకని"

"అంటే"

"అంటే అదంతే"

"ఎందుకో చెప్పాలి మరి ?" బలవంతం చేశాడు దివాకర్.

దూరంగా కూర్చున్న ఒకటి రెండు జంటలు లేచి రోడ్డుకేసి నడక సాగిస్తున్నాయి.

దివాకర్ ఓ క్షణం సూటిగా ఆమె కళ్లల్లోకి చూశాడు.

మసక వెలుగులో మెరిసిపోతూ కోరికల్ని రేపుతున్నట్లున్నాయి ఆ కళ్లు. అలసిపోయినదానిలా అతని ఒడిలో తల వాల్చుకుంది సిల్వియా.

ఆమె స్పర్శలో అతని హృదయం రేసు గుర్రమైపోయింది.

సువిశాలమైన ఆకాశం, సాగరం గమనిస్తూండగా దివాకర్ ఆమె పెదాలను బలంగా ముద్దుపెట్టుకుని—

"ఇందుక్కాదా?" అన్నాడు.

"అన్నిటికీ" చిలిపిగా అంది సిల్వియా.

ఆ సినిమా చాలా రోజులనుంచీ ఆడుతోంది. ఈ మధ్యనే శతదినోత్సవం కూడా చేసుకుంది.

"చాలా మంచి సినిమా" అనే పేరు రావడంతో పోనీ చూద్దాం అని సిల్వియాతో బయలుదేరాడు దివాకర్.

అయితే సినిమా ఆశించినంత ఆనందాన్ని ఇవ్వలేకపోతోంది సిల్వియాకి.

"కంప్లీట్ సెక్స్ సినిమా అనుకున్నాను దివాకర్ ! ఇందులో ఘోరంగా క్రైమ్ అండ్ మర్డర్ కూడా వుంది. బోరు బాబూ" అంది అతని భుజంమీద తల వాలుస్తూ.

"చంపేసావ్ పో. బోరా? నా సెక్రెటరీవి. మర్డర్ అండ్ క్రైమ్ అంటే బోరా? పరువు పోతోంది. చూడు సినిమా చూడు, నిద్రపోకు" అన్నాడు దివాకర్.

కథ మంచి పట్టులో నడుస్తోంది...

కట్టుకున్న మొగుణ్ణి మోసం చేసి,

అనేక మందితో తన కామకేళీ విలాసాలు తీర్చుకుంటూ విశృంఖలంగా జీవిస్తూం టుంది ఓ ఇల్లాలు. భర్త అమాయకుడు, మంచివాడు. భార్యని అతిగా ప్రేమిస్తూ ఆమె ఆడింది ఆటగానూ, పాడింది పాట గానూ జరిపిస్తూంటాడు.

తన భార్య ప్రవర్తన అతనికి తెలీదు. కనీసం అనుమానమైనా రాదు.

అయితే ఆ ఇంట్లో ఆమె ప్రతి కద లికను ఓ రెండు కళ్లు గమనిస్తూంటాయి.

ఆ కళ్ళకు కోపం వుంటుంది, ఆవేశం వుంటుంది, నోరుంటుంది. అయినా అవి కోపగించవ్ ఆవేశపడవ్. ఒక్కమాట మాటాడవ్.

అలా అతి నిశితంగా, మౌనంగా ఆమె నీతి బాహ్య ప్రవర్తనను చూస్తూంటాయి.



ఆ కళ్ళు ఆమె విశృంఖల సెక్సు విజృంభణాన్ని స్పష్టంగా చూస్తున్నప్పుడు కూడా ఏమీ అనవు.

నిశ్శబ్దంగా పిడికిలి బిగించడం, తల గడ కసిగా చింపేసి ఆ దూదిని చిందర వందర చెయ్యడం, బట్టలను ముక్కలు ముక్కలు చెయ్యడం-తన చేతిని భయంకరంగా కొరుక్కుంటూండడం ఇలాంటి చేష్టలు చేస్తుంటాయి ఆ కళ్ళు!!

ఒకరోజు ఆమె కూరలు తరుగుతూ వుంటే ఎవరో వెనుకనుంచి వచ్చి ఆమెను మోటుగా కౌగిలించుకుంటాడు.

ఆమె దాహంగా అతన్ని చూస్తుంది.

అతను ఆమెను అలాగే నలిపేస్తూ -

"ఏమిటిది! పట్టపగలు ఇలా వచ్చేయమన్నావ్ ? మీ ఆయన చూస్తే ఏమన్నా వుందా ? ఇంట్లో ఇంకెవరూ లేరా ?" అడిగాడు.

"ఇక్కడ లేనివాళ్ళ గురించి ఎందుకీ అనవసర ప్రసంగం? రద్దూ" అంటూ తరుగుతున్న కూరల్ని అలా వదిలేసి, పక్క గదిలోకి అతణ్ని లాక్కుపోతుంది.

తలుపు దగ్గరగా నెట్టేస్తుంది.

కుక్కి మంచం బాధగా మూలుగుతూంటుంది.

ఇదంతా గమనిస్తున్న కళ్లు ఉద్రేకంతో ఎర్రబడతాయి. ఆ కళ్ళల్లో కృతనిశ్చయత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

కొద్ది క్షణాల తర్వాత, అంత వరకూ కూరలను తరిగిన కత్తిపీట అతి క్రూరంగా ఆ విలాసిని తలను మొండెం నుంచి భయంకరంగా వేరు చేస్తుంది.

రక్తం చిమ్మి విటుడి ముఖం వికృతంగా మారిపోతుంది.

అతను భయంకరంగా అరుస్తాడు...

తెరమీద దృశ్యాల్ని, నిశ్శబ్దంగా జనం గుండెలరచేత పట్టుకుని చూస్తున్నారు.

ఆమె తల తెగి నేలమీద పడగానే ప్రేక్షకులలోంచి బిగ్గరగా 'శెభాష్' అనే కేక వినిపించింది.

అందరూ అటూ ఇటూ చూశారు.

ఆ శబ్దం తమ ముందు వరుసనుంచి రావడం స్పష్టంగా విన్నాడు దివాకర్.

'శభాష్' అన్నప్పుడు, అలా అన్న వ్యక్తి పిడికిలి బిగించి తృప్తిగా చేతిని గాలిలో వూపాడు.

ఆ వెలుగునీడల మధ్యలో ఆ వ్యక్తి ముఖంలోకి చూడ్డానికి ప్రయత్నించాడు దివాకర్.

ఎక్కడో... ఎక్కడో చూసినట్టనిపించి-

"సిల్వియా! అతనికేసి చూడు... ఎక్కడో చూసినట్టు లేదూ ముఖం?" అన్నాడు.

సిల్వియా కూడా కాస్త వంగి అతనికేసి చూస్తూ-

"పాపం-భగ్నప్రేమికుడండీ ఇతను. ఇందాక ఇలియట్స్ బీచ్‌లో చూడలేదూ? అతనే ఇతను" అంది.

"రైట్. అనుమానంలేదు. చూట్టానికి కుర్రాడిలా వున్నాడు."అన్నాడు దివాకర్.

కొద్ది నిమిషాల తర్వాత ఆ కుర్రాడు బయటకు నడవడం గమనించి, తనూ అనుసరించాడు.

అప్పటికే అతను గేటుదాటి, కిందకి దిగిపోయాడు.

వడివడిగా గేట్ దగ్గర పాస్ తీసుకుని ముందుకు నడిచాడు.

దివాకర్‌లో కంగారు చూసి-

"ఏం సార్ ఏమైంది?" అన్నాడు గేట్‌బాయ్.

"ఏంలేదు ఇప్పుడు ఒకతను వెళ్ళాడు..." దివాకర్ ఇంకా పూర్తి చెయ్యకుండానే—

"అతనా? అతను ఇంచుమించు ఈ సినిమా ముప్ఫై సలభైసార్లు చూశాడు. ఎంత ఓపికో ఏమిటో ఎవరితోనూ మాటాడు...గంభీరంగా సిన్మా చూస్తాడు. ఆ హత్య సీను వచ్చేసరికి ఉరకలు వేసే ఆనందంతో 'శభాష్' అని అరుస్తాడు. ఆ తర్వాత కొద్ది నిమిషాలకి బయటకు వెళ్ళిపోతాడు. ఎప్పుడూ ఔట్ పాస్ తీసుకోడు. మరి రాడుకూడాను..." అని అతను ఇంకా చెప్పేలోగా ఇంటర్వెల్ అయింది.

పరిసరాలు కోలాహలంగా తయారయాయి.

"దీవా డియర్! బోర్ కొడుతోంది. లెటజ్ గోటూ రూమ్..." బద్ధకంగా, చిరాగ్గా అంది సిల్వియా!

"సినిమా అన్నది సరదాకోసం, వినోదం కోసం, విశ్రాంతి కోసం చూస్తాం గానీ ఈ హత్యలు, రక్తపాతం ఏమిటి?" ఇదీ సిల్వియా అభిప్రాయం.

"అయినా ఈ సిన్మా చూడ్డం వల్ల, ఏదో కొత్త విషయం తెల్సుకున్నట్టు.తన పరిశోధనలో కొంత మార్పు దొరికినట్టు ఫీలయ్యాడు దివాకర్.

వడివడిగా మెట్లదిగి, అతనికోసం చుట్టూ కలియజూశాడు.

అతను కనపడలేదు.

ఎందుకో ఏదో అందినట్టే అంది చెయ్యిజారిపోయినట్టు భావించాడు.

అతని మూడ్స్ డైవర్టయాయి.

సిల్వియాతో హోటల్ చోశాకేసి ప్రయాణం సాగించాడు.

కొంత దూరం వెళ్ళే సరికి ట్రాఫిక్ జామ్ అయిపోయింది నాలుగైదు సినిమాలలో ఒకేసారి ఇంటర్వెల్ అవడంతో రోడ్డంతా జనంతో నిండిపోయింది.

ఆ జాప్యాన్ని భరించలేక వాహనాన్ని పక్కసందులోంచి లాగించాడు దివాకర్.

కొంత దూరం వెళ్ళాక అది మెయిన్ రోడ్‌తో కలిసిపోతుంది.

సరిగ్గా మెయిన్‌రోడ్ మీదకు తన మోటర్ సైకిల్ వచ్చేసరికి, ఎదురుగా వస్తున్న వ్యక్తి ఓ క్షణం ఆగి, మీద లైటు పడ్డందుకు విసుగ్గా ముఖం చిట్లించి, వాహనం వచ్చిన సందులోకి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

అతనికేసి చూశాడు దివాకర్.

అతను...అతను ఇందాక సినిమాలో తాము చూసిన వ్యక్తే!

ఎందుకో, కారణమైతే స్పష్టంగా స్ఫురించడం లేదు గానీ ఆ కుర్రాడిని చూడగానే దివాకర్ సిక్త్స్ సెన్స్ అతనికి ఏదో క్లూ ఇచ్చినట్టు అనిపించింది.

కొద్ది నిమిషాల తర్వాత హోటల్ గది చేరుకున్నారు దివాకర్, సిల్వియాలు.

"అబ్బా! షవర్ బాత్ తీసుకుంటేగాని తల దిమ్ము వదిలేట్టు లేదు" అంటూ సిల్వియా బాత్ రూంలోకి చొరబడబోతూంటే—

"త్వరగా వచ్చేయ్, డియర్! అక్కడే నిద్రబోకు. ఈలోగా డిన్నర్ తెప్పిస్తాను. ఏం తెప్పించనూ!" అన్నాడు దివాకర్.

"మీ యిష్టం వచ్చింది తెప్పించండి"

"ఐతే హాట్ డ్రింక్"

"నో...నో...గాంధీ పుట్టిన దేశమిది

"అదేం కుదర్దు."

"యస్ స్వీటీ...బ్రాందీ పుట్టని దేశ

మిది ... ఇది మద్రాసు మహాపట్నం. ఇక్కడ ఇలాంటివి విచ్చలవిడిగా దొరకవ్. అద్సరేగానీ ఫ్రెంచ్ తెప్పించమంటావా"

"ఓకే" అంటూ ఆమె బాత్‌రూంలోకి దూరిపోయింది.

గొప్ప ఛాన్స్ పోయినట్టు బిక్కముఖం వేసుకుని, సోఫాలో అలా కూర్చుండిపోయాడు దివాకర్.

ఎందుకో అతని మూడ్స్ అన్నీ ఒకే బిందువుపై కేంద్రీకరించబడుతున్నాయి.

మనసంతా ఆలోచనలతో మహా గందర గోళంగా వుంది.

సిల్వియా వుండగా అతని మనసులో మరో ఆలోచన రావడమే ?

అలాంటిది ఎందుకింతగా ఆ కుర్రాణ్ణి చూసిన నుంచీ తన మనసు అతణ్ని శంకిస్తోంది ?

ఆ సినిమా అతను అన్ని సార్లు ఎందుకు చూస్తున్నట్టు ?

సినిమా చూస్తున్నప్పుడు మనిషి రకరకాల అనుభూతులకు లోనౌతాడు.

అంత మాత్రం చేత అంత ఉద్రేకంగా ఆ హత్య సీన్లో 'శభాష్' అని కేకలెయ్యడమేమిటి ?

ఇదోరకం పర్వర్షనా ?

కామోద్రేకంతో కన్నూ మిన్నూ కానకుండా, కేవలం వాంఛను తీర్చుకోవడం ఒక్కటే సర్వకాల సర్వావస్థలలోనూ ముఖ్యమైనదిగా ఎంచే స్త్రీలంటే ఇతనికి చాలా కోపం అయివుండాలి.

అలాంటి స్త్రీని అంత ఘోరంగా హత్య చెయ్యడం అతనికి ఆనందం కలగజేసే విషయమన్నమాట.

ఇలాంటి మానసిక పరిణామానికి అతను రావడానికి ఎలాంటి కారణాలు వుంటాయి ?

ఆలోచిస్తూంటే దివాకర్ మానసికాకాశాన్ని ఆవరించుకున్న అనుమానాల మేఘాలన్నీ చల్లబడి, చల్లని హిమబిందువులవంటి జల్లును ఝల్లున కురిపించాయి.

అతనొక నిర్ణయానికి వస్తున్న తరుణంలో...

ఎదురుగా—

పలుచని నైట్‌గౌన్లో అందాల్ని వాటి మానాన్ని వాటిని వదిలేసి మంచు తడిసిన మల్లెగుత్తిలా, వెన్నెల కురిపిస్తూ—

సిల్వియా తడిపెదవులతో చిలిపిగా నవ్వుతూ నిల్చుంది.

ఆ సౌందర్యానికి ముగ్ధుడై సిల్వియాను తదేకంగా చూస్తున్నాడు దివాకర్.

కాలం అక్కడ ఆగిపోయింది.

* * *

"హలో..."

"యస్ దివాకర్ స్పీకింగ్"

"నమస్కారం సార్ ! నేను సోమనాథ్‌ని మాట్లాడుతున్నాను. మీరు నాకొక చిన్న పని అప్పచెప్పారు. గుర్తుందా సార్"

"భలేవాళ్ళే గుర్తులేకేం? మీ లైబ్రరీకి వచ్చే అబ్బాయి గురించి. ఊఁ ఏవిటట విశేషం"

"ఏం లేదు. కుర్రాడు ఇప్పుడే వచ్చి వెళ్లాడు. పల్చగా, మామూలు హైట్‌లో అమాయకంగా, స్థిర చిత్తాన్ని చెప్పే కళ్ళతో సాధారణంగా వున్నాడు."

"పేరు.. పేరు కనుక్కున్నారా?"

"కనుక్కున్నాను. అతని సంతకం కూడాచూశాను. అతని పేరు..."పేరు చెప్పబోయేలోగా లైన్ సడెన్‌గా కట్టయింది.

మళ్ళా ట్రై చేశాడు దివాకర్. కుదర్లేదు.




వెంటనే మోటారు సైకిల్ తీసుకుని, లైబ్రరీ చేరాడు.

ఒక్క క్షణంలో సోమనాథ్ ఎదురుగా నిల్చున్నాడు.

అతణ్ని చూడగానే దివాకర్ కి ఎంతో ఆనందం కలిగింది.

మాట్లాడుతూండగా అంత సడెన్‌గా లైను కట్టవగానే, దివాకర్ ఆలోచనలు పరిపరి విధాలుగా పోయాయి.

ఏమైతేనేం సోమనాథ్‌కి కీడేం జరగలేదు.

"ఏవిటి! అంత సడెన్‌గా ఫోన్ పెట్టే శారని అనుకున్నాను, ఏమైంది?" అడిగాడు దివాకర్.

"ఏం లేదు.. టెలిఫోన్స్ శాఖవాళ్ళు చేసే లక్షలాది జోకుల్లో ఇదొకటి."

"అది సరేగాని అతని పేరు ఏవిటిట ?"

'జానకిరామన్. ఆ గుండ్రటి చక్కని సంతకం చేశాడే. అతను..." ముగించాడు సోమనాథ్.

ఎందుకో తను వేసే ప్రతి అడుగూ తనని గమ్యానికే తీసుకెళ్తున్నదని అనిపించింది దివాకర్‌కి.

'జానకిరామన్' అనుకున్నాడు మనసులో!




జానకిరామన్...అతను, అతను ఎక్కడెక్కడ ట్యూషన్లు చెప్తున్నాడు? ఏయే సమయాల్లో ట్యూషన్లకు వెళతాడు?ఎంత మంది పిల్లలకు పాఠాలు చెప్తున్నాడు?

సదాశివన్‌ను కలుసుకుని కొన్ని వివరాలు అడిగితే మంచిదని తన రథాన్ని అటు మళ్ళించాడు.

సదాశివన్ తనని చూసి ఆశ్చర్యపోయాడు. అతను బాగా చిక్కిపోయాడు. వృద్ధాప్యం జబర్దస్తీగా మీద పడ్డవాడిలా ఎంతో నీరసంగా కనిపించాడు.

"ఏమైనా వివరాలు తెలిశాయా ఇన్స్‌పెక్టర్?" అడిగాడు,

"లీలగా కొంత మార్గం ఏర్పడింది. మీరు కొన్ని వివరాలు చెప్పాలి. సారీ, మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నానేమో?"

"అలాగేం లేదు. అడగండి చెబుతాను."

"జానకిరామన్ అనే పేరుగాని విన్నారా మీరెప్పుడైనా"

"వినేవుంటాను. గానీ ఇప్పుడేమైనా తెలిసిందా?"

"తెలియడం కాదు. అలాంటి వ్యక్తి ఎవరేనా మీకు గుర్తున్నారా?"

"ఎలా గుర్తుంటాను ఇన్స్‌పెక్టర్. ఎందరు జానకిరామన్‌లు లేరు లోకంలో"

"ఇతను ఇప్పుడిప్పుడే కాలేజీ ఆవరణ దాటి జీవితంలోకి ప్రవేశించిన కుర్రాడు. ఇక్కడ కొందరు పిల్లలకి ట్యూషన్లు చెపుతున్నాట్ట."

"నాకు తెలీదు. అయితే మా మేనల్లుడొక అబ్బాయి వున్నాడు. వాడికి తెలియవచ్చు" అంటూ, 'రాజేష్' అని కేకేశాడు.

పదేళ్ళ లోపు వయసుండే రాజేష్ "యస్ అంకుల్" అంటూ పరిగెత్తుకు

వచ్చాడు.

చాలా చురుగ్గా, చక్కగా వున్నాడు పిల్లాడు.

"చూడు రాజేష్! ఈయన దివాకర్. ఎవరో టీచర్ గురించి అడుగుతున్నారు. నీకు తెలుసేమో చెప్పు."

"యస్సంకుల్. ఎవరు కావా లంకుల్."

"చూడు రాజేష్. ఇక్కడ జానకి రామన్ అనే ఆయన ఎవరేనా పిల్లలకు ట్యూషన్లు చెబుతున్నారా? మీ ఫ్రెండ్సె వరేనా ఆయన దగ్గర చదువుతున్నారా?"

"ఎవరూ. జానీ టీచరా. నాకు తెలుసు. నానీ వాళ్ళింట్లో వాళ్ళ చెల్లెళ్ళకు పాఠాలు చెబుతూంటారు. ఆ అమ్మాయి లిద్దరూ వట్టి పప్పు ముద్దలు" పెంకెతనంగా అన్నాడు.

"నానీ ఎవరు?"

"నారాయణన్ అని క్రికెట్ ఆడు తూంటారు. ఎప్పుడూ ఆటలే."

"సరేగాని జానీ టీచర్ని ఎప్పుడేనా చూశావా?"

"ఎందుకు చూడలేదు. ఒకటి రెండు సార్లు మా ఇంటికి కూడా వచ్చారుగా."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? ఎవరికో ఫోన్ చెయ్యాలని వచ్చారు. నానీ వాళ్ళింట్లో ఫోన్ చెయ్యడానికి వప్పుకోరుగా. వాళ్ల భలే పీచుగాళ్ళులే"

"అలాగా...అది సరేగాని, జానీ టీచరు మీ నానీ వాళ్ళింటికి ఎప్పుడు ట్యూషన్‌కి వస్తారో నీకు తెల్సా?"

"ఓ తెలీకేం...ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో వస్తుంటారు రోజూ. ఆ పప్పుముద్దలు రెండూ పది గంటల వరకూ స్కూలుకు వెళ్ళవుగా..."

"అలాగా...మీ ఫ్రెండ్స్ ఇల్లు ఎక్కడ రాజేష్"

"రండి చూపిస్తాను."

"వద్దులే. ఇక్కడి నుంచే చూపించు" అన్నాడు దివాకర్.

రాజేష్ చేత్తో చూపిస్తూ, ఇంటి గుర్తులు చెప్తున్నాడు.

* * *

ఆల్వార్‌పేట కార్నర్‌లో, మోటర్ సైకిల్ పక్కగా వుంచి, ఎవరికోసమో ఎదురు చూస్తున్నాడు దివాకర్.

నిమిషాలు గడుస్తున్నకొద్దీ అతనిలో ఆలోచనలు తీవ్రం కాసాగాయి. అసహ నంగా అటూ ఇటూ నాలుగడుగులు వేస్తున్నాడు.

జానకిరామన్ ఎలా వుంటాడో తనెప్పుడూ చూడకపోయినా, నలుగురూ చెప్తున్న దాన్నిబట్టి తన మేధస్సు చిత్రించిన ఊహాచిత్రాన్నిబట్టి, అనుభవం నేర్పిన పాఠాలబట్టి,అతను జానకిరామన్‌ని ఇట్టేగు ర్తుపట్టగలడు.

నానీ వాళ్ళింట్లో వున్న ఆ చిన్న ఆడ పిల్లలు - రాజేష్ భాషలో పప్పుముద్దలు కూడా తమ ప్రైవేటు మాష్టరు కోసం చూసి చూసి విసిగిపోయి ఇంట్లోకి పారిపోయారు.

వాళ్ళ ఇంటి ముందు ఓ పాతకాలపు రిక్షా ఆగింది. అందులో ఆ పిల్లలిద్దరూ స్కూలుకు బయలుదేరిపోయారు.

టైము తొమ్మిదింపావు దాటిపోతోంది.

ఇవాళ జానకిరామన్ ఎందుకు ట్యూషన్ చెప్పడానికి రాలేదో దివాకర్‌కి అర్థంకాలేదు.

ఇకరాడని నిశ్చయించుకుని, వాహనం ఎక్కి జయరామ్ ఇంటికి కొద్ది దూరంలో ఆపి నడుచుకుంటూ ఇంట్లోకి ప్రవేశిం చాడు.

"నమస్కారం జయరామ్‌గారూ... గుర్తున్నానా...?"

జయరామ్ ఆశ్చర్యంగా దివాకర్ వేపు చూస్తూ, ఓ క్షణం తర్వాత "అరెరె మీరా...నమస్కారంసార్! క్షమించండి. గుర్తుపట్టలేకపోయాను. ఇప్పుడే కాళ్ళకి నూనె పట్టించుకున్నాను. మరోలా అనుకోకండి. వచ్చి కూర్చోండి" అన్నాడు.

"ఫరవాలేదు. మీవాడు ఇవాళ కూడా ఇంట్లో లేనట్టుందే? నేను వచ్చి వెళ్ళానని చెప్పారా?"

"లేదండీ. చాలా ఉదయమే ట్యూషన్లకు వెళ్ళిపోయాడు. మీరు వచ్చి వెళ్ళారని చెప్పాను."

"ఏమన్నాడు?"

"ఏం లేదు. నవ్వేసి వూరుకున్నాడు"

"ముందు ఎక్కడికి వెళతాడు?"

"సాధారణంగా వాడు ఎప్పుడో చెప్పినదాన్ని బట్టి ముందుగా ఆల్వార్‌పేట మ్యురేస్‌గేట్ రోడ్‌లో ఓ ఇద్దరు ఆడ పిల్లలకు ట్యూషన్ చెప్తాడు".

"ఆ తర్వాత..."

"ఆ తర్వాత, నాకు సరిగా తెలీదు. ఏవిటి ఇవాళ ఇంత గట్టిగా అడుగుతున్నారు, ఏం ప్రమాదం లేదుకదా?"

"అలాంటిదేంలేదు. అతణ్ని చూడాల్సి వుంది. అంతే"

"అంతేకదా. అసలే రోగిష్టివాణ్ని, బెంగతో కొట్టుకుపోతున్నాను."

"అదిసరేగాని మీ వాడు ఆ తర్వాత ఎక్కడికెళతాడు?"

కొద్దిగా ఆలోచించి-

"ఆల్వార్ పేటనుంచి, శాంథోమ్ రోసరీ చర్చిరోడ్ వెళతాడు. అక్కడొక అబ్బాయికి ట్యూషన్ చెప్తాడు. ఆ అబ్బాయికి పోలియోనో ఏదోట – అంచేత స్కూల్లో జాయిన్ చెయ్యలేదు."

"అలాగా. ఆ అబ్బాయి ఇంటి గుర్తులేమైనా మీకు తెల్సా?"

"తెలీదండీ. ఎవరో కంట్రాక్టరట. భూపతిరావట. వాళ్ళింటికి వెళ్తుంటానని అన్నాడు."

"థేంక్స్. మీరు అనవసరంగా కంగారు పడకండి.మా పరిశోధనలో మేం కాస్త కఠినంగా ప్రవర్తించవచ్చు. అది మా ఉద్యోగ ధర్మం. వస్తాను మరి" అంటూ రివ్వున బయటకు వచ్చాడు.

మోటర్ సైకిల్ వేగంకన్న అమిత వేగంగా అతని ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి.

పది నిమిషాలు గడవక ముందే అతను ప్రసిద్ధమైన శాంథోమ్ చర్చి ముందు ఆగేడు.

వాహనాన్ని పక్కగా పెట్టి, రోసరీ చర్చి రోడ్డుగుండా నడక ప్రారంభించి ఓ పెద్ద భవంతి ముందు ఆగేడు.

ఇంటి ముందు అందమైన అక్షరాలతో 'భూపతి నిలయం' అని వుంది. తను వెతుకబోయిన ఇల్లు ఇదే అయ్యుంటుందని భావించి, ఇంటి ఆవరణలో ప్రవేశించి ద్వారం ముందు ఆగేడు.

కాల్‌బెల్ నొక్కిన రెండు క్షణాల్లో తలుపులు తెరుచుకుని ఓ నడివయస్కురాలు వచ్చి, "ఏం కావాలి" అని అడిగింది.

"భూపతిరావుగారు వున్నారాండీ" మెత్తగా అడిగాడు.

"ఆయన వూళ్ళోలేరు. ఏం కావాలి?"

"వారితో మాట్లాడదామని వచ్చాను. వూళ్ళో లేరంటున్నారు. ఎప్పుడు వస్తారండీ".

"ఇవాళే వెళ్ళారండీ. రావడానికి ఓ



మూడు రోజులు పట్టవచ్చు."

"అలాగా. మీ ఇంటికి జానకిరామన్ అనే ఆయన ట్యూషన్ చెప్పడానికి వస్తూంటారా?"

"అవును. వస్తూంటాడు. మా అబ్బాయికి అతను ట్యూషన్ చెప్తుంటాడు."

"ఇవాళ వచ్చి వెళ్ళాడా?"

"ఇంకా రాలేదండీ. ఈ సరికి వచ్చేయాలి. ఆరోగ్యం బాగులేదో ఏమో. మంచి నమ్రతైన కుర్రవాడు అతను" అంది మెచ్చుకోలుగా.

దివాకర్ గోడలకేసి యధాలాపంగా చూశాడు.

జీసెస్ క్రైస్ట్ ఆయిల్ పెయింటింగ్ స్పష్టంగా కనబడింది అతని కళ్ళకి.

"మీరు బై ఎనీ ఛాన్స్ క్రిష్టియన్సా?" అడిగాడు.

"అవునండీ. మా వారు మాత్రం హిందూ. వివాహం తర్వాత వారు మా మతం పుచ్చుకున్నారు."

"అలాగా."

"ఇంతకీ మీరెవరో చెప్పలేదు."

"నా పేరు దివాకర్. నేను డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ని."

అతని వేపు ఆశ్చర్యంగా, భయంగా, గౌరవ సూచకంగా చూసింది ఆమె.

"జానకిరామన్ గురించి వివరాలు అడుగుతున్నారు. అతనితో మీకేం పని? ఆ అబ్బాయి చాలా మంచి కుర్రాడే."

దివాకర్ చిన్న చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. జవాబేం చెప్పలేదు.

"చూడండి ఇన్స్పెక్టర్‌గారూ! అమాయకులు, చిన్నవాళ్లు అయిన వాళ్ళగురించి అనవసరంగా వాకబు చెయ్యడం కంటే ఈ మధ్యంతా జరిగిన భయంకర హత్యల గురించి పరిశోధించి నేరస్తుల్ని పట్టుకోకూడదూ. ఆ హంతకుల చేతుల్లో మా కజిన్ కూడా ప్రాణాలు కోల్పోయింది ఏం చేస్తున్నారో తెలీదు ఈ పోలీసు బలగమంతా" ఆవేదనగా అంది ఆమె.

ఆశ్చర్య స్ఫోరకంగా ఆమె వేపు చూస్తూ.

"మీ కజినా! ఎవరండీ ఆమె ?"

"మా బంధువుల అమ్మాయి ప్రమీల.. డాక్టర్ ప్రమీల. అభివృద్ధిలోకి వస్తున్న దనుకుంటూండగా ఆమెను దారుణంగా ఎవరో హత్య చేశారు"

"ప్రమీల ... డాక్టర్ ప్రమీల మీ కజినా"

"ఏం అలా అడుగుతున్నారు?"

"ఏం లేదు. ఆమె ఇక్కడకు వస్తుంటుందా?"

"తరుచూ మా యింటికి వస్తుంటుంది. మేం దగ్గర బంధువులమండీ బాబూ"

దివాకర్ తలలో అస్పష్టపు ఆలోచనలు ఒక రూపాన్ని దిద్దుకుంటున్నాయి.

అలుముకున్న మేఘాలు విడిపోతున్నాయి.

"వస్తాను" అంటూ ఒక్క ఉదుట్న లేచి చరచరా బయటకు నడిచాడు.

ఉన్నట్టుండి లేచి వెళ్ళిపోతున్న దివాకర్ వంక ఆమె ఆశ్చర్యంగా చూస్తోంది.

దివాకర్, మరో ముగ్గురు మఫ్టీలో వున్న పోలీసులతో పెట్టె మొదలి వీధిలో మాటువేసి వున్నాడు.

నిమిషాలు గడుస్తున్నకొద్దీ అతనిలో ఆతృత ద్విగుణీకృతం అవుతోంది.

వీధి పెద్ద రద్దీగాలేదు. ఓ ఇద్దరు సైకిల్‌మీద పోతున్నారు. కూరగాయల బండీ తోసుకుంటూ నడుస్తున్నాడు ఒకడు. చక్రాల్లో గాలి లేకపోవడంచేత రిక్షాని నడిపించుకుని వెళ్తున్నాడు ఒక ముసలి డ్రైవరు. వీళ్ళూ వాళ్ళూ ఇలా వెళ్తూ వస్తున్నారే తప్ప దివాకర్‌కి కావల్సిన వ్యక్తి మాత్రం గోచరమవడంలేదు.

బీదవాడు, మంచివాడు, నెమ్మదస్తుడు తన పనేదో తాను చేసుకుపోయేవాడు, డబ్బులేక ఇంటర్ ఫస్టియర్‌తో చదువు చాలించి అక్కడా అక్కడా ట్యూషన్లు చెప్పుకుని బతుకుతున్నవాడూ అయిన ఓ అమాయకుడి కోసం దివాకర్ కళ్లు వెతుకుతున్నాయి.

ఆ అమాయకుడి పేరు జానకిరామన్!

ఈ నలుగురు పోలీసు బలగం అలా చాలా సేపటివరకూ అక్కడే నిలబడి వుండడం కొందరికి అనుమానం వచ్చింది.

ఎదురుగా వున్న ఇంట్లోంచి జయరాం ఓసారి దగ్గుతూ వచ్చి ఓ క్షణం ఇటూ అటూ చూసి లోపలికి వెళ్ళిపోయాడు.

అతనికి కనబడకుండా తప్పుకున్నాడు

దివాకర్.

సహనం అతనిని పరీక్షకు పెడు తోంది. ఎవరో కవి రాసిన "సహనం నీదైతే సకలం నీదేరా" అనే పాట రేడి యోలో వస్తోంది. అయితే ఎంత సహనం వుంటే అంతటి విజయం సాధించవచ్చు అనే నిజం అనుభవ పూర్వకంగా తెలిసి వున్నవాడు కాబట్టి ఏమాత్రం కూడా విసుగు చెందలేదు దివాకర్.

నిరీక్షణలో అతనికి వున్నట్టుండి ఆకలి వేసింది.

పక్కనున్న షాపులోంచి ఓ బిస్కెట్ పేకెట్ తెప్పించి నలుగురూ సర్దుకుని పేకెట్ కాస్తా అయిందనిపించారు. ఆ తర్వాత లిమ్కా తెప్పించుకుని తాగి, తృప్తిగా నిశ్వసించాడు దివాకర్.

ఉన్నట్టుండి అతని కళ్ళు చురుగ్గా పని చెయ్యడం మొదలుపెట్టాయి.

ఎదురుచూస్తున్న వ్యక్తి సన్నగా, పీలగా, అమాయకంగా మెల్లిగా ముందుకు అడుగులు వేస్తూ వస్తున్నాడు.

దివాకర్‌లో ద్విగుణీకృత ఉత్సాహం పరుగులు తీసింది.

వేటగాడికి తెలుసు-వేట ఎలా వస్తుందో!

వేటకూ తెలుసు - వేటగాణ్ని ఎలా తప్పించుకోవాలో.

అలా ముందుకు నడుస్తున్న జానకి రామన్ క్షణకాలంలో వెనక్కి తిరిగి మెరుపులా దూసుకుపోసాగాడు.

దివాకర్, మిగతా ముగ్గురు సింహాల్లా ముందుకు దూకి జానకిరామన్‌ని వెంబ డించారు.

ఊహించని ఈ సంఘటనకి చుట్టు పక్కల వున్నవాళ్లంతా చకితులైనారు.

కొందరు అరుగుల మీదకు పాకి పోయారు. మరికొందరు వారి వెంబడి పరుగులు తీశారు.

అంత వరకూ ప్రశాంతంగా వున్న ఆ వీధి వాతావరణం ఉద్రిక్తంగా తయారైంది.

నాలుగైదు మలుపులు తిరిగి తిరిగి, చివరకు దివాకర్‌కు చిక్కిపోయాడు జానకిరామన్!

కొండంత బరువు దించేసినట్టు, ఘన మైన విజయం సాధించినట్టు, ఎంతో తృప్తిగా నిశ్వసించాడు దివాకర్.




"ఐ హేట్ ఆల్ వుమెన్. ఆడవాళ్ళంటే నాకు కసి. అందర్నీ చిత్రవధ చేసి చంపాలన్నది నా ధ్యేయం..." పిచ్చిగా అరిచాడు జానకిరామన్.

"ఏమిటా కేకలు. సరిగా చెప్పు. న్యాయాన్ని నీ చేతిలోకి తీసుకోవడానికి ఎవరిచ్చారు నీకు అధికారం" కర్క శంగా అడిగాడు కమీషనర్ జాన్.

"ఒకరు నాకు అధికారం ఇచ్చేదేమిటి? నా యిష్టం వచ్చినట్టు నేను చేస్తాను. స్త్రీ అంటే నాకు పరమ అసహ్యం. ప్రతి ఆడది.. అవును ... ప్రతి ఆడదీ... ఒక బిచ్. ఎవరో కవి అన్నట్టు సెంట్ పర్సెంట్ వుమన్ ఆర్ బేడ్. మహాను భావుడు ... స్ఫటికం లాంటి నిజం

చెప్పాడు. ఇవాళ...ఇవాళ...నా మనసులో వున్నదంతా చెప్పెయ్యనివ్వండి. నా గుండెలనిండా పేరుకున్న బాధని వెళ్ళగక్కనివ్వండి. ఐ హేట్ ఆల్ వుమెన్...."గొంతు తడారిపోయేట్టు, దిక్కులు పిక్కటిల్లేటట్లు అరిచాడు జానకిరామన్.

సన్నగా, పీలగా, నమ్రతగా వుండే ఇరవై ఏళ్ళున్నా నిండని జానకిరామన్‌కి ఇంత గొంతు, ఇంత బలం, ఇంత కర్కశత్వం ఎలా వచ్చాయని అంతా ఆశ్చర్యపోయారు.

బరువుగా నిట్టూర్చి, వంచిన తల ఎత్తి "వాటర్ ... వాటర్ ప్లీజ్..." అన్నాడు.

రెండు గ్లాసుల నీళ్ళు గటగటా తాగేశాడు.

పోలీస్ కమీషనర్ జాన్, డిటెక్టివ్ ఇన్స్‌పెక్టర్ దివాకర్, తదితర అధికారులూ అంతా జానకిరామన్‌కేసి, ఉత్కంఠగా చూస్తున్నారు.

ఒక్క క్షణం నిశ్శబ్దం తర్వాత...

"ఆడది అంటే పరమ పవిత్రమైనదనీ, సృష్టికి మూలం స్త్రీయేననీ, దేవుడు తనకు మారుగా ఆడదాన్ని సృష్టించాడనీ త్యాగానికి, ప్రేమకు, మమతాభిమానాలకు రూపకల్పన స్త్రీ అనీ వేనోళ్ళ పొగడబడే ఆడది ఎంతటి కాముకురాలో, ఎంతటి విలాసవతో, ఎంతటి విశృంఖల విహారో...నన్ను...నన్ను అడగండి చెబుతాను.

నేనింత స్త్రీ ద్వేషిగా, హంతకుగా ఇంత చిన్న వయసులోనే మారిపోవడానికి, ఆడదంటే నాలో ఇంత కసి పెరిగిపోవడానికి ఇన్ని ఘోరహత్యలు నేను - అది మీ భాషలో - చెయ్యడానికి...కారణం...కారణం ఏమిటో...

బాల్యంలో నా లేత మస్తిష్కంలో ఎలాంటి భయంకర ముద్రలు పడ్డాయో.. మీరెవరూ ఊహించలేరు.

నాలాంటి చేదు అనుభవాలు, భయంకరమైన పరిస్థితులు ఎవరికీ...ఎవరికీ రాకూడదు.

మా నాన్న గుమాస్తాగా పనిచేసేవాడు. నేనంటే అతనికి ఎనలేని ప్రేమ. మా అమ్మ... ఛీ. ఆమెను అలా పిలిచి, ఆ పవిత్ర పదాన్ని అగౌరవపరచలేను. ఆ ఆడకుక్క, ఆ కాముకి, ఆ పిశాచి.."

ఒక్క క్షణం తనని తాను సంబాళించుకుని తిరిగి మొదలుపెట్టాడు.

"ఆమెను, నన్ను తన రెండు కళ్లుగా భావించి, తనకు వచ్చే ఆ తక్కువ జీతంలోనే తన అలవాట్లను కూడా మానుకుని మా కోర్కెలన్నీ తీర్చేవాడు మా నాన్న. ఆమె అంటే అతనికి దేవతతో సమానం. మాతృప్రేమను గురించి, ఆ ప్రేమలో త్యాగాన్ని గురించి, స్త్రీల సహనశీలత గురించి నాన్న నాకు ఎప్పుడూ చెబుతూండేవాడు. నన్ను బెల్సారోడ్‌లో వుండే ఓ స్కూల్‌లో చేర్పించాడు నాన్న.

ప్రతి ఆదివారం నన్ను తప్పకుండా పార్కుకో, బీచ్‌కో తీసుకువెళ్ళేవాడు.

ఆ రోజు... ఆ రోజు పార్కులో వుండగా, నాన్నకి కాస్త జ్వరం తగిలినట్టయి దీపాలు పెట్టకుండానే వెళ్ళిపోదామన్నాడు.

ఇద్దరం బయలుదేరి రిక్షాలో వడిగా ఇంటికి వచ్చేశాం.

ఇంటి తలుపులు వేసి వున్నాయి. నేను తలుపు తట్టాను. నాన్న కిటికీలోంచి లోపలికి చూశాడు.




ఆయన గట్టిగా కేకేశాడు. నేనుకూడా కిటికీలోంచి లోపలికి చూశాను.

ఆ దృశ్యం...ఆ దృశ్యం..." తల పట్టుకుని మూగగా వుండిపోయాడు జానకిరామన్.

"ఆ బిచ్, ఇంటి యజమాని పట్టబ్రహ్మ పరంధామయ్య ఇద్దరూ బట్టలు లేకుండా ఒకరి మీద ఒకరు పడుకుని వున్నారు. నేనెప్పుడూ అలాంటి దృశ్యం చూసి వుండలేదు. అది నా వూహకి అందని విషయం. ఏదో అసహ్యం. ఏమిటో కోపం. భయంకరమైన మానసిక సంఘర్షణ. తెలిసీ తెలియని భావ విజృంభణ.

ఆమెను అక్కడికక్కడే చంపేద్దామని అనిపించింది.

కానీ, నేను బాగా చిన్నవాణ్ని. ఏ రకమైన శక్తీ లేనివాణ్ని.

నాన్న ముఖం పాలిపోయింది.

ఆయన అవాక్కైపోయాడు.

తలుపులు బలవంతంగా లోపలికి నెట్టారు. ఆ పట్టబ్రాయన నాన్న వేపు చూసి నవ్వుతూ వెళ్ళిపోయాడు.

నాన్న కుప్పలా కూలిపోయాడు.

ఆమె... ఆమె ఏమీ అనలేదు. నాన్నను లేవదీసే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

ఎవరో సహాయం చేస్తే నాన్నని మంచం మీద నేనే పడుకోబెట్టాను.

ఆ మర్నాడు... ఆ మర్నాడు నాన్న శవం బాత్‌రూంలో దూలానికి వేళ్ళాడింది.

ఆమెను ఒక్క పల్లెత్తు మాట అన లేదు. తను పంచిచ్చిన ప్రేమకు ఫలంగా ఆమె అందిచ్చిన చేదు అనుభవం నాన్న జీవితాన్ని బలిగొంది.

ఆ తర్వాత ఆమె విశృంఖల విహారానికి హద్దూ పద్దూ లేదు.

అమ్మ అలా ఎందుకు చేసిందో చేస్తోందో నేను ఆలోచించదలచలేదు. నాన్న... నన్ను ఎంతో ప్రేమగా చూసే నాన్న ఆత్మహత్యకు కారణం అమ్మ. ఆవిడ చెడు తిరుగుళ్ళు! అంతే.

నాతోటి పిల్లల ఎగతాళి, వెక్కిరింపులు నన్ను మరింతగా బాధించేవి.

"ఏరా జానీ! అలా వున్నావేరా?"

"వీడికేంరా ఎంచక్కా రోజుకో నాన్న వస్తున్నాడు. వీడికి ఎన్నో డబ్బులు కూడా ఇస్తుంటార్రా వాళ్ళు"

"నిజమే అబ్బ ఎంతదృష్టంరా నీకు. మమ్మల్ని సినిమాకి తీసుకెళ్ళరా జానీ"

వాళ్ళ మాటలు నన్ను చిత్రవధ చేసేవి.

అయితే నేను వాళ్ళని ఏం చెయ్యగలను?

ఇంత మంది నన్ను ఎందుకింత అవమాన పరుస్తున్నారు? దీనికి కారణం ఎవరు?

నన్నింతగా క్షోభపెట్టే ఆమె అంటే నాలో కసి క్షణక్షణ ప్రవర్ధమానం కాసాగింది.

ఆమెను... ఆమెను నిర్దాక్షిణ్యంగా చంపేయాలి

ఆమెనే కాదు... ఆమెలాంటి ప్రతి ఆడదాన్నీ మట్టుబెట్టాలి. నాలో పెరిగిపోతున్న కసికి న్యాయం చేకూర్చాలంటే, ప్రతి ఆడదాన్నీ చంపెయ్యాల్సిందే..."

ఇవీ నా ఆలోచనలు.

పరిస్థితి గ్రహించిన పెదతండ్రి నన్ను తనతో తీసుకు వెళ్ళిపోయాడు.

ఆడది ఎందుకు మగాణ్ని మోసం చేస్తోంది? తన కాముకత్వదాహానికి

ప్రేమించే వారిని సైతం నాశనం చేసి, ఏమీ తెలియని అమాయకలా ఎందుకు నటిస్తోంది ?

అలా మోసం చేసే ప్రతీ ఆడదాన్నీ సర్వనాశనం చెయ్యాలన్నదే నా ధ్యాసగా మిగిలిపోయింది.

నా వయస్సు పెరుగుతున్నకొద్దీ నాలో ద్వేషాగ్ని రగులుతూ వచ్చింది. కసి పెరుగుతూ వచ్చింది.

నేను పదోతరగతి పాసయినాక, పెదతండ్రి జయరామ్ నన్ను ఆమెవద్దకు బలవంతంగా తీసుకు వెళ్లారు.

అయితే అప్పటికే ఆమె ఎవరితోనో లేచిపోయిందని చెప్పారు అక్కడివాళ్లు..

నా చదువు సాగలేదు.

ఇక ఉద్యోగాన్వేషణ ..

నాలాంటి వాడికి దొరికే ఒకే ఒక ఉద్యోగం పిల్లలకి పాఠాలు చెప్పడం.

అప్పుడే నానీ వాళ్ళింట్లో పిల్లలకి పాఠాలు చెప్పడానికి కుదిరాను. వాళ్ళ ఫోను ఉపయోగించనిచ్చేవాళ్లు కారు వాళ్లు.

అంచేత ఎప్పుడేనా ఎవరికేనా ఫోన్ చెయ్యవలసివస్తే మంగళా వాళ్ళింటికి వెళ్ళేవాణ్ని.

ఆమె ప్రేమికులతో ఫోన్లో కబుర్లాడేది. సదాశివన్ కేంపులకు వెళ్ళగానే కృష్ణ అనే అతనితో బీచ్ షికార్లు, కారు వెనుక సీట్లో కామకాలాపాలు...

ఆమె సదాశివన్‌ని మోసగిస్తోందని తెలియగానే రెండు మూడుసార్లు వారిని వెంబడించి..

ఓ రోజు ఆమెను బీచ్‌లో ఆమె బ్రాతోనే హత్య చేశాను. అది అమావాస్య చీకటి రాత్రి కావడంతో నాకు లాభించింది.





పోలీసులు నన్ను పట్టుకోలేక పోవడంతో, నాలో ధైర్యం పెరిగింది.

నా కోర్కె తీరుతున్నందుకు గర్వంగా వుండేది.

అలాగే రజని...

ప్రేమించే భర్త, అందమైన చిన్న పిల్లలు వుండగా పరిమళ ద్రవ్యాలు, చిన్న చిన్న బహుమతులు ఇస్తున్నాడని వజీర్‌అలీతో చేతులు కలిపిన రజని..

ఓ రోజు ఉద్యోగపు వేటలో నేను వారి ఆఫీసుకి బాగా సాయంత్రం చేసి వెళ్లాను.

అక్కడ ఆమె ఆ వజీర్ అలీ కౌగిలిలో...

ఛీ.. ఏం ఆడజాతి ఇది!

పథకం వేసి ఆమెను మట్టుబెట్టాను.

అలాగే పురుష ద్వేషిగా నటిస్తూ, పవిత్రమైన వైద్యవృత్తిలో వుంటూ, క్షణిక శారీరక సౌఖ్యాలకోసం ఉచ్చం నీచం వదిలేసి మగాడైతే చాలనే స్థితికి దిగజారి చర్చి ఆవరణలోనూ, ఆ చుట్టుపక్కలా తన కామకేళీ విలాసాలు సాగించిన డాక్టర్ ప్రమీల...

ఈమె తరుచూ భూపతిరావు గారింటికి బంధురీత్యా వస్తుండేది. నేను వారి అబ్బాయికి ట్యూషన్ చెప్పేవాడిని. పెద్ద పెద్ద కబుర్లాడుతూ, చీకటి మాటున ఆమె చేసే వేషాలు గమనించాను.

భూపతిరావుగారు కుటుంబసమేతంగా కేంపుకు వెళ్ళినప్పుడు, ఈమెకు ఇల్లు అప్పజెప్పారు.

ఆ నాలుగు రోజులూ వారి ఇల్లు శృంగార మందిరంగా మార్చేసింది ఈ ఇల్లాలు.

అందుకే ఆమెను చంపేశాను.

నర్సు జ్యోతిని చాలా చోట్ల చాలా రకాల మగాళ్లతో చూశాను. రోజుకోచోట

రోజుకో మనిషితో తిరిగే ఆమెతో పరిచయం పెంచుకుని, హత్య చెయ్యాలనుకున్నాను.

నేను కుర్రాడిలా, అమాయకంగా కనిపించడంవల్ల నన్నెవరూ అనుమానించరు.

అది ఆసరాగా తీసుకుని ఈ హత్యాకాండ చేశాను. ఏదేనా ఉద్యోగం చూడమని అభ్యర్థిస్తూ చాలా సార్లు ఆమె వద్దకు వెళ్లాను.

మీరు మారువేషంలో రావడం, చీర ఇవ్వడం అన్నీ గుర్తించాను.

మరోసారి మీరువస్తే తప్పక మిమ్మల్ని కూడా తన కొంగున కట్టేసుకునేది. మీరు వెళ్ళిన రాత్రే ఆమెను హతమార్చాను.

ఇక వనజ....

ఆమె పిల్లలకు నేను ట్యూటర్ని. ఆ ఇంట్లో జరిగే ప్రతి పనీ నాకు తెలుసు. పవిత్ర వంశంలో పుట్టి, అత్యంత విలాసవంతమైన జీవితం గడుపుతూ, కుటుంబ గౌరవాన్ని నిలబెట్టాల్సిన ఆవ్యక్తి బిచ్లా ఎందర్ని...ఎందర్ని బలిగొంది? తన కామాగ్నికి ఎందర్ని ఎరచేసింది! సంపూర్ణ శాస్త్రి వంటి నిష్ఠాగరిష్ఠుని సమక్షంలోనే ఉంటున్నా ఆమెపై ఆయన ప్రభావం ఏమాత్రం పడలేకపోయింది. ఏ కళనుందో గానీ ఓ రోజున నన్ను కూడా కథలోకి దింపే ప్రయత్నం చేసింది ... కాని ...

అదే సమయానికి సంపూర్ణశాస్త్రిగారు అక్కడికి రావడం నేను గమనించాను.

అంచేత నిష్కారణంగా ఆయన్ని కూడా హత్య చెయ్యక తప్పలేదు.

వయసును బంధించడానికి ఉపయోగించే వాళ్ళ వాళ్ళ బ్రాలనే వాళ్ళని హత్య చేసే ఆయుధాలుగా ఉపయోగించాను.

బ్రా లేనిచోట ఇనుపతీగ ఉపయోగించాను. ఇన్ని... ఇన్ని హత్యలు చేశాను.

ఇంకా నా కసి తీరలేదు. మా నాన్న ఆత్మ శాంతించాలంటే, నేను ఇంకా ఇంకా ఎన్నో హత్యలు చెయ్యాలి.

"నువ్వు ఎక్కువగా పుస్తకాలు చదువుతావా?" అడిగాడు దివాకర్.

"చదువుతాను... అయితే ఎక్కువగా క్రైమ్ అండ్ మర్డర్ నవలలు, అలాంటి సినిమాలు అంటే నాకు చాలా యిష్టం" అన్నాడు జానకిరామన్

"...సినిమా చూశావా ?" అడిగాడు దివాకర్.

"ఆ సినిమానా? ఎన్నోసార్లు, లెఖ్ఖలేనన్ని సార్లు చూశాను. ఆ సినిమా నా జీవితాన్ని ఎక్కువగా పోలివుంది. ఆ బిచ్ కామదాహం...చివరికి ఆమెను కళ్ళతో తరచూ వెంబడించిన ఆమె మరిదే ఆమె తలను ఘోరంగా నరికేస్తాడు. ఆ సినిమాలో మరిది అయితే, జీవితంలో నేను అలాంటి మానసిక సంఘర్షణకు గురైనాను. మరిది ఆమె తల నరికే దృశ్యం చూసినప్పుడల్లా నాలో ఉద్రేకం పరవళ్ళు త్రొక్కేది. నేనే స్వయంగా అలా తల నరికేసినట్టు, ఆ విధంగా నా కసి తగ్గుతున్నట్టూ భావించేవాణ్ణి"

అతనిలో పీఠం వేసుకున్న కసి, తత్కారణంగా పెరిగిపోయిన రాక్షసత్వం తలుచుకుని దీర్ఘంగా నిట్టూర్చాడు దివాకర్.

ఇంత చిన్న వయసులో అతను ఎదుర్కొన్న మానసిక సంఘర్షణ ఊహకు అందనిది! నిజమే! కాని చేసిన పనులకు ఫలితం అనుభవించక తప్పదు మరి.





52 సంవత్సరాల చరిత్రగల ఈ రైలింజన్ పేరు "అయిదవ జార్జి"

బొగ్గు గనుల్లో పని చేసి చేసి అలసిపోయిన ఈ పాత రైలింజన్ ఇప్పుడు పిల్లల ఆస్తిగా మారిపోయిం









పాము పామునే ఆహారం చేసుకుంటుందని మనకు తెలుసు. కాని, స్వయంగా ఆ తతంగం చూసిన వారు అరుదు. ఆ భయంకర దృశ్యాన్ని ఫొటోల్లో సవివరంగా చూడవచ్చు. ఈ ఫొటోలోని సర్ప రాజునే 'కింగ్ కోబ్రా' అంటారు.









'లేజర్' కిరణాల ప్రభావాన్ని కనిపెట్టే కృషిలో రూపొందిన అందమైన చిన్న అల్కహాల్‌తో వెలిగే దీపం ఇది.




75 సంవత్సరాల నాటి రష్యన్ నౌక జపాన్ తీరపరిధిలో సముద్రగర్భంలో కనుపించింది. అందులోంచి 25 కోట్ల రూపాయల విలువగల 'ప్లాటినం' బయటకు తీశారు జపానీయులు.

కొయ్య, గాజు, పింగాణీలతో తయారైన ఈ అందమైన పైపులు 19వ శతాబ్ది ప్రభువుల కోసం రూపొందించిన కళాఖండాలు.

జపాన్‌లో తయారైన ఈ మార్లిన్ మన్రో ఎలక్ట్రానిక్ విగ్రహం 45 రకాలుగా కదుల్తుంది.









మెక్సికోలో తయారు చేసిన ఈ బెలూనులో పూర్తిగా గాలి నింపితే ఎనిమిదంతస్తుల భవనం అంత ఎత్తు ఉంటుంది.

బ్రిటిష్ సముద్ర తీరంలో దొరికిన 15 అడుగుల పొడవుగల ఈ 'ఓర్ ఫిష్' వంటిది గత యాభై ఏళ్ళలో ఎక్కడా దొరకలేదట.



ఆమాత్రం ప్రణయకలాపం నాకూ చేతనవును లేవయ్యా ! ఈ మాత్రానికి అడ్డదార్లూ, దొడ్డిదార్లూ ఎందుకూ ? అంటున్నట్లున్నారు ఈ చింపాంజీగారు ఆ పై ప్రేమికుల్ని చూసి.





మంచుప్రాంతాల్లో పెరిగే ఈ ఎలుగుబంట్లు పసిపిల్లలు కావు. ప్రణయ కలాపం కూడా నేర్చిన అందమైన ఎలుగులివి.








హాస్య, వ్యంగ్య రచనలు చేయటంలో
మార్క్-ట్వెయిన్ అద్వితీయుడు.
"అమెరికన్ హాస్యానికి మంచి ఉదా
హరణ మార్క్-ట్వెయిన్" అనే పేరును
సంపాదించిన గొప్ప రచయిత అతను.

ఒక మిత్రుడు మార్క్-ట్వెయిన్ను-
తప్పుకు ఘోరమైన తప్పుకు తేడా
సోదాహరణగా చెప్పమన్నాడు.

వెంటనే మార్క్-ట్వెయిన్ "మీ
సిల్కు గొడుగును హోటల్లో మరచి,
మరెవరిదో పాత గొడుగుతో మీరు
బయటికెళితే అది తప్పు! అయితే-అసలు
గొడుగు లేకుండా వెళ్ళి మంచి గొడుగుతో
బయటికొస్తే అది ఘోరమైన తప్పు!"
అన్నాడట.

ఒక ఫ్రెంచి దేశస్థుడు మార్క్-

# రసగుళికలు



ట్వెయిన్‌ను ఎగతాళిచేస్తూ "మీ అమెరికా వాళ్ళు పనిలేనప్పుడల్లా – 'మా తాత ఎవరు?' అంటూ పెద్ద పెద్ద పరిశోధనలు చేస్తారు!" అన్నాడు.

వెంటనే మార్క్‌ట్వెయిన్ "మాకు మా నాన్నెవరో స్పష్టంగా తెలుసు కాబట్టే తాతెవరో తెలుసుకోడానికి ప్రయత్నిస్తాం. మీ ఫ్రెంచి వాళ్ళు అలాంటి పరిశోధనలు మొదలెడితే 'అసలు మా నాన్నెవరు?' అంటూ గందరగోళపడతారు" అన్నాడు. ఆ ఘాటుకు తట్టుకోలేక సదరు ఫ్రెంచి పెద్దమనిషి మెల్లిగా జారుకున్నాడు.

మార్క్‌ట్వెయిన్ హాస్య సంభాషణలు వినాలనే కుతూహలంతో ఎందరో ధనికులు అతన్ని అతిథిగా పిలిచి విందులుచేసి పెద్ద మొత్తాలు పారితోషికాలు

ఇస్తుండేవాళ్ళు.

ఒకసారి ఒక విందుకు అతిథిగా వెళ్ళిన మార్క్ ట్వెయిన్ సముద్రయానం చేసినవాళ్ళ సంఖ్య ఆ అతిథుల్లో ఎక్కువగా ఉందని తెలిసి 'పసిఫిక్ సముద్రమంటే నాకెందుకిష్టం?' అనే అంశం మీద మంచి సమాధానం చెప్పినవాళ్ళకి ఒక డాలర్ బహుమానం యిస్తానన్నాడు. ఆ హాస్య చక్రవర్తిని మెప్పించి బహుమతి పొందాలని అక్కడి అతిథులు పట్టుదలగా పోటీలుపడి తమకు తెలిసిన విషయాలన్నీ చెప్పారు. చివరకు మార్క్ ట్వెయిన్ తన డాలర్‌ను ఒక వ్యక్తికి బహుమతిగా ఇచ్చాడు. ఆతిథ్యమిచ్చిన వ్యక్తి అది చూసి "మిస్టర్ ట్వెయిన్! చిల్లిగవ్వ ఖర్చు పెట్టని నువ్వు ఇంత చిన్న ప్రశ్నకు డాలర్ బహుమతిగా ఇవ్వటం ఆశ్చర్యంగా ఉందే" అన్నాడు వీడ్కోలు చెబుతూ.

"నేనొక మాగజైన్‌కి యిదే టాపిక్ మీద వ్యాసం రాయటానికి వంద డాలర్లు అడ్వాన్సు పుచ్చుకున్నాను! ఒక వ్యక్తికి తెలిసిన విషయంకన్నా పాతిక మందికి తెలిసిన విషయం ఎక్కువ విలువైనది కదా!" అన్నాడు మార్క్ ట్వెయిన్ మెల్లిగా అక్కడినుంచి జారుకుంటూ.

ఒకసారి మార్క్ ట్వెయిన్, విస్లర్ అనే పెయింటర్ స్టూడియోకి వెళ్ళాడు. అతను అప్పుడే ఒక పెద్ద తైలవర్ణ చిత్రం గీయటం పూర్తి చేశాడు. అందులో చిత్రించబడిన ఒక అందమైన యువతి రూపం మరీ జీవకళ ఉట్టిపడుతుండటంతో ఆ బొమ్మను చేతితో తాకి చూస్తున్నాడు మార్క్ ట్వెయిన్.

చిత్రకారుడు వెంటనే "మిత్రమా! ఆ బొమ్మ ఇంకా తడారలేదు, జాగర్త!" అన్నాడు హెచ్చరికగా.

మార్క్ ట్వెయిన్ "ఆ మాత్రం నాకు తెలియదు టోయ్! నా చేతికి గ్లోవ్స్ ఉన్నాయిలే!" అన్నాడు నవ్వుతూ.

మార్క్ ట్వెయిన్‌కు యువతీ యువకుల్లో చాలామంది అభిమానులుండేవాళ్ళు. ఒకసారి ఓ కళాశాల అమ్మాయిలు "పరీక్షలు దగ్గరికొస్తుంటే మాకు భయంతో నిద్ర పట్టడంలేదు! మా బాధా నివారణకేమైనా తరుణోపాయం తెలుపండి!" అంటూ రాశారు.

వెంటనే మార్క్ ట్వెయిన్ "ఫలానా కంపెనీ ఫ్యాన్సీ బెల్టులు నడుముకు పెట్టుకుని పడుకోండి. తప్పక భయంపోయి నిద్ర పడుతుంది" అంటూ రాశాడు.

ఓ వారం తరువాత మార్క్ ట్వెయిన్‌కు అక్కడి నుంచి మళ్ళీ అమ్మాయిలు ఉత్తరం రాస్తూ "మీరు చెప్పినట్టే అంత ఖరీదైన బెల్టులు వాడినా మాకెవరికీ ఏ విధమైన లాభం కలగలేదు. ఇందుకు మీ వివరణ కావాలి" అంటూ రాశారు.

వెంటనే మార్క్ ట్వెయిన్ "మీరు కొన్న ఆ బెల్టులు తయారుచేసే కంపెనీలో నేను షేర్లు కొన్నాను. ఎవరో ఒకరు నష్టపోంది కంపెనీకి లాభాలెలా వస్తాయి!" అంటూ చమత్కరించాడు.

సాహిత్యాన్ని గురించి మాట్లాడమని, ఒక సాహిత్య సంఘం వాళ్ళు మార్క్ ట్వెయిన్‌ను పిలిచి పారితోషికం మాత్రం చాలా తక్కువ యిచ్చారు. అతనికి కడుపు మండి ఉపన్యాసం చివర్న ఇలా అన్నాడు– "పాపం సాహితీ వేత్తలెవరూ సుఖపడ్డట్టు కనబడరు. మన సాహితీ వేత్తలంతా కటిక పేదరికాన్నే చవిచూసి చచ్చిపోయారు. మీ సాహితీ సంఘం రచయితలకు యిచ్చే ఆర్థిక




ప్రోత్సాహం చూస్తే అసలు సాహితీ వేత్తలు పుట్టటానికే భయపడతారేమో! నా ఆరోగ్యమూ బాగుంటంలేదు. అందుకే ఈ సభ ముగిశాక యిక నేను రచనలు చేయకూడదనుకుంటున్నాను"

"యుద్ధం వస్తే ఒక ఆదర్శ రచయితగా మీరేం చేస్తారు? నిజం చెప్పండి!" అంటూ ఒక పత్రికా విలేఖరి మార్క్ ట్వెయిన్‌ను అడిగాడు ఇంటర్వ్యూలో.

"యుద్ధం వస్తే మనమంతా ముందు మన దేశాన్ని రక్షించుకోవాలి. అందుకోసం చిన్నా పెద్దా, స్త్రీ పురుషులనే భేదం లేకుండా అందరూ యుద్ధ రంగానికి ధైర్యంగా కదలి వెళ్లాలి. ఇలా దేశాన్ని మొత్తంగా ఆయత్తం చేయటానికి నేను పత్రిక ఆఫీసులో కూర్చొని దేశభక్తిని ప్రబోధించే రచనలు చేస్తాను" అన్నాడు మార్క్ ట్వెయిన్.

ప్రముఖ అమెరికన్ కథా రచయిత ఓ హెన్రీ కూడా మంచి హాస్యప్రియుడు!

ఓ హెన్రీ కథల ప్రాచుర్యాన్ని ఆధారం చేసుకుని తమ సర్క్యులేషన్ పెంచుకోవాలని, ప్రతి పత్రికా సంపాదకుడూ అతని దుంప తెంచేవాళ్ళు! కొంచరైతే ప్రతిరోజూ సాయంత్రం మంచి రెస్టారెంట్‌లో గొప్ప డిన్నర్లు యిప్పించి ఖర్చులు భరించేవాళ్లు! ఓ హెన్రీ అడిగిన ప్రతి సంపాదకుడిని కాదనలేక, మొహమాట పడి, అడ్వాన్సుగా డబ్బు పుచ్చుకునేవాడు. దానితోపాటు వచ్చినప్పుడల్లా మంచి భారీ డిన్నరుకూడా అందుకునేవాడు.

ఒకరోజు ఓ హెన్రీని ఒక ప్రముఖ పత్రికా సంపాదకుడు న్యూయార్క్ నగరంలోని ఓ మారుమూల ప్రాంతంలో వున్న ఒక పెద్ద హోటల్‌కు కాపులో



తీసుకు వచ్చాడు. అక్కడ తక్కిన పత్రికల సంపాదకులు ఎవరూలేరని సంతోషిస్తుండగా ఇంతలో "ఓ హెన్రీ గారూ! మేము ఎనిమిది మందిమి మీ కోసం ఈ హోటల్లో ఎదురు చూస్తున్నాం!" అన్నాడొక వ్యక్తి.

"ఎవరతను?" అన్నాడు అభ్యాగతుడైన ఎడిటర్ ఆశ్చర్యంగా.

"ఇంకెవరు! మీ పోటీ పత్రికల ఎడిటర్లు నా కథలు తేవటం కోసం ఏర్పాటు చేసిన ఏజంట్లే!" అన్నాడు ఓ హెన్రీ బాధగా.

అభ్యాగతుడు అదిరిపడ్డాడు ఆ మాటలతో. ఇంతలో ఇద్దరు కొత్త వ్యక్తులొచ్చి ఓ హెన్రీ పక్కటేబిల్ వద్ద

కూర్చున్నారు. ఆ యిద్దరూ ఓ హెన్రీ వైపు నవ్వుతూచూస్తూ "గుర్తున్నామా ఓ హెన్రీగారూ?" అన్నారు ముక్తకంఠంతో. వెంటనే ఓ హెన్రీ తన పక్కనేవున్న అభ్యాగతితో "ఇందాక చెప్పిన సంఖ్య ఎనిమిదికి వీళ్ళిద్దరినీ చేర్చండి!" అన్నాడు మెల్లిగా.

ఓ హెన్రీ చెక్కు పుచ్చుకుని "నవల రాద్దామని మొదలుపెట్టాను! మీరొచ్చి దీన్ని బుల్లికథగా ముగించమంటున్నారు!" అన్నాడట బాధగా.

ఎడిటర్ మొండికేసి అలాగే కూర్చున్నాడట. చేతిలో చెక్కు పటడంతో ఓ హెన్రీకి ఇక కూర్చోబుద్ధి కాక మెల్లిగా




లేచి వెళ్ళబోతున్నాడట. ఆశాభంగం పసిగట్టిన ఎడిటర్ కోపం పట్టలేక "మిస్టర్ ఓ హెన్రీ! మర్యాదగా నేను కోరిన కథ యిస్తారా సరే! లేకపోతే ఈ కోపంలో మిమ్మల్ని కాలితో తన్నగలను" అన్నాట్ట లేచి నిలబడి. వెంటనే ఓ హెన్రీ నవ్వుతూ "నువ్వు కాలితో చేసే పనంత తేలిక కాదయ్యా నా చేతితో చేసే పని. అంత తేలిక పనైతే ఎప్పుడో పూర్తి చేసి ఉందును" అన్నాట్ట బయటికి వెళ్ళిపోతూ.

ఓ హెన్రీ కథల్లో ముగింపు సడన్‌గా వచ్చినట్లుంటుంది. అయితే ఇదో మంచి కథా లక్షణంగా ఓ హెన్రీ తన కథలను రాసేవాడు. కాని నిజానికి అసలు కారణం వేరే వుంది! ఓ హెన్రీ కథ కొంత రాస్తుండగా ఏ పేపరు సంపాదకుడో వచ్చి తొందర చేసి, గొడవపెట్టి, అప్పటికప్పుడు ఇంకా పెద్దమొత్తం చెక్కుగా యిచ్చి, అంతవరకు రాసిన ఆ కథనే ఎలాగో ముగించి 'అయిపోయింది' అనిపించమని గొంతు మీద కూర్చునేవాడట!

ఒకసారి ఒక ఎడిటర్ స్వయానా వచ్చి ఓ హెన్రీ ఎదురుగా కూర్చొని "ఇప్పుడు మీ చేతిలో కథ ఉన్న పళాన ముగించి నన్ను పంపండి!" అన్నాడట-ఓ పెద్దమొత్తం చెక్కుగా ఇచ్చి.

తన కథా సంకలనానికి పీఠిక ఒకటి రాయమని కోరిన ఓ ఔత్సాహిక కథారచయిత ఓ హెన్రీతో "నేను చాలా చిన్నవాణ్ని! ఇప్పట్లో మీకు పారితోషికం యివ్వలేను" అన్నాడట వినయంగా.

వెంటనే ఓ హెన్రీ "తొందరేం లేదు! నువ్వు పెద్దవాడివయ్యాకే పీఠిక రాస్తాలే... గుడ్‌బై!" అన్నాడట నవ్వుతూ.

ఒకప్పటి అమెరికా ప్రెసిడెంట్ థియోడర్ రూజ్‌వెల్ట్ కూడా మంచి హాస్యప్రియుడు. చిన్నప్పుడు ఈయన రిపబ్లి




కన్ పార్టీ అభ్యర్థికొకరికి ఒక కుక్కపిల్లనిచ్చాడు. అప్పటికది కళ్ళు కూడా తెరవనంత చిన్నపిల్ల.

ఆ పార్టీ వ్యక్తి, ఆ కళ్ళు తెరవని కుక్కపిల్లను తీసుకుంటూ "ఇది ఏ పార్టీ కుక్కపిల్ల?" అంటూ అడిగాడు.

"ఇది రిపబ్లికన్ పార్టీ కుక్కపిల్ల" అన్నాడు రూజ్‌వెల్ట్.

ఈ సంగతి డెమొక్రాటిక్ పార్టీ వ్యక్తికి తెలిసి తనూ ఓ కుక్కపిల్లను రూజ్‌వెల్ట్ దగ్గరనుంచి అడిగి తీసుకోవాలనుకున్నాడు.

ఎలక్షన్లు బాగా దగ్గర పడ్డాక ఒక రోజు ఒకే వేదికమీద ఉపన్యాసం యిచ్చారు ఆ ప్రత్యర్థులిద్దరూ. అందులో డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థి రూజ్‌వెల్ట్ దగ్గరున్న మరో కుక్కపిల్లను తీసుకుంటూ "ఇదే పార్టీ కుక్కపిల్ల!" అన్నాడు.

"ఇది నిస్సందేహంగా డెమొక్రాటిక్ పార్టీకి చెందిందే!" అన్నాడు రూజ్‌వెల్ట్.

"మరి దీని తోటికుక్కపిల్లను నాకిస్తూ అప్పుడది రిపబ్లికన్ అన్నావు" అన్నాడు రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి

"ఔనుసార్ ! అప్పటికి ఇంకా కళ్లు తెరవలేదుగదా ఆ కుక్కపిల్ల!" అన్నాడు రూజ్‌వెల్ట్.

పెద్దవాడయ్యాక రూజ్‌వెల్ట్ రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా పోటీ చేస్తూ డెమొక్రాటిక్ పార్టీని దుమ్మెత్తిపోస్తున్నాడు ప్రెసిడెంట్ ఎలక్షన్‌లో.

మియామీ అనే చోట కిక్కిరిసిన సభికుల ముందు ఓ అరగంట రిపబ్లికన్ పార్టీని పొగిడి, డెమొక్రాటిక్ పార్టీని ఘాటుగా విమర్శించి "మీలో ఎవరైనా డెమొక్రాటిక్ పార్టీ వాళ్ళున్నారా?" అన్నాడు.

అయితే ఎవరూ ఊహించనట్టు గిరజాల జుట్టు వృద్ధుడొకడు లేచి నిలబడి "నేను డెమొక్రాట్‌ను. నా తండ్రి, తాత డెమొక్రాట్‌లు!" అన్నాడు మొండిగా. అయితే రూజ్‌వెల్ట్ ఏం కంగారు పడకుండా "అయితే మీ తాత గుర్రాల దొంగయితే, మీ నాన్న గుర్రాల దొంగయితే నువ్వూ గుర్రాల దొంగవుతావా?" అన్నాడు.

ఆ మనిషి కంగారుపడిపోతూ "అయితే నేను రిపబ్లికన్‌గానే ఉండిపోతాలెండి!" అన్నాడు.

రూజ్‌వెల్ట్ అమెరికా ప్రెసిడెంట్ అయినపుడు వైట్‌హౌస్‌లోని ఆయన పెద్ద ఆఫీసు గదిలో వెండిదిమ్మెలతో అందంగా వుండే కొవ్వొత్తుల దీపాల చెట్టు లాంటిది ఉండేది. కిటికీ తలుపులు తీయటానికి వీలు లేకుండా అడ్డంగా వున్న ఆ అలంకారాన్ని చూసిన రూజ్‌వెల్ట్ "ఇదెందుకయ్యా యీ గదిలో? ఇది తీసి మరోచోట పెట్టండి" అన్నాడు విసుగ్గా.

రూజ్‌వెల్ట్‌కి ప్రకృతి సహజమైన గాలి వెలుతురంటే యిష్టమని తెలిసిన నౌకర్లు "ఈ దీపాలచెట్టు తమరెక్కడ పెట్టమంటే అక్కడే పెడతాం! చెప్పండి సార్!" అన్నారు వినయంగా.

వెంటనే రూజ్‌వెల్ట్ "ఆ మాత్రం తెలియదా! వైస్ ప్రెసిడెంట్ గదిలో పెట్టి దీపాలు పగలే వెలిగించండి. అలాగన్నా ఆయన కాస్సేపు మేల్కొని వుంటాడు!" అన్నాడు నవ్వుతూ.

రూజ్‌వెల్ట్‌కు వేటంటే యిష్టం. ఒకసారి ఒక మంచి వేటగాడు ఇంగ్లాండ్ నుంచి అమెరికాకు వస్తే పిలిచి అతనితో

ఓ రెండు గంటలు పిచ్చాపాటీ మాట్లా డాడు.

సమావేశం ముగిశాక పేపర్లవాళ్ళు గుంపుగా వచ్చి "ప్రెసిడెంట్‌గారూ! మీ సమావేశ సారాంశం చెబుతారా" అన్నారు.

చివరికతను "మీరు గొప్ప నాటక రచయితనని చెప్పుకుంటారుగా? ఇప్పుడు నా సంభాషణ విన్నారుకదా! మీకూ, నాకూ భేదం ఏమిటో చెప్పండి. విని సంతోషిస్తాను" అన్నాడు.




రూజ్‌వెల్ట్‌కి ఒళ్ళు మండి "ఇందులో పెద్ద విశేషం ఏంలేదు! అతను నా పేరడి గాడు, చెప్పాను...అంతే!" అన్నాడు.

పేపర్లవాళ్లు నవ్వుకుంటూ వెళ్ళి పోయారు.

ఆంగ్ల నాటక రచయితల్లో షేక్‌స్పియర్ తరువాత సాహిత్యంలో అంత స్థానం ఆక్రమించినవాడు. జార్జిబెర్నార్డ్‌షా ఒక్కడే! షా మంచి హాస్య ప్రియుడు!

షా ఒకసారి డిన్నర్ పార్టీకి ముందు గానే చేరుకున్నాడు. దురదృష్టవశాత్తు అక్కడ ఆయనకు ఒక పెద్ద వాగుడు కాయ పరిచయమై, తనకు ప్రపంచం లోని సమస్త విషయాలూ తెలుసునన్నట్టు ఓ గంట అనర్గళంగా 'బోర్' అని పించేలా మాట్లాడాడు.

షా ఓపిగ్గా విన్నట్టు నటించాడు.

వెంటనే షా "నువ్వు గంటసేపు మాట్లాడావు. అయినా, నువ్వు పెద్ద బోర్‌గాడివనే నిజం నీకు తెలియదు! ఆ సంగతి నువ్వు సంభాషణ మొదలు పెట్టిన అర నిముషంలోనే నేను తెలుసు కున్నా. మనిద్దరికీ అదే భేదం!" అన్నాడు. ఆ దెబ్బతో ఆ బోర్‌గాడు చక్కా తోక ముడిచాడు.

షాకు, అమెరికన్లన్నా, అమెరికా జీవిత విధానమన్నా, వాళ్ళ ఆచార వ్యవహారాలన్నా చులకన. అందుకనే వీలు చిక్కినప్పుడు, చివరికి నాటకాల్లో కూడా పాత్రలచేత ఘాటుగా అమెరికాను దుయ్యబట్టేవాడు. అందుకే అమెరికా పత్రికా సంపాదకులకు షా అంటే కడుపు మంట. ఒకసారి షా మియామీ అనే ప్రాంతాన్ని దర్శించటానికి వెళ్ళినట్టు వార్త రాగా ఒక పత్రికాధిపతి, షాకేమీ ప్రాధాన్యత ఇవ్వకుండా "శ్రీమతి షా మియామీని దర్శించారు. అక్కడ ఆమెకు ఘనమైన స్వాగతం లభించింది. ఆమెను ఓ సాహితీ సంఘం ప్రత్యేకంగా ఆహ్వా నించింది. ఈ సందర్భంగా ఆమెకో

పెద్ద విందు ఏర్పాటు చేశారు. ఆమెతో పాటు షా అనబడే ఓ రచయిత కూడా ఉన్నాడు" అంటూ పత్రికలో వార్త ప్రచురణ చేశాడు.

తనకేమీ ప్రాధాన్యత లేకుండా తన పేరు ఎక్కడో ఓ మూల యిరికించటం చూసి షా బాధపడాలని ఆ పత్రికాధిపతి అలా రాశాడు.

ఇదే విషయం మరో పత్రికాధిపతి షాను ఇంగ్లండ్‌లో ప్రశ్నిస్తే "స్త్రీలకు ప్రథమ తాంబూలం ఇవ్వటం అనే సభ్యతను మననుంచి నేర్చుకోడానికి అమెరికావాళ్ళు ప్రయత్నిస్తున్నారనటానికి ఇదే మంచి ఉదాహరణ" అన్నాడు నవ్వుతూ.





షా నాటకాలు సాహిత్యపరంగాపొందిన గుర్తింపు, ప్రదర్శించినప్పుడు ప్రేక్షకుల నుంచి పొందలేదు. అయినా షా అనేక వ్యయప్రయాసలకుఓర్చి, తన నాటకాల్ని తనే ప్రదర్శించుకునేవాడు మొదట్లో.

ఓసారి ఓ నాటకాన్ని ఎనిమిది మంది నటులు కలిసి ప్రదర్శన ఇస్తే, ఆ నాటకం చూడటానికి ఎనిమిది మందే ప్రేక్షకులు విచ్చేశారట!

ఒక పత్రికా విలేఖరి ఈ సంగతి తెలిసి ఎగతాళిగా "ఏంసార్! మీ నట బృందానికి ప్రేక్షకాదరణ ఎలా వుందేమిటి?" అన్నాట్ట షాతో.

"ఇరు పక్షాలూ ప్రస్తుతానికి సమానంగా ఉన్నాయి! అయినా భవిష్యత్తు మీద గట్టి నమ్మకముందిలే!" అన్నాట్ట షా గడుసుగా.

ఒక కార్మిక సంఘం షాను ఒక సమావేశానికి ఆహ్వానించి మాట్లాడమంది.

షా అనర్గళంగా మాట్లాడుతూ, "సోదరులారా! మీకార్మిక వర్గాన్ని దోచుకుంటున్నది ధనిక వర్గమే! మీరెంతో శ్రమిస్తే మీ శ్రమశక్తిని అనుభవిస్తూ దోపిడీదారులైన ధనిక స్వాములు కార్లలో తిరుగుతూ హాయిగా వుంటున్నారు. మీకు కనిపించే కార్లను రూపుమాపండి. అయితే మీరు ఆహ్వానిస్తే వచ్చాను గనుక బయట ఉన్న నా ఎర్ర కారు జోలికి మాత్రం పోకండి!" అన్నాట్ట.

—ఎం. డి. సౌజన్య

# పరిష్కారం

యస్. వి. ఎ. ఖానిగారి ఆఫీసు అట్ట హాసంగా వుంది. లేడీ సెక్రటరీతో సహా.

సమస్యలు తేలిగ్గా పరిష్కరిస్తాడంటే ఆయనకు ఎంత అనుభవంవుందో,కనీసం యాభై, అరవై యేళ్ళ వాడైనా అయివుం డడా అనుకున్నాను. తీరా చూస్తే ముప్పై యేళ్ళన్నా లేవు.

వెళ్లీ వెళ్లగానే ఈ కుర్రకుంక దగ్గర నా సమస్య గురించి వాగట మెందుకు ముందు అతని సరుకెంతో చూడాలన్పిం చింది. "చూడబ్బాయ్ నీవు తెలుగు చక్కగా మాట్లాడుతున్నావు గదా, తెలుగు వాడివేనా? మరి పేరలా వుందేం? అనడిగాను.

అతను నవ్వి "నేను నూరు పైసలా తెలుగు వాడినే. అసలు పేరు శృంగ వరపు వెంకటావధాని. తెలుగు దేశంలో ఉత్తరాది వారికే గౌరవం. నేను తెలుగు దేశంలో బిజినెస్ చేయ బోతున్నాను కాబట్టి పేరు అలా మార్చుకున్నాను. ఇండియాలో యమ్. ఎ. పొలిటిక్స్ చదివి, అమెరికా వెళ్లి 'జాకాల్' యూని వర్శిటీలో భారతీయుల, ప్రత్యేకించి తెలుగు వాళ్ళ సమస్యలమీద రీసర్చి చేసి డాక్టరేట్ సంపాదించాను. ఇంతకీ మీ సమస్య గురించి చెప్పారు కాదేం ?" అన్నాడు.

"చెబుతాను గానీ నా సమస్య నాకు తప్ప మూడోవాడికి తెలియ కుండా వుంటుందా? ఈ గదిలో టేప్ రికార్డర్ ల్లాంటి వేమీ లేవుగదా? నేను నీ దగ్గర





# చతుర

సలహా కోసం వచ్చినట్లు ఆఖరుకు ప్రచా రం కోసం కూడా ఎవరికీ చెప్పవు కదా?" అనడిగాను.

యస్. వి. ఎ. ఖాని చిరునవ్వు నవ్వుతూ "మీరు నన్ను పూర్తిగా విశ్వ సించి మీ సమస్య చెప్పవచ్చు. ఈ సంగతి ఎవ్వరికీ, ఎప్పటికీ తెలియదు. మీరే స్వయంగా ఎవరికైనా చెప్పుకుంటే తప్ప" అన్నాడు.

"సరేనయ్యా నా సమస్య చెబుతాను. జాగ్రత్తగా విను. ఈ వూళ్ళో నాకు చాలా బ్రాందీ షాపులున్నాయి. అందులో ఒకటి మాంచి సెంటర్లో వుంది. అది బంగారు గుడ్లు పెట్టే బాతనుకో. వెధవలు కొందరు



నేనంటే గిట్టని వాళ్లు నా బాతుని చంపా లని చూస్తున్నారు. అదయ్యా నా సమస్య".

"ఊఁహూఁ?"

"అక్కడ ఎప్పటిదో చాలా పాతకాల పుది ఒక దేవాలయం వుంది. దేవాలయం ఎదురుగ్గా బ్రాందీ షాపు వుండరాదని

# కతలు

మద్యపాన నిషేధసంఘం వాళ్ళు గొడవ చేస్తున్నారు. అక్కడ ఆ గుడి వుండటం వల్లనే పోలీసులూ, మినిష్టర్లూ కూడా నాకేమీ సహాయంచెయ్యలేక పోతున్నారు. నా షాపు అక్కణ్నించి తీసేస్తే నా లాభాలు తగ్గి పోవటమే కాక పరువు నష్టం కూడా. అంచేత నా షాపు అక్కడ నుంచి కదల గూడదు.''

"ఆమద్యపాన నిషేధ సంఘం వాళ్లని బుట్టలో వేసుకుంటే సరిపోతుంది గదా!" అన్నాడు యస్. వి. ఎ. ఖాని.

"వాళ్లంత తేలిగ్గా బుట్టలో పడరు. వాళ్లు తినరు మరోళ్ళని తిననివ్వరు. వాళ్ళ నిరుద్యోగ బంధువులకు ఉద్యోగా



లిప్పిస్తానన్నాను. వాళ్లు కోరినంత డబ్బిస్తానన్నాను. అవేమీ వాళ్ళమీద పని చెయ్యలేదు."

"ఇన్ని బ్రాందీషాపుల్ని నడుపుతున్నారంటే మీ చేతుల్లో తప్పకుండా కొందరైనా గూండాలుంటారు గదా. మరి ఆ మద్యపాన నిషేధంగాళ్ళ నొక పట్టు పట్టించ లేక పోయారా?"

"అది నా ఆశయాలకే విరుద్ధం నాయనా. ఈ విషయంలో నేను శుద్ధ గాంధేయ వాదిని. నేను హింస చెయ్యను. చేయించలేను. ఒకవేళ నీవు చెప్పినట్లే అలా చేయించినా, వాళ్ళంతా బక్క పీనుగులే అయినా వాళ్ళ నోళ్లు మాత్రం బహు పెద్దవి. పైగా ఈ పత్రికల వాళ్ళొకళ్ళు. వీళ్ళంతా ఆ బక్క వెధవల్నే సపోర్టు చేస్తారు"

"అయితే సమస్య జటిలంగానేవుండే. సరే! రూలేమిటి? 'గుడికి దగ్గరగా బ్రాందీ షాపులుండకూడదూ' అని. దాన్ని మనం తిరగేసి చదువుదాం. 'బ్రాందీ షాపుల దగ్గరగా గుడులూ, గోపురాలూ వుండకూడదూ' అని. ఆ సెంటర్లోంచి గుడి లేపేస్తే సరి. ఇంక మీ బ్రాందీ షాపు శాశ్వతంగా అక్కడే వుంటుంది ఏమంటారు?"

ఆనందాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరై పోయాను. "నిజంగా ఎంత మంచి అయిడియా! సింపుల్! అమలు జరపటం కూడా చిటికెలోపని. మా గూండారావుకు చెబితే రాత్రికి రాత్రే గుడిని లేపేస్తాడు. గుడిని లేపేస్తే ఏమవుతుంది? మహా అయితే ఒక చిన్న మతకలహం రేగవచ్చు. మతకలహాలు రేగితే వాటిని అణచాల్సిన బాధ్యత గవర్నమెంటుదిగాని నాది కాదుగదా. ఒకసారి గుడి లేపేస్తే మళ్ళా అక్కడ గుడి కట్టకుండా చూసుకోగలననే ధైర్యం నాకుంది. మళ్ళా గుడి కడితే మళ్లా మత కలహాలు రేగుతాయనే వంకతో గుడికట్టకుండాఆపుచెయ్యొచ్చు!' మాట్లాడకుండా అయిదు వేలు తీసి టేబుల్ మీద ఉంచాను.



ఇలాంటి సమస్యలొస్తే మీరు కూడా యస్. వి. ఎ. ఖానిగారిని కలవండి. మీ సమస్యలు చిటికెలో పరిష్కారమౌతాయి.

—గుంటక సాంబిరెడ్డి.

# మూలికా మహత్మ్యం

ఆఫీసులో ఓ అపరిచితుడు అడుగు పెట్టాడు. గావంచు నీరుకావి గోచిపంచ. అలాంటి మరో పంచ పైన కప్పుకున్నాడు. తలమీద జుట్టు ముడి వేసి కట్టినాడు. మొహంమీద దట్టంగా విభూతి రేఖలు, వాటి నడుమ గంధపు అడ్డు చారలు, వాటి మధ్యలో అక్షింతల బొట్టు. దాని పై కొద్దిగా కుంకుమ, చెవిలో ఎర్రగన్నేరు పువ్వు. మెడలో గచ్చకాయ ప్రమాణం గల రుద్రాక్షల మాల. కుడి ముంజేతికి చిన్న సైజు రుద్రాక్షల సరం చుట్టినాడు. కుడిచేతిలో చిన్న కృష్ణాంజినం పెట్టె. ఎడమ చంకకు ఒక జోలి. ఇది అతని ఆకారం. ఆయన తిన్నగా నా దగ్గర కొచ్చి "దీర్ఘాయు ష్మాన్ భవ" అంటూ బల్ల ముందు వున్న కుర్చీలో కూర్చొన్నాడు. తరువాత కృష్ణాంజినం పెట్టెను, జోలిని బల్లమీద దించాడు. నాకేదో రహస్యం చెబుతున్నట్టు 'చూడు నాయనా శుభ ప్రదమయిన, లాభ పరమయిన యంత్రములున్నయ్, చక్రములున్నయ్, మూలికలున్నయ్' అంటూ జోలిలో చేయి వేసి కొన్ని మూలికలు తీసాడు.

నాకటివంటి వాటిల్లో నమ్మకం తక్కువ. అదే చెప్పా సున్నితంగా 'అబ్బే అలా అనరాదు నాయనా. ఇవన్నీ చాలా మహత్తుగలవి' అన్నాడు. ఆఫీసులోని కొందరు గుమాస్తాలు చుట్టూ మూగారు.

ఆయన ఒక్కొక్క మూలికే చూపిస్తూ వివరించి చెపుతున్నాడు. చూడు నాయనా, ఇది ఆదిలాబాద్ అడవుల్లో దొరకింది. దీనిపేరు సరస్వతీ ప్రసాదం. దీన్ని నీపిల్లల పెట్టెల్లో వుంచు. వారన్ని క్లాసుల్లోనూ ఫస్టే ననుకో. ఇదిగో దీని పేరు లక్ష్మీకటాక్షం. అరకు లోయనుంచి తెచ్చింది. దీన్ని ఇంట్లో దేవుడి ముందుంచి పూజ చేస్తుంటే ఇంటి నిండా ధన రాసులే ననుకో. దీన్ని చూడు. అశ్వినీ రసం. నీలగిరి కొండల్లోనిది. దీన్ని ఎప్పుడూ జేబులో వుంచుకొంటే ఇంక రోగమనేది నీ దరిదాపుల్లోవుండదు. ఇదేమో కామరాజు బీజం. హిమాలయాల్లోనే దొరకేది. ఇది దగ్గర వుంటే అందరూ నీకు వశీకరణమవుతారు.'

తర్వాత తాయెత్తులు బయటి కొచ్చాయి. వాటిని చూపిస్తూ 'ఇవి రుద్రవరం తాయెత్తులు. ఒకదానిని ఇంటి తలవాకిట కట్టావంటే, భూతప్రేతాలూ, దుష్టగ్రహాలు, అన్నీ ఆమడల దూరం పారి పోతాయి.'

ఈ రీతిగా ఆయన అన్నిటినీ వర్ణిస్తూ వున్నాడు. ఒకరిద్దరికి వీటిలో గురి కలిగింది. వారడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానాలిస్తున్నాడు.

ఒక గుమస్తా ఒక లక్ష్మీకటాక్షం మూలికకొన్నాడు-రూపాయ పెట్టి. మరొక గుమస్తా కామరాజు బీజంకొన్నాడు—రెండు రూపాయలిచ్చి. మరో యిద్దరు మూలికలు కొన్నారు. ఇదంతా తమాషాగా వుంది నాకు.

ఇంతలో యల్దిసి మూర్తి వచ్చాడు.





అతని రాక గమనించి 'ఏమూలిక కావాలి నాయనా?'అని అడిగాడు.

కాని మూర్తి చేతిలో అప్పటికే ఒక మూలిక ఉంది. అది చూపుతూ 'స్వామీ! ఈ మూలిక నేమంటారు?' అన్నాడు.

స్వామి దానిని చేతికి అందుకొని ఇటు అటు తిప్పిచూసి 'ఇది చాలా అద్భుత మూలిక నాయనా! దీన్ని సౌ భా గ్య వల్లి అంటారు. దీనివల్ల సర్వ సౌభాగ్యాలు కలుగుతాయి. అన్ని కోరికలు ఈడేరుతాయి. భయాలన్నీ తొ ల గి



పోతాయి. ఇది నీకెక్కడిది నాయనా! నాలాంటి వాడికి యివ్వరాదూ?' అన్నారు.

"స్వామీ! కటారు పల్లెలో వేమన యోగి సమాధి దగ్గర పూజచేస్తూ వుంటాడు చూడండి వీరాస్వామి. ఆయన ఆ శీ ర్వ దిం చి ఇచ్చిన మూలిక ఇది" అన్నాడు మూర్తి.

'చూశావా నాయనా, నేను దీన్ని చూడగానే మహత్తు కనిపెట్టా. నీవు చాలా అదృష్టవంతుడివి. దీన్ని భద్రంగా దాచుకో దీంట్లో నాకొక చిన్న ముక్క ఇవ్వు నాయనా. ఊరికే కాదులే- ఐదు రూపాయలిస్తా' అన్నాడు స్వామి.

'అలా ఇవ్వలేను స్వామి, వీరస్వామి గారు దీన్ని భద్రంగా దాచు. ముక్కలు చేయకు. చేస్తే దీని మహత్తు పోతుంది'- అన్నారు.

'అదీ నిజమే నాయనా. నేను మరి చాను. అది అంతే. సౌభాగ్యవల్లి మూలిక తెచ్చిన తరువాత పూజ చేసి వాడాలి. ఆయన పూజ చేసిన తరువాతే నీకు ఇచ్చి వుంటాడు. పూజ అయినాక ముక్కలు చేస్తే అదింక పనికిరాదు. దీన్ని నీ దగ్గరే వుంచు" అని ఆ స్వామి వెళ్ళిపోయాడు.

ఆఫీసులో గుమాస్తాలంతా ఈ మూర్తి అంత ప్రభావంగల మూలిక ఎలాసంపాయించాడా అని ఆ శ్చ ర్య పో తూ, అతన్నించి ఒక పార్టీ కొట్టేయాలని ప్లాను వేశారు. కాని ఆ స్వామి అటు వెళ్ళగానే మూర్తి తన చేతిలోని మూలికను కిటికీ నుంచి బయటికి విసిరేశాడు.

'అదేంపని'! అందరూ అరిచారు.

'అంతే! దానిపని అయిపోయింది. పది నిమిషాలముందు అది ఎక్కడ వుందో, ఎక్కడ నుండి నేను తెచ్చానో అక్కడికే పంపాను దాన్ని" అన్నాడు మూర్తి.

-పాణ్యాం రామశేషశాస్త్రి

# బేతాళ కథ

పట్టువదలని విక్రమార్కరావు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపైనుంచి డెడ్ బాడీని దించి భుజాన వేసుకుని ఎప్పటి లాగా నోర్మూసుకుని శ్మశానానికేసి బైలు దేరాడు. అప్పుడు శవంలోని బేతాళ్ "బాసూ! యిలా నైట్ డ్యూటీతో ఈ శ్మశానంలో ఎంతకాలం తిరుగుతావు? నీకు బోరు కొట్టకుండా ఒక స్టోరీ చెబుతాను వినకూడదూ?" అంటూ మొదలు పెట్టాడు.

"అనగనగా ఒక గురువుగారు ఉండే వారు. ఆయన దగ్గర ముగ్గురు స్టూడెంట్స్ ఉండే వాళ్ళు. ముగ్గురూ మూడురకాల విద్యలు నేర్చుకొని, డిగ్రీలు పుచ్చుకుని, ఉద్యోగం కోసం వేటకు బైలు



దేరారు. అలా పోతూ ఉంటే ఓ ఫారెస్టొచ్చింది. అందులోంచి పోతూ ఉంటే ఒక పాడుబడ్డ గుడి తగిలింది. ఆ పూటకి అక్కడే కాఫీ, టిఫినులు కానిచ్చి (వెంట తెచ్చుకున్నారు లెండి) పడుకున్నారు. వంతుల వారీగా ఆ రాత్రికి ఒక్కొక్కళ్ళు నైట్ వాచ్‌మన్ డ్యూటీ వేసుకున్నారు కాపలాగా. మొదటివాడు తన షిఫ్ట్‌లో టైంపాస్ కోసమని ఒక అందమైన అమ్మాయి బొమ్మ చేశాడు. రెండో వాడు తన షిఫ్ట్‌లో ఆ బొమ్మకి చీరా, జాకెట్టూ, నగలూ అన్నీ అమర్చాడు. మూడో వాడికి తన షిఫ్ట్‌లో ఏం చేయాలో తోచలా... ఆలోచించి ఆలోచించి ఆ బొమ్మకు ప్రాణం పోశాడు.

అంతే...

కలర్ మరియు స్కోప్ జానపద చిత్రంలోలాగ వారి ముందు ప్రత్యక్షమయింది ఓ హీరోయిన్.

అప్పుడా కలకంఠి అడిగింది, 'యిప్పుడు మీ ముగ్గురిలో ఎవర్ని పెళ్ళి చేసుకోవాలి?' అని.

ఇప్పుడు చెప్పు మిస్టర్ విక్రమార్కా? క్లయిమాక్స్ ఏమయింది? ఏ నిరుద్యోగి రడీఅయ్యాడు హీరోలా పెళ్ళికి?"

ఒక్క నిమిషం ఆలోచించి విక్రమార్కుడు యిలా అన్నాడు "ఒరే పిచ్చి బేతాళా! వెనుక నేను రాజుగా ఉన్న కాలంలోని కథఇది. అయితే జవాబు చెప్పటానికి కనీసం నాకొక గంట పట్టేది. కానీ యిప్పుడో? ఒక నిమిషం చాలు. ఆ అమ్మాయిని ఏ నిరుద్యోగీ చేసుకోడు. కట్నం లేకుండా చేసుకుంటానికి మన కుర్రాళ్ళు మరీ అంత వెర్రిమొహాలనుకుంటున్నావా?

బహుశా ఆ తరువాత ఏమయి ఉంటుందంటే – మర్నాడు పేపర్లో ఓమూల ఇలా అని ఓ న్యూస్ పడి ఉంటుంది.

'అడవిలో స్త్రీపై అత్యాచారం – దుర్మరణం"'

– శోభన్, సురేష్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/402